





# భగవద్గీత

## విచారణ

## శ్రీగీతారాధన





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **మోహన్ పబ్లికేషన్స్** వారి వెబ్ సైట్: http://www.mohanpublications.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com.

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - **సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్:

## http://www.mohanpublications.com/

Mohan Publications - E Bc ×

www.mohanpublications.com/ebooks_category.php

mohan PUBLICATIONS

eBook Share Now

www.మోహన్ పబ్లికేషన్స్.com

Home | About | Book List | E-Books | E-Novels | Order Now

Just Releaded Books | Distribution Books | Premium E-Books | Free E-Books

**Books Catelogue**

- వ్రత కథలు - పూజలు
- స్తోత్రాలు - సుప్రభాతములు సహస్రనామాలు
- శ్రీ సాయి దత్త గ్రంధములు
- జ్యోతిషాలు
- వాస్తులు
- మంత్ర శాస్త్రాలు
- గ్రంధాలు - ఆరాధనలు
- వైద్య గ్రంధాలు

**Free E-Books Category**

- Devotional & Spiritual Books
- Pujas & Vrathas
- Sahasranama Books
- Jyothisham & Vaastu
- Puranas & Vedas
- Ayurveda & Homeopath

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రమ్,
శ్రీ లక్ష్మీ అష్టోత్తరశతనామస్తోత్రముల
సహితం

# శ్రీగీతారాధన

(శ్రీమద్భగవద్గీత - శ్లోకము - తాత్పర్యము,
పూజావిధానముతో...)

## నిత్యపారాయణ గ్రంథము

కీ॥శే॥ శ్రీ కె. కృష్ణమాచార్యులు
మోండామార్కెట్, సికింద్రాబాద్



ప్రకాశకులు : ☎ 246 2565
మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1.
2012 వెల : 81-00

శ్రీ గీతారాధన



శ్రీ కె. కృష్ణమాచార్యులు
మోండా మార్కెట్, సికింద్రాబాద్

కాపీలకు :
మోహన్ పబ్లికేషన్స్
కోట గుమ్మం - రాజమండ్రి - 533 101

## విషయసూచిక

## పీఠిక

సమస్త జనులనూ కార్యోన్ముఖులను చేయునట్టిదీ, సకల దర్శనాలకూ ఆదర్శమైనటి యీ గీతాశాస్త్రం. దీనిని ఆచంద్రార్కమనే లాగ సంశయాత్ములగు జిజ్ఞాసువులు మోక్షమందేలాగ భగవద్గీతలోకంలో ప్రవర్తింప చేయ బడింది. దీనికి ఎందరో తమకు తోచిన విధంగా భావ, టీకా, తాత్ప ర్యాలువ్రాసి బహుళప్రచారం గావిస్తున్నారు. జిజ్ఞాసువులు జాతి, మత, విచక్షణతను మాని వాస్తవ జ్ఞాన సముపార్జనం లక్ష్యంగా వ్రాసి ప్రకటింపవలయునని ఇట్లు చేసితిని. ఎవరెన్ని వ్యాఖ్యలు గీతకు చేసినా యింకా గీతార్థం మిగిలే ఉంటుంది. దీనిని శ్రద్ధతో పఠించు, భక్తపాఠక లోకానికి నా కృతజ్ఞతా పరంపరలు. పెద్దలకు నా నమోవాకములు.

॥ మంగళం మహత్ ॥

ఇట్లు
భవదీయ శుభాకాంక్షి
కె. కృష్ణమాచార్యులు

## దైవ ప్రార్థన

**కరుణామూర్తియగు ఓ దేవా!** మా చిత్తము సర్వకాల సర్వావస్థల యందును మీపాదార విందముల యందులగ్నమై అచంచల మైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము !

**పరమదయానిధీ!** ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువరకును మనోవాక్కాయములచే మా వలన ఎవరి కినీ అపకారము కలుగుకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

**సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా!** మా యంతఃకరణము లందు ఎన్నడును ఏవిధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసన గాని, అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహిం పుము.

**వేదాంతవేద్యా! అభయస్వరూపా!** మాయందు భక్తి, జ్ఞాన, వైరాగ్యబీజములంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగునట్లు ఆశీర్వ దింపుము మరియు ఈ జన్మమునందే కడతేరిన తరువాత మీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము.

**దేవా! నీవు భక్తవత్సలుడవు!** దీనులపాలిటి కల్పవృక్ష స్వరూపుడవు! నీవు తప్ప నాకు ఇంకెవరు దిక్కు! నిన్ను ఆశ్రయించి తిని. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము! తమస్సు నుండి జ్యోతి లోకానికి తీసుకొనిపొమ్ము, మృత్యువునుండి అమృతత్త్వమును పొందింపజేయుము ఇదే నావినతి. అనుగ్రహింపుము. నీదరి జేర్చుకొనుము. పాహిమాం! పాహిమాం! పాహి!!

ఓం తత్ సత్

–శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

(ఈప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమము తప్పక ఉదయము నిద్రలేచునపుడును, రాత్రి పరుండబోవునపుడు మనస్ఫూర్తిగా పఠింతురో అట్టివారికి జీవితమునందెలాటి దోషమున్ను కలుగు కుండుటయేగాక భగవంతునియొక్క యనుగ్రహమునకు వారు పాత్రులు కాగలరు)

## శాన్తి మంత్రములు

ఓమ్ సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వేసన్తు నిరామయాః
సర్వేభద్రాణి పశ్యన్తు, మాకశ్చిద్దుఃఖమాప్నుయాత్

ఓమ్ సర్వస్తరతు దుర్గాణి, సర్వోభద్రాణి దశ్యతు
సర్వస్సద్బుద్ధి మాప్నోతు, సర్వస్సర్వత్ర నన్దతు

ఓమ్ అసతోమా సద్గమయా తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

ఓమ్ శంనో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా
శం నో ఇన్ద్రో బృహస్పతిః శం నో విష్ణు రురుక్రమః
నమోబ్రహ్మణే నమస్తే వాయే త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి

ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి
తన్మామవతు, తద్వక్తారమవతు
అవతు మాం, అవతు వక్తారమ్
ఓమ్శాన్తిః శాన్తిః శాన్తిః

ఓమ్ పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే
ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

ఓమ్ సర్వేషాం స్వస్తిర్భవతు, ఓమ్ సర్వేషాం శాన్తిర్భవతు
ఓమ్ సర్వేషాం పూర్ణంభవతు, ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

శంభో శివ శివ శివ శివ శివ శివ
నారాయణ నారాయణ నారాయణ
ఓమ్ హరిః ఓమ్ తత్ సత్

## తారావిలాపం-భగవద్గీతకు మూలం

**(రామాయణ కిష్కింధకాండ 21 సర్గ)**

వాలి మరణానంతరం సుగ్రీవునితో సహా అందరూ అపారంగా శోకసాగరంలో మునిగున్నారు. యిక ఆతని అర్ధాంగి "తారాదేవి" గూర్చి వేరుగా చెప్పనక్కరయే లేదు. ఆమె దుఃఖభారంగల హృదయంతో కుమిలిపోయి భోరున యేడస్తుంది. ఆ సమయాన శ్రీరామ, లక్ష్మణ, సుగ్రీవ, జాంబవంత మొదలైన వారంతా శోకాన్ని విడువమని అనేక విధాల ప్రబోధించినా ఆమె విడువలేదు. అప్పుడు హనుమద్బ్రహ్మ ఆధ్యాత్మిక వాఙ్మరదంతో యిలా ఉద్ఘోషించాడు. తార వాలి కళేబరంపైబడి దొర్లి దొర్లి యేడుస్తుంది.

**శ్లో॥ గుణదోషకృతః జన్తుః స్వకర్మఫలహేతుకమ్ ।**
**అవ్యగ్రస్త దవాప్నోతి సర్వంప్రేత్యశుభాఽ శుభమ్ ॥**

**శ్లో॥ శోచ్యా శోచ్యసికిం శోచ్యం దీనం దీనామ కంపసే ।**
**కశ్చకస్యాను శోచ్యో ఽస్తి దేహస్మిన్ బుద్బుదోపమే ॥**

తారాదేవీ యెవరికొరకీ రోదనం! విరమించు, యెంతవారైనా దేహాన్ని ధరిస్తే ఎప్పుడో ఒకప్పుడు దానిని విడుచుట తథ్యం. వారివారి పాపపుణ్య కర్మ ఫలాలు అనుభవింపవలసిందే. పుణ్య పాపకర్మలు రెండూ వారితో నేగవలసిందే. నీభర్త వాలిగూడ అందరివలెనే తానుగావించే శుభాఽ శుభ కర్మలను అనుభవింప దానికే వెళ్లేడు, నీవీ సమయాన సుగ్రీవునిగాని, శ్రీరామ చంద్రునిగాని నిందించిన అణుమాత్రం ప్రయోజనం లేనేలేదు. వీరిరువురూ నీవలెనే నిమిత్తమాత్రులని భావించు.

ఓ దేవీ! యెంతటివారి శరీరాలైనా నీటిబుడగవలె అల్పకాలమే ఉంటాయి. శాశ్వతమైనవి కావని తెలిసికొమ్ము అందుచేత తక్షణం నీయేడుపు విరమించు. బాగా యోజిస్తే నీకొరకు నీవుయేడవాలి. నీవేదో ఘోరకర్మను పూర్వజన్మలో చేసియే ఉంటావు. అందులో సతీపతులను విడదీసి ఉంటావు. నీవప్పుడు నీకర్మాచరణగావిస్తే అదే యిప్పుడు నిన్నుకట్టి కుదుపుతుంది. యితరుల కర్మ నిన్నెన్నడూ బాధించదు. అందుకే నీ కర్మకొరకే యేడువు. పరులకొరకై యేడ్చుట పనికిరానితనం. నీవే దీనాతి దీనురాలవు. నిన్ను నీవుద్ధరించుకోలేని చాలా దీనదశలోఉన్నావు. అటువంటప్పుడు యితరుల గూర్చి యేడువనేల? పడబోయే వృక్షం పడుతున్న వృక్షాన్ని రక్షింపగలదా? గతాన్నివదిలి ఆగతానికై ఆక్రోశించు. నీ పుత్రుడంగదుడు పిల్లవాడు ఆతని రక్షణ గావించు. యిలా రామాయణమున చెప్పినదే శ్రీవ్యాసులవారు గీతలో "అశోచ్యామన్వశోచస్త్వం" అను శ్లోకం మొదలు 701 శ్లోకాలు వ్రాసారు. పరమశివ 11వ అవతారమైన హనుమద్బ్రహ్మ కిష్కింధకాండ 21సర్గ అంతా 16 శ్లోకాల్లో యిదంతా నిక్షిప్తం గావించారు; దీనినే 18 అధ్యాయలుగా వ్రాసారు శ్రీ వేదవ్యాసులవారు. అంతే కాదు శ్రీ మద్భగవద్గీతా ప్రబోధాన్ని అర్జునునకు శ్రీకృష్ణపరమాత్మ గావిస్తున్నప్పుడు ఆతని జెండాపైనున్న హనుమద్బ్రహ్మ ప్రథమశోత. తాను గావించిన తారాప్రబోధమే యీరూపంగా విస్తరించి విశ్వానికి పనికొచ్చినట్లు పరమాత్మ ప్రబోధిస్తున్నాడని పరవశించిపోయాడు. అందువలన ముందు హనుమద్గీతయే తరువాత భగవద్గీతయైనదని విజ్ఞులకు విన్నవించుకొనుచున్నాను. యీఅవకాశాన్నిచ్చిన "మోహన్‌పబ్లికేషన్స్"వారిని నిరంతరం గీతాపారాయణం గావించు మిమ్మూ నన్నూ నిరంతరం హనుమద్బ్రహ్మ రక్షణగావించుగాక!

–శతాధిక గ్రంథకర్త–కవిమత్తేభ–**విద్యారణ్యస్వామి**,రాజమండ్రి.

## *గీతాంజలి*

శ్లో॥ గీతా కల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురమ్

శ్లో॥ నానాశాస్త్ర రహస్యశాఖ మరతి క్షాంతి ప్రవాలాంకితం
కృష్ణాంఘ్రిద్వయభక్తి పుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్.

"గీతయను కల్పవృక్షమును నేను సేవించుచున్నాను. అది భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మచే నాటబడింది. వేదవ్యాస మహర్షిచే పెంచబడింది. ఉపనిషత్తులే దాని విత్తనము. ఆత్మ ప్రబోధము దాని అంకురము. వివిధ శాస్త్రములయొక్క రహస్యములు దాని కొమ్మలు. వైరాగ్యము, సహనము మున్నగు సద్గుణములు దాని చిగురుటాకులు, శ్రీకృష్ణపరమాత్మయొక్క పాదపద్మముల యెడల భక్తి దాని పుష్ప సుగంధము మరియు నది జ్ఞానులకు మోక్షదాయకమైనది."

## **కృతజ్ఞత**

**గీతను బోధించిన శ్రీకృష్ణపరమాత్మకు**
**గీతకు నిమిత్తమాత్రుడైన అర్జునునకు**
**గీతను ఛందోబద్ధమొనర్చి ప్రకటించిన శ్రీవేదవ్యాసమహర్షికి**
**గీతను లిఖించిన శ్రీ విఘ్నేశ్వరునకు**
**గీతను ఓం ప్రథమముగ ప్రచారమొనర్చిన సంజయునకు**
**గీతయొక్క తాళపత్రములను కాలగర్భమున చెడకుండ**
**కాపాడి లోకమునకొసంగిన పుణ్యాత్ములకు**
**గీతయొక్క సూక్ష్మభావములను ప్రస్ఫుట మొనర్చిన**
**ఒనర్చుచున్న భాష్యకారులకు**
**గీతను ఇంటింటికి వ్యాపింపజేసిన, చేయుచున్న గీతాప్రచారకులకు**
**లోకమెంతయో ఋణపడియున్నది. గీతను శ్రద్ధాభక్తులతో పఠించి అందలి భావములను చక్కగ అనుష్ఠించుట ద్వారా మాత్రమే వారి ఋణమును జనులు తీర్చుకొనగలరు.**

## గీతకు గల 18 పేర్లు

1. గీతా గంగేచ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తి గేహినీ ॥
2. అర్ధమాత్రా చిదానందా భవఘ్నీ భ్రాన్తినాశినీ ।
వేదత్రయీ వరాఽనన్తా తత్త్వార్ధ జ్ఞానమంజరీ ॥
3. ఇత్యేతాని జపేన్నిత్యం నరో నిశ్చలమానసః।
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం తథాన్తే పరమం పదమ్ ॥

గీతకు ఈ క్రింది పేర్లు కలవు

1. గీత 2. గంగ 3. గాయత్రి 4. సీత 5. సత్య 6. సరస్వతి 7. బ్రహ్మవిద్య 8. బ్రహ్మవల్లి 9. త్రిసంధ్య 10. ముక్తిగేహిని 11. అర్ధమాత్ర 12. చిదానంద 13. భవఘ్ని 14. భ్రాన్తినాశిని 15. వేదత్రయి 16. పర 17. అనంత 18. తత్త్వార్ధజ్ఞానమంజరి.

ఈ పదునెనిమిది గీతానామములను ఎవడు నిశ్చలచిత్తుడై సదా జపించుచుండునో అతనికి శీఘ్రముగ జ్ఞానసిద్ధియు, తుదకు పరమాత్మ పదప్రాప్తియు లభించును.

## గీతలోని సాక్షాత్ ఉపనిషద్వాక్యములు

గీతలో కొన్నిచోట్ల ఉపనిషద్వాక్యములు ఉన్నవి ఉన్నట్లుగనే పేర్కొనబడినవి.

అవి యేవియనిన :

1. న జాయతే మ్రియతే వాకదాచిత్.. 2–20
2. ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తినహన్యతే.. 2–19
3. ఆశ్చర్యవత్పశ్యతి.. 2–29
4. యదక్షఱం వేదవిదో వదన్తి.. 8–11
5. సర్వతః పాణిపాదం తత్ 13–14
6. సర్వేన్ద్రియగుణాభాసం 13–15
7. దూరస్థం చాన్తికే చ తత్ 13–16
8. ఉర్ధ్వమూలమధః శాఖమ్ 15–1

## అధ్యాయానుక్రమముగ గీతయందలి వ్యక్తులు చెప్పిన శ్లోకముల సంఖ్య

| అధ్యాయము | ధృతరాష్ట్రుడు | సంజయుడు | అర్జునుడు | శ్రీకృష్ణుడు | అధ్యాయములోని శ్లో॥సంఖ్య | ఆయా వ్యక్తులు చెప్పినమొత్తము శ్లో॥ సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 25 | 21 | -- | 47 | |
| 2 | – | 3 | 6 | 63 | 72 | |
| 3 | – | – | 3 | 40 | 43 | |
| 4 | – | – | 1 | 41 | 42 | |
| 5 | – | – | 1 | 28 | 29 | |
| 6 | – | – | 5 | 42 | 47 | శ్రీకృష్ణుడు 574 |
| 7 | – | – | – | 30 | 30 | అర్జునుడు 85 |
| 8 | – | – | 2 | 26 | 28 | సంజయుడు 41 |
| 9 | – | – | – | 34 | 34 | ధృతరాష్ట్రుడు 1 |
| 10 | – | – | 7 | 35 | 42 | |
| 11 | – | 8 | 33 | 14 | 55 | మొత్తము 701 |
| 12 | – | – | 1 | 19 | 20 | |
| 13 | – | – | 1 | 34 | 35 | –గీతాశ్లోకములు |
| 14 | – | – | 1 | 26 | 27 | |
| 15 | – | – | – | 20 | 20 | |
| 16 | – | – | – | 24 | 24 | |
| 17 | – | – | 1 | 27 | 28 | |
| 18 | – | 5 | 2 | 71 | 78 | |
| | 1 | 41 | 85 | 574 | 701 | |

## గీతా శ్లోకముల ఛందోవివరణ

గీతయందు 5 ఛందస్సులు వాడబడినవి. అవి 'అనుష్టుప్' ఇంద్రవజ్ర, ఉపేంద్ర వజ్ర, ఉపజాతి, విపరీతపూర్వ అను నామములు గలిగియున్నవి ఏయే అధ్యాయమందు ఏయే శ్లోకములు ఏయే ఛందస్సులలో నుపయోగింపబడినవో ఆ వివరములన్నియు ఈ క్రింద తెలుపబడినవి. అవికాక మిగిలిన శ్లోకము లెవ్వికలవో అవి అన్నియు అనుష్టుప్ ఛందస్సులోనే కలవు. వాని సంఖ్య మొత్తము 646.

| ఛందస్సు | అధ్యాయం | శ్లోకములనంబరు | మొత్తం | |
|---|---|---|---|---|
| ఇంద్రవజ్ర | 2 | 7,29 | 2 | |
| ఇంద్రవజ్ర | 8 | 28 | 1 | |
| ఇంద్రవజ్ర | 9 | 20 | 1 | |
| ఇంద్రవజ్ర | 11 | 20,22,27,30 | 4 | |
| ఇంద్రవజ్ర | 15 | 5,15 | 2 | |
| ఉపేంద్రవజ్ర | 11 | 18,28,29,45 | 4 | అనుష్టుప్ 646శ్లో. |
| ఉపజాతి | 2 | 5,6,8,20,22,70 | 6 | ఇంద్రవజ్ర 10శ్లో. |
| ఉపజాతి | 8 | 9,10,11 | 3 | |
| ఉపజాతి | 9 | 21 | 1 | ఉపేంద్రవజ్ర 4శ్లో. |
| ఉపజాతి | 11 | 15,16,17,19,21<br>23,24,25,26<br>31,32,33,34,36<br>38,40,41,42,43<br>46,47,48,49,50 | 24 | ఉపజాతి 37శ్లో<br>విపరీతపూర్వ 4శ్లో.<br>గీతలోమొత్తం701శ్లో. |
| ఉపజాతి | 15 | 2,3,4 | 3 | |
| విపరీతపూర్వ | 11 | 35,37,39,44 | 4 | |

## నాలుగు గకారములు

శ్లో॥ గీతా గంగా చ గాయత్రీ గోవిన్దేతి హృదిస్థితే
చతుర్గకారసంయుక్తే పునర్జన్మ నవిద్యతే॥ (మహాభారతము)

గీత
గంగ
గాయత్రి
గోవిందుడు } అను గకారముతో ప్రారంభించు నాలుగింటిని ఎవడు కలిగియుండునో, అట్టి వానికి పునర్జన్మ లేదు.(అనగా జననమరణ రూపమగు సంసార దుఃఖమునుండి ఆతడు విముక్తినొంది కైవల్య పదవి నధిష్ఠించునని భావము. గీతాధ్యయనము,గంగా స్నానము, గాయత్రీ మంత్రజపము, గోవిందుని ధ్యానము జీవితములో అతిముఖ్యము లని గమనించవలెను.)

## గీతయందలి కృష్ణుని నామములు

గీతయందు శ్రీకృష్ణపరమాత్మకు ఈ క్రింది నామధేయములు వాడబడినవి.



| | | |
|---|---|---|
| అచ్యుతుడు | ఆద్యుడు | కేశినిషూదనుడు |
| అనంతుడు | కమలపత్రాక్షుడు | గోవిందుడు |
| అప్రతిమప్రభావుడు | కృష్ణుడు | జగత్పతి |
| అరిసూదనుడు | కేశవుడు | జగన్నివాసుడు |
| జనార్ధనుడు | భూతభావనుడు | వార్ష్ణేయుడు |
| దేవుడు | భూతేశుడు | వాసుదేవుడు |
| దేవదేవుడు | మధుసూదనుడు | విశ్వమూర్తి |
| దేవవరుడు | మహాత్ముడు | విష్ణువు |
| దేవేశుడు | మహాబాహుడు | విశ్వేశ్వరుడు |
| పరమేశ్వరుడు | మాధవుడు | సర్వుడు |
| పురుషోత్తముడు | యాదవుడు | సహస్రబాహువు |
| ప్రభువు | యోగి | హృషీకేశుడు |
| భగవంతుడు | యోగేశ్వరుడు | |



## గీతయందలి అర్జునుడి నామములు

గీతయందు అర్జునునకు ఈ క్రింది నామధేయములు వాడబడినవి.

| | | |
|---|---|---|
| అనఘుడు | కురుసత్తముడు | పార్థుడు |
| అనసూయుడు | కౌన్తేయుడు | పురుషర్షభుడు |
| అర్జునుడు | గుడాకేశుడు | భరతర్షభుడు |
| కపిధ్వజుడు | తాత | భరతశ్రేష్ఠుడు |
| కిరీటి | దేహభృతాంవరుడు | భరతసత్తముడు |
| కురుప్రవీరుడు | ధనంజయుడు | భారతుడు |
| కురునందనుడు | పరన్తపుడు | మహాబాహువు |
| కురుశ్రేష్ఠుడు | పాండవుడు | సవ్యసాచి |

## గీతయొక్క పలువిధ రూపములు




- శ్రీకృష్ణభగవానుని దూత
- వ్యాసమునీంద్రుని వ్రాత
- వేదమంత్రముల శ్రోత
- అహంకారాదులకు కోత
- దివ్యజ్ఞానమునకు దాత
- అసురస్వభావమునకు వాత
- దైవీసంపదకు నేత
- పరమార్థదృష్టికి మాత
- రాగద్వేషములకు మూత
- కైవల్యపథమునకు సీత
- ప్రణవనాదమునకు గాత
- భవసాగరమునకు ఈత
- ముముక్షు జనులకు ఊత
- ప్రకృతి సామ్రాజ్యమునకు జేత
- ధర్మామృతమునకు పోత

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.



*"Those of you who know Sanskrit should tomorrow, if possible today buy the Gita and begin to study the book. Those of you who do not knwo Sanskrit, shoulw study Sanskrit, it only for the sake of the Gita. I tell you that it contains treasures of knowledge of which you have no conception whatsoever" - Mahatama Gandhi*

**మీకు సంస్కృత భాషాజ్ఞానం ఉంటే వెంటనే "భగవద్గీత"ను కొని చదవండి. సంస్కృత భాష రాకపోతే ముందుగా సంస్కృత భాషను గీతార్థ జ్ఞానం కోసమైనా త్వరగా నేర్చుకోండి. ఎందుకోసం నేను మిమ్మల్ని గీత చదువమంటున్నానంటే మీరు ఏవిధంగా ఈ జగత్తులో కనీవినీ ఎరుగనంతటి మహాజ్ఞాన సంపదకు గీతనిలయమై ఉందని.**

**-మహాత్మాగాంధీ**

*"When doubts haunt me, when disappointments stare me in the face and when I see not one ray of light one the horizon I trun to Bhagavadgita and find a verse of comfort me and I Immediately begin to smilein the midst of overwhelming sorrow. Mylife has been full of external tragedies and if they had not left any visible and indelible effect on me I owe it to the teachings of Bhagavadgita".*

*- MAHATAMA GANDHI*

## జీవిత కష్టాలకు గీత ఓ అద్భుతమైన సంజీవిని

నా మనస్సు సందేహాలతో నిండిపోయినప్పుడు, నిరాశా, నిస్పృహలు నా మనస్సుని క్రుంగతీసేటప్పుడు, ఏ ఆశాకిరణం కనుచూపుమేరలో కానరానివేళ, ఒక్కసారి "భగవద్గీత"ను చదవడం మొదలు పెట్టానా ఏవీ ఆ కష్టసాగర తరంగాలు? మాయం. బాహ్య ప్రపంచం అంతా కష్టాలతో కరుడు కట్టుకుపోయిన అంతరాత్మ అంతా చెప్పలేనంత శాంతిభరితమై ఉంటుంది. నిజంగా ఇది అంతా ఆ గీత మూలంగా ఏర్పడినదే! దాని ప్రభావం అంతటిది.

–మహాత్మాగాంధీ





*GITA = "Truths beautifully arranged together in their proper places like a fine garland or a bouquet of choicest flowers"*

*- Swamy VIVEKANANDA*

**పూలమాలలోగాని, పుష్పగుచ్ఛంలోగాని ఎన్నుకొన్న చక్కని పూలను కావలసిన పద్ధతిలో కూర్చిన విధంగా గీతలో వాస్తవ విషయాలు ఏర్పరచ బడ్డాయి.**

**-స్వామి వివేకానంద.**

## *MESSAGE OF THE GITA "BE FEARLESS"*

**శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థనైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥**

పార్థా ! నీవు పిరికివానివలె మాట్లాడుతున్నావేమిటి? ఇది నీకు తగిందేనా? ధైర్యాన్ని విడిచిపెట్టడం ఎంత నీచం ? గుండె నిబ్బరం చేసుకో ! యుద్ధానికి నడుం కట్టు.

*If one reads this one sloka he gets all the merits of reading the entire Gita, for in this one sloka lies imbedded the whole message of the Gita. -Swamy VIVEKANANADA*

ఎవరైనా పై ఒక్క శ్లోకం చదివినట్లైతే మొత్తం గీత అంతా చదివినట్లు గోచరమౌతుంది. ఈ శ్లోకంలో గీతార్థసారం అంతా చక్కని క్రమంలో ఇమడ్చబడింది.

–స్వామివివేకానంద

## ఏక శ్లోకీ భగవద్గీత

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ. (గీత : 18-78)

**భావము : ఎచట యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడును, ఎచట ధనుర్ధారి యగు అర్జునుడు ఉందురో, అచ్చట లక్ష్మి విజయము, ఐశ్వర్యము, నీతి తప్పక ఉండునని నా నిశ్చయము.** -సంజయుడు

## సప్త శ్లోకీ భగవద్గీత

శ్లో॥కవింపురాణమనుశాసితారమణోరమణీయాంసమనుస్మరేద్యః।
సర్వస్యధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్॥

శ్లో॥ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥

శ్లో॥మన్మనా భవమద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్ త్వైవ మాత్మానం మత్పరాయణః॥

శ్లో॥స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః॥

శ్లో॥సర్వతః పాణిపాదం తత్సర్వతోక్షిశిరోముఖం ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥

శ్లో॥ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తంవేద స వేదవిత్ ॥

శ్లో॥సర్వస్య చాహం హృదిసన్నివిష్టోమత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్త కృద్వేదవిదేవ చాహమ్॥



"దాసోఽహం కోసలేంద్రస్య రామస్యక్లిష్టకర్మణః"

## శ్రీ గీతారాధన

మంగళశ్లోకాః

శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ - సర్వవిఘ్నోపశాంతయే

శ్లో॥ శ్రీ వాగ్దేవీం మహాకాళీం - మహాలక్ష్మీం సరస్వతీం
త్రిశక్తిరూపిణీ మంబాం - దుర్గాంచండీం నమామ్యహమ్

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ - మంగళాయ బుధాయచ
గురుశుక్ర శనిభ్యశ్చ - రాహవే కేతవే నమః

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః । ర్గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మా - తస్మై శ్రీ గురవే నమః

శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం - శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే - శుకతాతం తపోనిధిమ్ ॥

శ్లో॥ ఆపదామపహర్తారం - దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం - భూయోభూయో నమామ్యహమ్

ఇతి మంగళాచరణమ్

శ్రీరస్తు

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

## ధ్యాన శ్లోకములు

## గీతను పారాయణ చేయుపద్ధతి

గీతా పారాయణ చేయుటకు ముందుగా ఈ క్రింది శ్లోకములను నుచ్ఛరించుచు వందన మాచరింపవలయును.

ఓం శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

1. ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
   ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే
2. ఓమ్ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్
   తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురువే నమః
3. ఓమ్ కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్
   వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్
4. ఓమ్ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
   నమో వైబ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః
5. ఓమ్ నారాయణం నమస్కృత్యనరం చైవ నరోత్తమమ్
   దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్.

ఈ ప్రకారముగ వందన మాచరించిన పిదప భగవంతుడగు శ్రీకృష్ణ పరమాత్మను, వేదవ్యాస మహర్షిని, గీతాగ్రంథమును భక్తి పూర్వక ముగ పూజింపవలయును. పిమ్మట ఈ క్రింది విధముగ పారాయణ కుపక్రమింప వలెను. (పారాయణము చేయునపుడు శ్లోక సంఖ్యగాని, అధ్యాయముల సంఖ్యగాని ప్రధానముగా గైకొనక, మనస్సు శ్రీకృష్ణ పరమాత్మ యందు, గీతాభావార్థమందు సంలగ్నమై యున్నదాయని విచారించు చుండవలెను. కురుక్షేత్ర రణరంగమున ఇరుసేనల మధ్య రథముపై గూర్చొని శ్రీకృష్ణపరమాత్మ దీనవదనుడై యున్నఅర్జునునకు హితబోధ గావించు చున్న దృశ్యమును హృదయ ఫలకమున చిత్రించు కొనవలయును. మరియు తన నర్జునిగ భావించుకొని సాక్షాత్ శ్రీకృష్ణమూర్తి ఎదురుగ నుండి తనకు బోధించుచున్నట్లు ఊహించవలెను. ఇవ్విధముగ పారా



యణ సమయమున చిత్తమెంత ఏకాగ్రముగ నుండునో, ఫలితమున్ను అంతకంత అధికముగ గలుగుచుం డును) పారాయణము యొక్క వినియోగమును ఈ క్రింద తెలుపబడిన రీతిగ జరుపవలయును.

వినియోగము : కుడిచేతి ఉంగరపువ్రేలికి దర్భయొక్క పవిత్రి ధరించి చేతితో నీళ్ళుతీసుకొని ఈ క్రింది వాక్యమును పలికి పళ్ళె ములో వదలవలెను.

ఓమ్ అస్య శ్రీ భగవద్గీతాశాస్త్ర మహామన్త్రస్య శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీకృష్ణపరమాత్మా దేవతా, అశోచ్యానన్వశోచస్త్వ మితి బీజం, సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకమ్, మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యదతి కవచమ్, కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రమ్, అనాది మధ్యాన్త మనన్తవీర్య మితి ధ్యానమ్, జ్ఞానయజ్ఞేన భగవతారాధనార్థే శ్రీకృష్ణ పరమాత్మ ప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః



(పిమ్మట కరన్యాస, అంగన్యాసములను గావింపవలెను.) ఆ పద్ధతి ఈక్రింద తెలుపబడుచున్నది. తనయొక్క అవయవము లన్నియు పరమాత్మ చైతన్యముచే, సత్తుచే పరిపూర్ణమై యున్నవని భావించుటయే "న్యాసము"యొక్క ఉద్దేశము దీనిచే జపించువాడు లేక పారాయణము సలుపువాడు మంత్రమయుడై ఆయా మంత్రదేవ తలచే రక్షింపబడు చుండును. మరియు అతని బాహ్యాంతరములు శుద్ధమగును.దివ్యబలము చేకూరును. సాధన నిర్విఘ్నముగ జరిగి పరమలాభదాయకమై యొప్పను.)

### అథ అంగన్యాసః

ఓం అస్యశ్రీ భగవద్గీతామాలామంత్రస్య । భగవాన్ వేదవ్యాస ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీ కృష్ణపరమాత్మా దేవతా ॥

### కరన్యాసము

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
ఇత్యంగుష్ఠాభ్యాం నమః

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

**( ఈమంత్రమును పఠించి రెండు చేతుల బొటనవ్రేళ్ళను రెండు చూపుడు వ్రేళ్ళతో స్పృశింపవలెను.)**

నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః
ఇతి తర్జనీభ్యాం నమః

**(అనుచు రెండు బొటనవ్రేళ్ళతో రెండు నడిమివ్రేళ్ళను తాక వలెను.)**

అచ్ఛేద్యోయమదాహ్యోయమక్లేద్యోఽశోష్యఏ వ చ
- ఇతి మధ్యమాభ్యాం నమః

**(అనుచు రెండుబొటనవ్రేళ్ళతో రెండు నడిమివ్రేళ్ళను స్పృశింప వలెను.)**

నిత్యం సర్వగతః స్థాణు రచలోయం సనాతనః
-ఇత్యనామికాభ్యాం నమః

**(అనుచు రెండు బొటనవ్రేళ్ళతో రెండు ఉంగరపువ్రేళ్ళను తాక వలెను.)**

పశ్యమేపార్థ! రూపాణి శతశోథ సహస్రశః
-ఇతి కనిష్ఠికాభ్యాం నమః

**(అనుచు రెండు బొటనవ్రేళ్ళతోరెండుచిటికెనవ్రేళ్ళను స్పృశించ వలెను.)**

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ
-కరతలకరపృష్ఠాభ్యాం నమః

**(అనుచు కుడిచేతి క్రింద ఎడమచేతిని, ఎడమచేతి క్రింద కుడి చేతిని ఉంచవలెను. అనగా అరచేతులు, వాని వెనుకవైపులు క్రమ ముగ తాకవలెను.)**

**(ఈ ప్రకారముగ కరన్యాసము గావించి అటుపిమ్మట అంగ న్యాస మును చేయవలెను.)**

## అథ హృదయాదిన్యాసః

నైనం ఛిన్దన్తిశస్త్రాణి,నైనందహతి పావకః ఇతి హృదయాయనమః
(అనిచెప్పి కుడిచేతితో హృదయమును తాకవలెను.)

నచైవం క్లేదయంత్యాపోనశోషయతి మారుతః శిరసేస్వాహా
(అని చెప్పి శిరస్సును స్పృశించవలయును.)



అచ్ఛేఽద్యోయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ
- ఇతి శిఖాయై వషట్

**(అని పఠించి శిఖను తాకవలెను.)**

నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః
- ఇతి కవచాయ హుమ్

**(అని చెప్పి కుడిచేతితో ఎడమ భుజమును, ఎడమ చేతితో కుడి భుజమును స్పృశించవలయును)**

పశ్యమే పార్థ! రూపాణి శతశోథ సహస్రశః
-ఇతి నేత్ర త్రయాయ వౌషట్

**(అని పఠించి కుడిచేతితో నేత్రములను తాకవలెను.)**

వౌషట్ నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని ఇత్యస్త్రాయఫట్

**(అని పఠించి కుడిచేతిని, శిరస్సు చుట్టును త్రిప్పి చూపుడు, మధ్య వేళ్ళతో ఎడమచేతిమీద చప్పట్లు కొట్టవలెను.)**

**(ఈ ప్రకారముగ న్యాసమొనర్చి అటుపిమ్మట మనస్సును ఏకాగ్ర తతో భక్తిపూర్వకముగ ధ్యానించవలెను.)**

## అథ గీతా ధ్యానమ్

శ్లో॥పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం।
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతం।
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ! త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥

**తా. శ్రీ భగవంతుడగు శ్రీమన్నారాయణ రూపుడైన శ్రీకృష్ణునిచేత అర్జునునకు బోధించియుండిన, పురాణములకు కర్తృవైన వ్యాస మహర్షిచేత మహాభారత మధ్యమునందు ఛందోబద్ధముగ జేర్చి యుండిన, అద్వైతామృత మునుగార్చుచుండిన, షడ్గుణైశ్వర్యయుక్తురాలగు పదునెనిమిది అధ్యాయము లతో గూడియుండిన మరియు ప్రాపంచ దుః ఖములను ద్వేషించు తల్లీ ! ఓ భగవద్గీతా ! నిన్ను హృదయమునందు ధ్యానించుచున్నాను.**

శ్లో॥ నమోస్తుతే వ్యాస! విశాలబుద్ధేఫుల్లారవిం దాయత పత్రనేత్ర
యేన త్వయా భారత తైలపూర్ణ ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః

తా. విస్తారమైన బుద్ధిగలిగినవాడునూ, వికసించిన కలువపూలపు రేకులవలె దీర్ఘములైన కన్నులు గలిగినవాడగు ఓ వ్యాసుడా, ఏది నీ నుండి భారతతైల పూర్ణజ్ఞానప్రదానమైన ప్రదీపము ప్రజ్వలింపబడెనో అట్టి నీకోస రము నమస్కారము.

శ్లో॥ ప్రపన్న పారిజాతాయ తోత్త్రవేత్రైక పాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః॥

తా. శరణాగాతులకు కల్పతరువుగను, ఒక చేతియందు సెలగోలును ధరించినవాడును, ఇంకొక చేతియందు జ్ఞానముద్రను ధరించి గీతామృత మును గార్చుచుండు శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః।
పార్థోవత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥

ఉపనిషత్తులే ఆవులుగ, శ్రీకృష్ణుని పాలుపిండు వాడుగ, అర్జునుని లేతదూడగ జేసి పిండబడిన పాలను గీతామృతమును త్రాగువారే భవ్య మతులు.

శ్లో॥ వసుదేవ సుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

తా. కంస చాణూరులను దుష్టులను మల్లయుద్ధముచేత మర్దించిన వాడును, తన బాలలీలచేత దేవకీదేవికి పరమానందము గలుగ జేసిన వాడును, గీతోపదేశముచేత జగత్తుకు గురువైన శ్రీకృష్ణపరమాత్మను నమస్క రించుచున్నాను.

శ్లో॥ భీష్మద్రోణతటా జయద్రథజలా గాన్ధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ॥
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ ।
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః॥

తా. భీష్మద్రోణులను తీరముగలిగి, జయద్రధుడను నీళ్ళనుండి నిండిన దగుచు, సైన్ధవుడను నల్లకలువచే వికసించి, శల్యుడను మొసలి



కలిగి, కృపాచార్యుడను త్రోవగా గలిగి, కర్ణుడను అల్లకల్లోలముగలిగి, అశ్వత్థామ వికర్ణులను పెద్దచేపలతోగూడి, దుర్యోధనుడనుసుళిగా గలిగిన భయంకరమగు రణనదిని కృష్ణుడను నావికునిచేత పాండవులు దాటిరి.

శ్లో॥ పారాశర్యవచః సరోజమమలం గీతార్థగన్ధోత్కటం।
నానాఖ్యానకకేసరం హరికథా సమ్బోధనాబోధితమ్॥
లోకే సజ్జనషట్ పదైరహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమల ప్రధ్వంసి నఃశ్రేయసే॥

తా. వ్యాసునియొక్క మాటలను సరోవరమునుండి యుద్భవించిన దియూ, నిర్మలమైనదియూ, గీతార్థమను గొప్పదియగు సువాసన గలిగిన దియూ, నానా చరిత్రలను కేసరములు గలిగినదియూ, శ్రీకృష్ణపరమాత్మ యొక్క కథయను సూర్యుని కిరణములచేత వికసించినదియూ, లోక మందు సర్పురుషులను తుమ్మెదలనుండి ప్రతిదినమూ సంతసముచే అనత్యాదర పూర్వకముగ మకరంద పానము జేయుచు శోభాయ మానమయి కలికాల ముచే నుద్భవించు పాపములను నాశముజేయు భారతమను కమలము మాకు శ్రేయమగుగాక.

శ్లో॥ మూకం కరోతి వాచాలమ్ పంగులం లంఘయతేగిరిమ్।
యత్కృపా తమహం వందేపరమానందమాధవం॥

తా. ఎవని కృపచేమూగవాడు మాటలాడునో కుంటివాడు పర్వత ములను దాటిబోవునో, అట్టి పరమాత్మ స్వరూపుడగు శ్రీకృష్ణ పరమాత్ముని నమస్కరించుచున్నాను.

శ్లో॥ యం బ్రహ్మా వరుణేన్ద్రరుద్రమరుతః స్తున్వన్తి దివ్యైః స్తవై
ర్వేదైః సాంగపదక్రమోపనిషదై - ర్గాయన్తి యం సామగాః
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదుః సురాసురగణా దేవాయ తస్మైనమః

తా. దేనిని బ్రహ్మ, వరుణ, ఇంద్ర, రుద్ర, మరుద్గణములు దివ్యము లగు స్తోత్రములచే స్తుతించెదరో, మరియు సామవేదమును తెల్పువారు దేనిని అంగపదక్రమములచేతనూ యుపనిషత్సహితములగు వేదముల చేతను గానము జేయుదురో, తద్రీతిగ యోగిజనులు ధ్యానావస్థితులై ఏకాగ్ర

చిత్తముజేత దేనిని జూచుచుందురో, దేహరాక్షస సమూహామూ సహదేవి యొక్క అంతమును దెలియరో, అట్టి పరబ్రహ్మకు (శ్రీకృష్ణపరమాత్మకు) నమస్కారము.

శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యా కిమన్యై శ్శాస్త్రవిస్తరైః।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా॥

తా. స్వయముగ శ్రీకృష్ణ పరమాత్మయొక్క ముఖమములనుండి పుట్టిన ఏగీతయున్నదో, దానినే చక్కగ పఠించవలె. ఇతర శాస్త్రములు విప్పివిప్పి చూచుదానివలన నేమిలాభము.

## మహాభారత ధ్యానము

పారాశర్యవచః సరోజ మమలం గీతార్థగన్ధోత్కటం
నానాఖ్యానక కేసరం హరికథా సమ్బోధనా బోధితమ్
లోకే సజ్జన షట్పదైరహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమల ప్రధ్వంసినః శ్రేయసే

## శ్రీకృష్ణ ధ్యానమ్

ఓమ్ ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః
వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్
దేవకీ పరమానంతం కృష్ణం వన్దేజగద్గురుమ్.
భీష్మద్రోణ తటా జయద్రథజలా గాన్ధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా
అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణాఖలు పాణ్డవైరణనదీ కైవర్తకః కేశవః
మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతేగిరిమ్
యత్కృపాతమహం వన్దే పరమానన్దమాధవమ్
యంబ్రహ్మా వరుణేన్ద్ర రుద్రమరుతః స్తున్వన్తి దివ్యైఃస్తవై
వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయన్తి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదుస్సురాఽసురగణా దేవాయ తస్మై నమః



## శ్రీవ్యాస ధ్యానమ్

ఓమ్ నమోస్తుతే వ్యాస విశాలబుద్ధే పుల్లారవిన్దాయత పత్రనేత్ర
యేనత్వయా భారత తైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః

ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మను, శ్రీవేదవ్యాసులను శ్రీ గీతా మాతను, శ్రీ మహాభాతరమును ధ్యానించి, ఆ పిదప గీతా పారాయణ మును ప్రారంభించవలెను. ప్రతిదినము ఒక్క అధ్యాయమును పూర్తిగ పారాయణము చేయుట మంచిది. పారాయణము పూర్తి అయిన పిదప గీతామాహాత్మ్యమును చదువవలెను. ఇది శిష్టాచారము ఇరువది మూడు శ్లోకములతోగూడిన (వరాహపురా ణాంతర్గతమగు) "గీతామాహా త్మ్యము" ఎక్కువగ వాడుకలో కలదు. దానిని ఈ క్రింద పొందుపరచు చున్నాము. పారాయణానంతరము అందు రెండు శ్లోకములు చదువ వచ్చును.



## శ్రీ గీతారాధన పూజావిధానము

గీత ఒకానొక గ్రంథముకాదు. కేవల చైతన్యమూర్తి. సాక్షాత్ దేవి. కావున వ్యక్తికి వలెనే గీతకున్నూ అర్చన సలుపబడు చున్నది. ఆ పూజావిధా నము ఈ క్రింద తెలుపబడినది. పవిత్రమగు ఏకాదశీ దినమునగాని, కృష్ణాష్టమి మున్నగు పర్వదినములందుగాని, గీతాజయంతి (మార్గశిర శుద్ధ ఏకాదశి) సందర్భమునగాని, లేక మరియే ఇతర పవిత్ర సమయము లందు గాని లేక ప్రతినిత్యముగాని ఈ గీతాపూజను గావింపవచ్చును. భగవంతునకు, భగవత్వాణికిని అవినాభావ సంబంధము కలదు. కనుక గీతను పూజించినచో సాక్షాత్ పరమాత్మను పూజించినట్లే యగును. మరియు భగవదారాధనచే లభించు ఫలితమున్నూ లభించును. వాస్తవ ముగా గీతావాక్యములను అనుష్టించుటయే గీతయొక్క నిజమైన పూజ అయినప్పటికిని, ఈ బాహ్యాపూజయు జనులకు ఆవశ్యకమే అయి యున్నది. ఇకపూజావిధానము తెలుపబడు చున్నది.

ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్

(పై ప్రార్థనా శ్లోకములనుపఠించి ఆ పిదప ముమ్మారు ఆచమనము చేయవలెను.)

ఓం కేశవాయస్వాహా, ఓం నారాయనాయస్వాహా, ఓం మాధవాయ స్వాహా, గోవిందాయనమః విష్ణవే నమః మధుసూదనాయ నమః త్రివిక్రమాయ నమః వామనాయనమః శ్రీధరాయనమః హృషీ కేశాయ నమః పద్మనాభాయనమఃదామోదరాయ నమః సంకర్షణాయ నమః వాసుదేవాయ నమః ప్రద్యుమ్నాయ నమః అనిరుద్ధాయ నమః పురుషోత్తమాయనమః అధోక్షజాయ నమః నారసింహాయ నమః అచ్యుతాయ నమః జనార్ధనాయ నమః ఉపేంద్రాయనమః హరయే నమః శ్రీకృష్ణాయ నమః (పిదప ఈ క్రింద మంత్రమును చెప్పచూ ప్రాణాయామము చేయవలెను.)



ఓం భూః ఓం భువః ఓగ్ం ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవతుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్ ఓం అపో జ్యోతీరసోమీతం బ్రహ్మ భూర్భుస్సువరోమ్.

(తరువాత గంటమ్రోగించుచూ ఈక్రింది శ్లోకమునుచెప్పవలెను.)

ఆగమార్థంతు దేవానాం గమనార్థం తు రక్షసామ్
కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్

(పిమ్మట దీపమును వెలిగించి ఈ క్రింది సంకల్పలము గావింపవలెను.)

శుభే శోభనేముహూర్తే శ్రీ మహా విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అధ్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఆగ్నేయప్రదేశే కృష్ణా కావేర్యోర్మధ్యప్రదేశే అస్మిన్ శోభనగృహే సమస్తదేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణసన్నిధౌ, అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ....సంవత్సరే...అయనే..ఋతౌ...మాసే..పక్షే.. తిథౌ...వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ



విశిష్ఠాయాం శుభతిథౌ శ్రీమాన్ శ్రీమతః...గోత్రస్య..నామధేయస్య మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సమస్త పాప నివృత్యర్థం సర్వ దురితక్షయ ద్వారా పుణ్యఫలప్రాప్యర్థం ఆత్మశుద్ధ్యర్థం భూమండలే చరాచర ప్రాణికోటీనాం క్షేమ సిద్ధర్థ్యం భక్తి జ్ఞాన వైరాగ్య ఫలసిద్ధ్యర్థం భక్తి జ్ఞానవైరాగ్య ఫలసిద్ధ్యర్థం మమ అభీష్టఫల సిద్ధ్యర్థం ప్రతిబంధరహిత బ్రహ్మ సాక్షాత్కార జ్ఞాన సిద్ధ్యర్థం శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం చ సంభవతా నియమేన సంభవద్భిర్ద్రవ్యైః సంభవద్భి రుపచారైశ్చ యావచ్ఛక్తి శ్రీ గీతా దేవతదాముద్దిశ్య శ్రీ గీతాదేవతా ప్రీత్యర్థం ధ్యానావాహనాది షోడశోపచార పూజా మహం కరిష్యే.

అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే తదంగ కలశారాధనం కరిష్యే కలశం గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య.

(పిమ్మట కలశమును గంధపుష్పాక్షతలతో నలంకరించి ఈ క్రింది మంత్రములను ఉచ్ఛరించుచు అందలి నీటిని ఆకుతో స్పృశించవలెను.)

గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి
నర్మదే సింధుకావేరి జలేస్మిన్సన్నిధిం కురు.

ఆయాంతు శ్రీ మహాగణాధిపతి పూజార్థం మమ దురితక్షయ కారకాః కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య దేవ మాత్మానం చ సంప్రోక్ష్య!

(తదుపరి ఆకలశోదకమును పూజాద్రవ్యములపైనను, తన శిరస్సు పైనను చల్లుకొని శ్రీమహాగణాధిపతికి ధ్యానావాహనాద్యుపచారములు గావించి ఈ క్రింది మంత్రములచే పూజించవలెను.)

ఓం సుముఖాయనమః ఓం ఏకదంతాయ నమః ఓం కపిలాయ నమః ఓం గజకర్ణికాయ నమః ఓం లంబోదరాయ నమః ఓం వికటాయ నమః ఓం విఘ్నరాజాయ నమః ఓం గణాధిపాయ నమః ఓం ధూమకేతవే నమః ఓం గణాధ్యక్షాయ నమః ఓం ఫాలచంద్రాయ నమః ఓం గజానననాయ నమః ఓం వక్రతుండాయనమః ఓం శూర్పకర్ణాయనమః ఓం హేరంబాయ నమః ఓం స్కందపూర్వజాయ నమః ఓం శ్రీ మహా గణాధి పతయే నమః షోడశనామ పూజాం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతి దేవతాభ్యోన్నమః సర్వోపచారపూజాం సమర్ప యామి అనయా పూజాయ భగవాన్ శ్రీ మహాగణపతి దేవతా సుప్రీతా స్సు ప్రసన్నా వరదా భవన్తు.

(పిమ్మట అక్షతలను, పుష్పములను గ్రహించి సంకల్పముచేసి ఈ క్రింది విధముగా చెప్పి వానిని నీటితో వదలవలెను.)

శుభతిథౌ శ్రీమద్భగవద్గీతా దేవతా ముద్దిశ్య శ్రీ మద్గీతా దేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తిధ్యానావాహనాది షోడశోపచార విధానేన శ్రీ గీతా దేవతా పూజాం కరిష్యే.

(పిదప గీతాగ్రంథమును పసుపు, కుంకుమ, పుష్పములతో చక్కగా నలంకరించి అచట ఒక పీటపై పెట్టి, ఈ క్రింది విధముగ పూజా క్రమమును గావింపవలయును.)

అథ ప్రాణ ప్రతిష్ఠాపనం :

వక్త్రాణి పంచ జానీహి పంచాధ్యాయా ననుక్రమాత్
దశాధ్యాయాః భుజాశ్చైవ ముదరం ద్వే పదాంబుజే
ఏవ మష్టాదశాధ్యాయీ వాఙ్మయీ మూర్తి రీశ్వరీ
జానీహి జ్ఞానమాత్రేణ మమపాతకనాశినీ.

ఓం శ్రీగీతాయైనమః ధ్యానం సమర్పయామి. సర్వతీర్థమయ్యై నమః ఆవాహనం సమర్పయామి. అక్షరాయైనమః ఆసనం సమర్పయామి మల నిర్మోచిన్యై నమః పాద్యం సమర్పయామి, సత్యాయైనమః అర్ఘ్యం సమర్ప యామి, విష్ణోర్వక్త్రాద్వినిస్సృతాయ, నమః ఆచమనం సమర్పయామి వంద్యాయైనమః పంచామృతస్నానం సమర్పయామి, అనంతరం శుద్ధో దకస్నానం సమర్పయామి అనంతరం శుద్ధోదక స్నానం సమర్ప యామి, విశ్వమంగళ కారిణ్యైనమః వస్త్రయుగ్మం సమర్పయామి, సర్వశాస్త్ర మయ్యై నమః యజ్ఞోపవీతం సమర్పయామి, సర్వాభరణాని ధారయామి సర్వైశ్వర్య ప్రదాయిన్యై నమః శ్రీగంధం సమర్పయామి, భారతామృత, సర్వ స్వాయై నమః అక్షతాన్ సమర్పయామి. పుష్పైః పూజయామి. (పిమ్మట అక్షతలు గాని, పుష్పములుగాని, చేతగైకొని ఈ క్రింది తెలుపబడిన మంత్రముల నుచ్చరించుచు గీతాదేవిని పూజించ వలయును.)



## శ్రీ గీతాష్టోత్తర శతనామావళిః

(ప్రతినామమునకు ముందు "ఓం" అనియు చివర "నమః" అనియు చదువుకొనవలెను.)

శ్రీ గీతాదేవ్యై
విమలాయై
సుఖదాయై
మునిసంస్తుతాయై
తత్త్వార్థబోధిన్యై
సర్వలోకసంపూజ్యాయై
శ్రీకృష్ణముఖనిస్సృతాయై
పాపఘ్నై ౧౨
పుణ్యదాయై/మహాదేవ్యై
నిష్ప్రత్యూషచిదాత్మికాయై
శోకమోహాపహన్త్ర్యై
మోక్షదాయై
బ్రహ్మబోధిన్యై
బ్రహ్మవిద్యాయై
చిదానన్దాయై
భవఘ్న్యై
భయనాశిన్యై
వేదత్రయాత్మికాయై
అనన్తాయై
తత్త్వార్థజ్ఞానసమజ్ఝర్యై
వ్యాస సంగ్రథితాయై
పూతాయై
సంసారమలమోచన్యై
సర్వశాస్త్రమయ్యై
మాత్రే
సర్వతీర్థమయ్యై
తత్త్వమస్యాదివాక్యోత్థ
-బ్రహ్మతత్త్వావగాహన్యై
శాన్తిప్రదాయై
పరానన్దాయై
బోధామృతతరంగిణ్యై
విశ్వసంస్కృతిసముద్భూతాయై
విశ్వధర్మప్రచారిణ్యై
విశ్వైకరచనాయై
రమణీయార్థభాసితాయై
రమ్యాయై
విశ్వమానవసంపూజ్యాయై
విశ్వమంగళకారిణ్యై
విశ్వసిద్ధాన్తసమ్మాన్యై
విశ్వసమ్మోహనాశిన్యై
విశ్వస్వరూపిణ్యై
విశ్వవన్ద్యాయై
విశ్వతత్త్వప్రకాశిన్యై
త్రిగుణాతీత తత్త్వార్థభాసిన్యై
గ్రంథిభేదిన్యై
లోకోత్తరగుణోపేతాయై
లోకోచితమతాన్వితాయై
లోకోద్ధరణసంశీలాయై
లోకామోదప్రవర్ధితాయై
నిహితాఖిలశాస్త్రార్థాయై
శుభౌజఃపదగుంభితాయై
అనిర్వాచ్యాయై
గంభీరాయై/నిత్యాయై
నిత్యసుఖప్రదాయై

నైకవ్యాఖ్యానసంభిన్నాయై
నానాచార్యసమాదృతాయై
స్వప్నానుకూలభావార్ధశోభితాయై
శాన్తిదాన్తిదాయై
నిత్యనూతన భావార్ధదాయిన్యై
లోకకామదాయై
ప్రాచ్యపాశ్చాత్య ఖండాంతర్ని
-వాసిజనమోదిన్యై
అక్షరాయై/అద్వేషిణ్యై
సర్వకాలధర్మప్రబోధిన్యై
దైవసంపత్సుసంపన్నాయై
అసురభావాదివర్జితాయై
అష్టాదశమహాయోగభూషితాయై
భ్రష్టతారిణ్యై
స్త్రీశూద్రసముద్ధర్త్ర్యై
సమభావవిశోభిన్యై
ఈర్ష్యాప్రసూతజాత్యాది
దురహంకారఘాతిన్యై
చండాలద్విజశూద్రాది
సర్వోద్ధరణతత్పరాయై
మాయాపనోదిన్యై
సత్యాయై
ద్వంద్వభేద వినాశిన్యై
అభేదభావ పీయూషవర్షిణ్యై
జ్ఞానభాసిన్యై
త్యాగరూపాయై
అనవద్యాయై
విముక్త ఫలశాలిన్యై
యధాధికార నిష్కామ
కర్మధ్యానాది భోదిన్యై
భవమగ్న ప్రజానౌకాయై
బంధచ్ఛేద విచక్షణాయై
భగవద్భావసంపూర్ణాయై
భవవారిధి కారిణ్యై
ఆధ్యాత్మిక మహాకాశ
లసత్సౌదామినీసమాయై
నిష్కలాయై / నిర్మలాయై
శాన్తాయై
సర్వతేజోమయ్యై / శుభాయై
తమోవిమూఢలోకాన్ధ
కారపనోదనచన్ద్రికాయై
శ్రుత్యన్తగత తత్వార్ధబోధిన్యై
బోధభాసురాయై
బోధామృతపయశ్శుక్లాయై
పార్ధవత్సతరాన్వితాయై
దోగ్ధృ కృష్ణాయై
గోరూపాయై/కామధేనవే
శుగన్తికాయై
క్లిన్నపార్ధతమోహన్త్ర్యై
క్షాత్రధర్మప్రవర్ధితాయై
కర్తవ్యచ్యుతధీమూఢ
జనసత్పథదర్శికాయై
సర్వసన్న్యాససంలక్ష్యాయై
పూర్ణబ్రహ్మప్రబోధిన్యై
కలి సన్త్రస్తసమ్మూఢ
-లోకత్రాణచణాయై
పరాయై
శ్రీ గీతామాత్రే నమః



## శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళిః

(ప్రతినామమునకు ముందు "ఓం" అని చివర "నమః" అని చదువుకొనవలెను.)

ఓం శ్రీకృష్ణాయ నమః
కమలానాథాయ
వాసుదేవాయ
సనాతనయా
వసుదేవాత్మజాయ
పుణ్యాయ
లీలామానుషవిగ్రహాయ
శ్రీవత్సకౌస్తుభధరాయ
యశోదావత్సలాయ
హరయే 10
చతుర్భుజాత్తచక్రాసిగదా
-శంఖశార్ఙ్గాద్యాయుధాయ
దేవకీనందనాయ
శ్రీశాయ
నందగోపప్రియాత్మజాయ
యమునావేగసంహారిణే
బలభద్రప్రియానుజాయ
పూతనాజీవితహరాయ
శకటాసురభంజనాయ
నందవ్రజనానందినే
సచ్చిదానందవిగ్రహాయ 20
నవనీతవిలిప్తాంగాయ
నవనీతప్రియాయ
అనఘాయ
నవనీతనవాహారాయ
ముచికుందప్రసాదకాయ
షోడశస్త్రీసహస్రేశాయ
త్రిభంగినే
మధురాకృతయే
శుకవాగమృతాబ్ధీందవే
గోవిందాయ 30
యోగీనాంపతయే
వత్సవాటచరాయ
అనంతాయ
ధేనుకాసురభంజనాయ
తృణీకృతతృణావర్తాయ
యమళార్జునభంజనాయ
ఉత్తలతాలభేత్రే
తమాలశ్యామలాకృతయే
గోపగోపీశ్వరాయ
యోగినే
కోటిసూర్యసమప్రభాయ
ఇళాపతయే
పరంజ్యోతిషే
యాదవేంద్రాయ
యదూద్వహాయ
వనమాలినే
పీతవాససే
పారిజాతాపహారకాయ
గోవర్ధనాచలోద్ధర్త్రే
గోపాలాయ
సర్వపాలకాయ 50
అజాయ
నిరంజనాయ

కామజనకాయ
కంజలోచనాయ
మధుఘ్నే
మధురానాథాయ
ద్వారకానాథాయ
బలినే
బృందావనాంతసంచారిణే
తులసీదామవిభూషణాయ60
శ్యమంతకమణిర్హర్త్రే
నరనారాయణాత్మకాయ
కుబ్జాకృష్ణాంబరధరాయ
మాయినే
పరమపురుషాయ
ముష్టికాసురచాణూరమల్ల
-యుద్ధవిశారదాయ
సంసారవైరిణే
కంసారయే/మురారయే
నరకాంతకాయ 70
అనాదిబ్రహ్మచారిణే
కృష్ణావ్యసనకరకర్మకాయ
శిశుపాలశిరచ్ఛేత్రే
దుర్యోధనకులాంతకృతాయ
విదురాక్రూరవరదాయ
విశ్వరూపప్రదర్శకాయ
సత్యవాచే
సత్యసంకల్పాయ
సత్యభామారతాయ
జయినే 80
సుభద్రాపూర్వజాయ

విష్ణవే
భీష్మముక్తిప్రదాయకాయ
జగద్గురవే
జగన్నాథాయ
వేణునాదవిశారదాయ
వృషభాసురవిధ్వంసినే
బాణాసురాంతకాయ
యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే
బర్హిబర్హావతంసకాయ
పార్థసారథయే
అవ్యక్తాయ
గీతామృతమహోదధయే
కాళీయఫణిమాణిక్యమండిత
- శ్రీపదాంబుజాయ
దామోదరాయ
యజ్ఞభోక్త్రే
దానవేంద్రవినాశకాయ
నారాయణాయ
పరస్మైబ్రహ్మణే 100
పన్నగాశనవాహనాయ
జలక్రీడాసమాసక్తగోపీ
-వస్త్రాపహారకాయ
పుణ్యశ్లోకాయ
తీర్థపాదాయ
వేదవేద్యాయ
దయానిధయే
సర్వతీర్థాత్మకాయ
సర్వగ్రహరూపిణే
పరాత్పరాయ



## శ్రీ గీతా మాహాత్మ్యము

శ్రీమద్భగవద్గీత చదువగా చదువుగా, ఆచరణలో పెట్టుకోగల సద్బుద్ధి కలుగుతుంది. వరాహ పురాణంలో గీతామాహాత్మ్యం చెప్పబడింది. గీతా పారాయణ చేసేవేళ దీనిని పఠిస్తూ ఉండటం సంప్రదాయంగా వస్తూ యుండడం అందరికీ తెలిసిన విషయమే!

ధరోవాచ :

భగవన్ పరమేశాన భక్తిరవ్యభిచారిణీ,
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో 1

తా. ధరచెప్పింది : శ్రీ మహావిష్ణువు చెంతకేగిన భూదేవి తన సందేహాన్ని చెపుతూ "భగవంతుడా! పరమేశ్వరా ! ప్రారబ్ధకర్మ అనుభవించే వారికి పరమాత్మ యందు అచంచలమైన భక్తియేవిధముగా కలుగుతుందో చెప్ప" మని అడిగింది. శ్రీ మహావిష్ణువు ఆమె కోర్కెను మన్నించి చెప్పటం ప్రారంభించాడు.



శ్రీవిష్ణురువాచ :

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరత స్సదా,
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. 2

తా. ఎవడు గీతాభ్యాసమునందు నిరతుడైయుండునో అతడు ప్రారబ్ధము ననుభవించుచుండిననూ, కర్మనుండి లిప్తుడు కానేరడు. లోకమునందు అతడే ముక్తుడు అతడే సుఖియు.

మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతిచేత్,
క్వచిత్స్పర్శం కుర్వన్తి నలినీదల మంభసా. 3

తా. ఎవరైతే గీతా ధ్యానమును చేసినయడల, కమలపత్రమునకు నీరు అంటని చందంబున మహాపాపాది (1) పాపములు వారికి కొంచెమైనను అంటవు.

(1) మహాపాపములు = బ్రహ్మహత్య, సురాపానము, దొంగతనము, గురుపత్నీ సహగమనము, మఱియు వీరి సంసర్గము, శబ్దమునుండి ఉపపాతకములు గోహత్య మొదలగునవి.

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే,
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై. 4

తా. ఎచ్చట గీతాపుస్తకముండునో, ఎచ్చట నియమ పూర్వకముగ గీతా పారాయణము జెప్పబడునో, ఆ తీర్థమునందు, ప్రయాగ మొదలగు సమస్త తీర్థములుండును.

సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే
గోపాలా గోపికావాఽపి నారదోద్ధవ పార్షదైః
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

తా. ఎచ్చట గీతాపుస్తకముండునో అచ్చట సమస్త దేవతలూ, ఋషులూ, యోగులూ, అనంతుడు వాసుకి మొదలగు నాగులూ, గోపాలురూ గోపికలూ మొదలగు మహాత్ములూ,నారద, ఉద్ధవాది భగవత్పార్శ్వవర్తుల జతలో సర్వదా నివసించుచున్నారు.

యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి. 6

తా. ఓ భూదేవి, ఎచ్చట గీతయొక్క విచారము పఠన (1) పాఠన(2) శ్రవణములు దెలుపబడుచున్నవో అచ్చట నిశ్చయముగ నేను వసించుచున్నాను.

(1) పఠనమనగ = చదువుట (2) పాఠనమనగ = చదివించుట

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్. 7

తా. నేను గీతను ఆశ్రయించుకొనియున్నాను. గీతయే నాకు యుత్తమ మైన గృహము మరియు గీతాజ్ఞానమును ఆశ్రయించుకొని మూడు లోకములును పాలించుచున్నవాడను.

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా. 8

తా. గీత, బ్రహ్మరూపముగను, ప్రణవస్వరూపముగను, నాశనరహిత ముగను, అనిర్వాచ్యముగను, నిత్యముగను యుండునది గావున గీతయే నా పరమవిద్య.

చిదానన్దేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్
వేదత్రయీ పరానన్దా తత్త్వార్థజ్ఞానమంజసా 9



తా. ఋగ్వేదాది వేదత్రయరూపముగనూ, పరమానంద రూపముగనూ, తత్వజ్ఞాన గర్భితముగనూ యుండు ఈ గీత చిదానంద స్వరూపుడగు శ్రీకృష్ణుని ముఖారవిందమునుండి అర్జునునకు ఉపదేశరూపముగ జేయ బడినది.

యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్. 10

తా. ఏ పురుషుడు పదునెనిమిది అధ్యాయములుగల ఈ గీతను నిత్యమూ జపించునో అథవా ఏకాగ్రచిత్తముచే పఠించునో, యతడు జ్ఞాన సిద్ధిని బొంది అట్టి జ్ఞానమార్గము నుండి మోక్షమును బొందును.

పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్థం పాఠ మాచరేత్
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః 11

తా. సంపూర్ణ పాఠమును చదువుట యందు శక్తిలేనివాడు అర్ధమైననూ అనగా తొమ్మిది అధ్యాయములనైననూ చదువవలెను. దాని నుండి గోదానమంతటి పుణ్యఫలప్రాప్తమగును. ఇందు సంశయములేదు.

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. 12

తా. గీతయొక్క మూడుభాగములలో యొకభాగమగు ఆరు అధ్యాయ ములను చదువువానికి గంగాస్నాన ఫలప్రాప్తమగును. ఆరింటిలో నొక భాగమును జపించువానికి సోమయాగఫలము ప్రాప్తమగును.

ఏకాధ్యాయం తు యోనిత్యం పఠతే భక్తి సంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరమ్. 13

తా. భక్తిచేత ఎవడైతే ఒక అధ్యాయమైననూ జదువునో అతడు ఋద్రలోకమునుబొంది, ఋద్రగణములలో యొకడై అచ్చట బహు కాలముండును.

అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావ న్మనుకాలం వసున్ధరే. 14

తా. ఓ భూదేవీ యావమనుష్యుడు అధ్యాయముల శ్లోకములందు నాల్గింటి యొక భాగమైననూ నిత్యమూ పఠించునో అతడు యొక మన్వంతరము వరకూ మానవ జన్మమునే పొందును.

గీతాయాః శ్లోక దశకం సప్త పంచ చతుష్టయమ్,
ద్వౌత్రీనేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః. 15

తా. యావ మనుష్యుడు గీతయొక్క పదిశ్లోకములను గాని మరియు ఏడు, ఐదు, నాల్గు, మూడు, రెండు అథవా ఒకటిగాని అంత్యము నకు అర్ధశ్లోకమైననూ చదువునో-

చన్ద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్
గీతాపాఠసమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్. 16

తా. అతడు చంద్రలోకమునుపొంది, అచ్చట పదివేలు సంవత్స రంబు లుండును. ఇది నిశ్చయము. గీతా పారాయణము చదివించుచూ మృతుడైన ఈ దేహనాశానంతరము మానవజన్మమనే పొందును.

గీతాభ్యాసం పునఃకృత్వా లభతే ముక్తిముత్తమామ్
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17

తా. పైన జెప్పబడినట్లు నరజన్మమును పొందిన మనుష్యుడు గీతాభ్యాసమునందు నిరతుడై యుత్తమమైన ముక్తిని పొందును. మరణ కాలమున "గీతాగీతా" అను శబ్దమును ఉచ్చరించుచు, ప్రాణము విడుచు వాడూ సహ, సద్గతిని పొందును.

గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. 18

తా. మహాపాపముతో గూడినవాడు అయిననూ గీతార్థమును వినుట యందలి ఆసక్తుడైనవాడు వైకుంఠమునుబొంది అచ్చట విష్ణువు జతలో కలిసి సంతోషముతోనుండును.

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ముక్తస్స విజ్ఞేయా దేహాన్తే పరమం పదమ్. 19



తా. ఎవడు అనేక కర్మములను చేయువాడైననూ నిత్యమూ గీతార్థ మును అనుసంధానము చేయువాడైననూ అతడు దేహానంతరము నందు పరమపదమును పొందును. అట్టి వానిని జీవన్ముక్తుడని తెలియదగినది.

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః
నిర్ధూతకల్మషా లోకే గీతాయాతాః పరమం పదమ్. 20

తా. జనకుడే మొదలైన రాజర్షులు గీతను ఆశ్రయించి ఇహలోక మున కీర్తినిపొంది పాపరహితులై యుత్తమమైన పదమునుబొందిరి.

గీతాయాః పఠనం కృత్వా మహాత్మ్యం నైవ యః పఠేత్
వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః. 21

తా. గీతను చదివి దాని మాహాత్మ్యమును ఎవడు చదువడో, అట్టివాని గీతాపఠనముతగిన ఫలము ఇవ్వక వ్యర్థమగును. అందు కోసరమై అట్టివాని గీతాపఠనము శ్రమయని తెల్పియుండు.

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్. 22

తా. అందుకోసరమై ఈ మాహాత్మ్యముతో గూడిన గీతాభ్యాసమును జేయువాడు మీద జెప్పబడిన ఫలమును పొంది దుర్లభమైన సద్గతిని పొందును.

సూత ఉవాచ :

మాహాత్మ్య మేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనం,
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్. 23

తా. మీద జెప్పిన ఆర్షేయమైన ఈ మాహాత్మ్యమును గీతాపారా యణానంతరమున పఠించువాడు, మహాత్మ్యములో తెల్పిన ఫలమును పొందును.

ఇట్లు వారాహపురాణమున గీతా మాహాత్మ్యము సంపూర్ణము.

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ గీతారాధన

## 1. ప్రథమోఽ ధ్యాయము

### అర్జున విషాదయోగము, ఆంధ్ర తాత్పర్యము

☞ కురుక్షేత్రమహిమపూర్వక, యుద్ధవిషయమునందు ధృతరాష్ట్రుని ప్రశ్న

ధృతరాష్ట్ర ఉవాచ-

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ! 1

తా. ధృతరాష్ట్రుడు ఇట్లనెను- ఓ సంజయుడా, ధర్మక్షేత్రమును కురుక్షేత్రమునందు నావారలగు దుర్యోదనాదులు, పాండురాజునకు పుత్రులైన ధర్మరాజాదులు, యుద్ధముజేయవలెనని కోర్కెగలవారై సన్నద్ధులైరిగదా! ఏమిచేసిరి.

వివరణ : ధర్మక్షేత్రమే ఈ దేహమనియు, ఇందుగల దేవగుణములే పాండవులనియు, రాక్షసగణములే దుర్యోధనాదు లనియు, అందులకై ప్రతి క్షేత్రములయందును ఈ యుద్ధము జరుగుచునేయుండుననియు, తుదకు దైవిక గుణములకే జయ మనియు, ఈవిషయమును కురు, పాండవయుద్ధము నుండి గ్రహింపనగు. కావున భగవద్గీతయొక్క 18 వ అధ్యాయమున 78వ శ్లోకమున "ఏ క్షేత్రమున కృష్ణార్జునులు ప్రతిష్ఠింప బడుదురో ఆ క్షేత్రము యొక్క అధిపతికే జయమనియు, మోక్ష మనియు" సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పియుండెను.



☞ ధృతరాష్ట్రునితో దుర్యోధనుని విషయము సంజయుఁడు దెల్పుట

సఞ్జయ ఉవాచ :

దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్యముపసఙ్గమ్య రాజా వచనమబ్రవీత్. 2

సంజయుడు చెప్పెను -

తా. రాజగు దుర్యోధనుడు వ్యూహాకారముగా రచింపబడిన, పాండు పుత్రులయొక్క సైన్యమునుజూచి అప్పుడు ద్రోణాచార్యుని సమీపించి, ఒక మాటను చెప్పెను.

☞ దుర్యోధనుఁడు పాండవ సేననుఁజూచి తదభిప్రాయము ద్రోణునితో దెల్పుట

పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

తా. ఓ ద్రోణాచార్యుడా ! నీకు శిష్యుడును, బుద్ధి మంతుడును, ద్రుపదరాజు పుత్రు (దృష్టద్యుమ్ను) ని చేత శకటాది వ్యూహాకారముగా రచించిపబడినదియును, గొప్పదియగు, పాండుపుత్రులయొక్క ఈ సైన్యమును జూడుము.

☞ దుర్యోధనుఁడు పాండవ సేనయందుండు సప్తదశ (17 ముఖ్యనాయకులనుఁ దెల్పుట

అత్రశూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి
యుయుధానో విరాటశ్చద్రుపదశ్చ మహారథః. 4

తా. ఈ పాండవుల సైన్యములో, యుద్ధమునందు భీమార్జునులతో సమానులు, పెద్ద ధనుస్సులు గలవారు యుయుధానుడు, విరాటుడు, మహారథుడగు ద్రుపదరాజు,

ధృష్ట కేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః 5

యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః 6

తా. దృష్టకేతువు, చేకితానుడు, పరాక్రమశాలియగు కాశీరాజు, పురు జిత్తువు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడగు శైబ్యుడు, యుధామన్యువు,

పరాక్రమవంతుడగు ఉత్తమౌజుడు సుభద్రా కుమారుడు (అభిమన్యువు) ద్రౌపది కొడుకులగు (ప్రతివింద్యుడు, శ్రుతసోముడు, శతానీకుడు, శ్రుతకీర్తి, శ్రుతసేనుడు) కలరు. వీరందరు మహారథులే (1)

(1) ఒకడు పదివేలుమంది వీరులతో బోరువాడు మహారథుడు

☞దుర్యోధనుండు తన సేనయందుండు నాయకుల శ్రేష్ఠతను దెల్పుట

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే. 7

తా. బ్రాహ్మణోత్తముడగు ద్రోణాచార్యుడా ! మనసైన్యమునకు రక్షకులైనవారలను నీకుజ్ఞప్తిని చేయుటకొరకు ఇప్పుడు వివరించుచున్నాను, అందులో నుత్తములగువారిని వినుము.

☞దుర్యోధనుండు తన సేనయందలి ముఖ్య యోధుల పేర్లు దెల్పుట

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ. 8

తా. నీవు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమునందు జయముగల కృపుడు, అశ్వత్థామయు, సోమదత్తుని కొడుకు (భూరి శ్రవుడు) వికర్ణుడును,

అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్త జీవితాః,
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః 9

తా. ఇంకను అనేక శూరులు నానావిధములగు శస్త్రాస్త్రములయందు ప్రవీణత గలవారై నానిమిత్తము, ప్రాణములను గూడ విడిచిపెట్టుటకు సిద్ధముగనున్నవారు.

☞దుర్యోధనుండు తన సేనకూ, పాండవ సేనకూగల అధికన్యూనత దెల్పుట

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్. 10

తా. భీష్మునిచే గాపాడబడుచున్న మన సైన్యము అపరిమితమైనది. భీమునిచే గాపాడబడుచున్న పాండవుల సైన్యము మితమైనది.

☞దుర్యోధనుండు, భీష్ముని రక్షణ విషయమున ద్రోణునితోఁ దెల్పుట.

అయనేషు చ సర్వేషు యథా భాగమవస్థితాః
భీష్మ మేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి. 11



తా. మీరందఱును వారివారికి నిర్ణయింపబడిన స్థానములలో నుండి భీష్మాచార్యుని కాపాడుదురుగాక.

☞దుర్యోధనునకు సంతోషముఁ బుట్టించుటకు భీష్ముడు శంఖనాదముఁజేయుట

తస్య సఞ్జనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

తా. పరాక్రమశాలియు, కురుశ్రేష్ఠుడు అగు భీష్ముడు అట్లు సోత్రము జేయుచున్న దుర్యోధనునకు సంతోషమును గలుగజేయుచు, సింహనాదమునుజేసి శంఖమును ఊదెను.

☞దుర్యోధనుని సేనయందలి శంఖనాదములు

తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః
సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములోఽభవత్. 13

తా. అనంతరము శంఖములు, భేరులు,పణవములు, ఆనకములు, గోముఖములు అను రణవాద్యములు ఏకకాలమున వాయింపబడినవి. దానిచే పుట్టిన ధ్వని మిగుల గొప్పది ఆయెను.

☞కృష్ణార్జునుల శంఖనాద నిరూపణము.

తత శ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ,
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః. 14

తా. పిమ్మట తెల్ల గుఱ్ఱములచే గట్టబడిన, పెద్దదియగు రథమునందున్న కృష్ణుడు అర్జునుడు, మిగుల శ్రేష్ఠములగు శంఖములను ఊదిరి.

☞నాదకర్తృవుల పేరుసహితము శంఖనాదముల నిరూపణము.

పాంచ జన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః. 15

తా. శ్రీకృష్ణుడు పాంచజన్యమను శంఖమును, అర్జునుడు దేవదత్తమను శంఖమును, భయంకరమగు వ్యాపారముగల భీముడు పౌండ్రమను గొప్పదగు శంఖమును పూరించెను.

అనన్త విజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ. 16

తా. కున్తీ దేవికి పుత్రుడు యుద్ధమునందు స్థిరముగ నిల్చు ధర్మరాజు, అనంతవిజయమను పేరుగల శంఖమును బూరించెను. నకుల సహదేవులు సుఘోష మణిపుష్పకములను శంఖములను నూదిరి.

☞పాండవులయొక్క సమ్మతి

కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చా పరాజితః 17

తా. శ్రేష్ఠమైన ధనుస్సుగల కాశీరాజును, మహారథికులైన శిఖండి యును, ధృష్టద్యుమ్నుడును, యుద్ధమునందు పరాభవము బొందని సాత్యకి యును, వేఱు వేఱుగా తమ తమ శంఖములను బూరించిరి.

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహు శ్శఙ్ఖాన్ దధ్ముఃపృథక్పృథక్. 18

తా. ఓ ధృతరాష్ట్రుడా! మరియు ద్రుపదరాజును, ద్రౌపదీదేవియొక్క పుత్రులగు ప్రతివింధ్యాదులు, మిగుల భుజబలము గల అభిమన్యుడు, మొదలగు వారందరును, వేఱువేఱుగా శంఖములను బూరించిరి.

☞పాండవుల శంఖనాదములు, దుర్యోధనాదులకు దిగులుఁబుట్టించుట.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్. 19

తా. సంకులమైనట్టి శంఖధ్వని, ఆకాశమును భూమిని ప్రతిధ్వనుల చేతనిండించినదగుచు, దుర్యోధనాదుల హృదయములను బ్రద్దలుజేసెను.

☞ పాండవులయొక్క నిర్భయత్వ నిరూపణము.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః. 20

తా. ఓ ధృతరాష్ట్రుడా ! రెండు తెగలువారును శంఖధ్వనులు జేసిన పిమ్మట, హనుమంతుడు ధ్వజమునందుగల అర్జునుడు, యుద్ధము సేయుటకు నిలిచియున్న దుర్యోధనాదులజూచి తన ధనుస్సును ఎక్కుపెట్టి.

సంజయ ఉవాచ –

హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే!



అర్జున ఉవాచ :

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత!21

తా. ఆ సమయమున, సర్వేంద్రియ ప్రేరకుడైన శ్రీకృష్ణునుద్దేశించి ఈ వాక్యమును పలికెను. (ఏమనగ) ఓ అచ్యుతుడా ! ఈ రెండు సేనల యొక్క మధ్యప్రదేశమునందు నా రథమును నిలుపుము.

☞రథ స్థాపనకుఁ బ్రయోజనము

యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్॥
కైర్మయా సహయోద్ధవ్య మస్మిన్‌రణ సముద్యమే 22

తా. ఈ యుద్ధరంగమునందు నేనెవ్వరితో యుద్ధము జేయదగినదో చూడవలయును. మరియు నెవ్వరెవ్వరు యుద్ధమునకు వచ్చిరో తెలిసికొన వలయును. (గావున మన రథమును వారందరు గనబడ దగినంత దూరము నందు నిలుపుము.)

☞యుద్ధ సంకల్పముయొక్క కారణ వర్ణనము.

యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. 23

తా. దుష్టబుద్ధిగల దుర్యోధనునకు ప్రియముగ జేయవలయునని యుద్ధము జేయుటకు ఎవరెవరు సన్నద్ధులైవచ్చియున్నారో వారలను నేను జూడ గోరుచున్నాను.

☞శ్రీ కృష్ణుఁడు రెండు సైన్యముల మధ్యమందు రథమును నిలిపి బ్రతి వీరులఁ దెల్పుట.

సంజయ ఉవాచ :

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24
భీష్మద్రోణ ప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. 25

తా. సంజయుడిట్లనెను-ఓ ధృతరాష్ట్రుడా ! నిద్రకు నియామకుడైన అర్జుననిజేత నీ విధముగా జెప్పబడిన మాటలనువిని సర్వేంద్రియ నియామ కుడగు శ్రీకృష్ణుడు, భీష్మద్రోణుల యెదుటనూ మరియు ఇతర

రాజుల యొక్క ఎదుటనూ శ్రేష్ఠమగు రథమునునిల్పి ఓ అర్జునుడా ! యుద్ధ
మును జేయుటకు గలిసియున్న యీ కురురాజులను జూడుమనియెను.

☞ అర్జునుఁడు ఉభయ సేనలందు బంధువులఁ జూచుట.

తత్రాపశ్యత్స్థితాన్పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా. 26
శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి
తాన్సమీక్ష్య స కౌన్తేయ స్సర్వాన్ బన్ధూనవస్థితాన్. 27

తా. ఆ ప్రకారము శ్రీకృష్ణుడు రథమును నిలుపగనే యుభయ సైన్యములయందును యుద్ధసన్నద్ధులై నిలిచియున్నపిన్నతండ్రులును, పెద్ద తండ్రులును, తాతలను, ఆచార్యులను, మేనమామలను, మామలను, అన్నదమ్ములను, కొడుకులను,మనుమలను, స్నేహితులను, ఉపకారము చేసిన వారలను, కున్తీపుత్రుడగు అర్జునుడు జూచి,

☞ బంధుదర్శనముచేత అర్జునునకు విషాదము యొక్క సామాన్య చిన్నలు గనఁబడుట.

(ఇచ్చట నుండి అర్జున విషాదయోగము)

కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్,
అర్జున ఉవాచ - విశేష చిన్హా నిరూపణము -
దృష్ట్వేమం స్వజనం కృష్ణ ! యుయుత్సుం సముపస్థితమ్. 28
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

తా. అత్యధికమగు దయగలవాడై దుఃఖించుచు శ్రీకృష్ణునితో నిట్లనియె కృష్ణా ! యుద్ధమునుజేయుటకు ఎదుర్కొని సమీపించియున్న యీ బంధు జనుల జూచి నా యవయవములు శిథిలమగుచున్నవి, నోరు ఎండిపోవు చున్నది, దేహము వణకుచున్నది, రోమాంచనమగుచున్నది.

☞ శ్రేయస్సుగాని, శకునసూచకముల మాట.

గాణ్డీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

తా. నాయొక్క గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. నా దేహము నందు మిగుల పరితాపము గలుగచున్నది.మనస్సు భ్రమించు చున్నది. గావున రథము మీద నేను నిలువజాలను.



నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే. 31

తా. ఓ కేశవా! ఎడమకన్ను అదరుట మొదలుగా గల యనేకములైన యపశకునములు నాకు గనబడుచున్నవి. ఈ యుద్ధమునందు బంధువులను జంపి నేను ఏమి సుఖముబొందగలను.

☞ దృష్ట వైరాగ్య సుఖ నిరూపణము.

న కాఙ్క్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవిన్ద! కిం భోగైర్జీవితేన వా. 32

తా. ఓ కృష్ణుడా ! నేను జయమును, రాజ్యసుఖమును కోరలేదు. ఓ గోవిందుడా! మాకు రాజ్యముచేతను, భోగములచేతను, జీవించియుండుటచేతను ఏమి ప్రయోజనము ?



యేషామర్థే కాఙ్క్షితంనో రాజ్యం భోగాస్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ. 33

తా. ఎవరి కొరకు మాచేత రాజ్యమును, సుఖమును, కోరబడుచున్నవో యట్టివారే ప్రాణములను, ధనములను వదలి యుద్ధసన్నద్ధులై వచ్చి యున్నారు.

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులా శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సమ్బన్ధినస్తథా. 34

తా. ఆచార్యులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామలు, పడుచు నిచ్చిన మామలు, మనుమలు, బావమరుదులు, ఆ ప్రకారముగానే నితరులగు బంధువులు యుద్ధమునకు వచ్చియున్నారు.

☞ అదృష్టవైరాగ్య నిరూపణము.

ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే. 35

తా. మధువను రాక్షసుని జంపిన యో కృష్ణుడా! ఈ దుర్యోధనాదులందరును, నన్ను జంపినప్పటికిని, నాకు ముజ్జగముల దొఱతనము దొఱకి నప్పటికిని నేను వీరిని జంపను. త్రైలోక్య రాజ్యమునందే యపేక్ష లేని నేను భూలోకరాజ్యము కొఱకు జంపనని యేమి చెప్పవలయును?

☞అర్థశాస్త్రమునకంటె ధర్మశాస్త్రము బలము గలదనియు అందుచే బంధువులఁ జంపుట పాపమే యని నిరూపించుట.

**నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన !**
**పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతా నాతతాయినః. 36**

**తా. ఓ జనార్ధనుడా ! ఈ దుర్యోధనాదులను జంపిన యెడల మాకేమి ప్రీతిగల్గును? దుర్మార్గులైన వీరిని జంపిన యెడల పాపమే గల్గును.**

☞స్వబంధువులఁ జంపుటయందలి అయోగ్యత మఱియు అందలి సుఖాభావమున్నదని జెప్పుట.

**తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాన్ధవాన్,**
**స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ!37**

**తా. లక్ష్మీపతివైన యో కృష్ణుడా ! మేము బంధుజనులను జంపి యేమి సుఖమును బొందగలము? అందువలన మేము బంధువులతో గూడిన దుర్యోధనాదులను జంపుటకు దగినవారముగాము.**

☞లోభయుక్తులురగు భీష్మాదులకుఁ గుల క్షయమను అనర్థమున ప్రవృత్తి సరిగాదని నిరూపించుట.

**యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః,**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్. 38**

**తా. ఈ దుర్యోధనాదులు, రాజ్యలోభముచేత జెడిన మనస్సుగల వారగుటవలన కులనాశము చేయుటవలన గలుగు దోషమును,మిత్ర ద్రోహము వలన గలుగునట్టి పాతకములు దెలిసికొనజాలరు.**

**కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మా న్నివర్తితుమ్,**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన! 39**

**తా. ఓ జనార్దనా ! కులనాశమువలన దోషము కలుగునని చక్కగా జూచుచున్న మేము ఈ పాపకృత్యమును వదలుకొనక ఏ విధముగా ప్రవర్తింపఁ గలము.**

☞కులనాశముచేత ధర్మనాశనమయి, దానిచే అధర్మమునకు వశమగు చున్నారము.

**కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః,**
**ధర్మేనష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత. 40**



**తా. వంశము నశించుటవలన, అనాదియగు కులాచారములు నశించిపోవును, కులధర్మములు నశించుటచేత ఆ కులమునందు అధర్మము వ్యాపించును.**

☞అధర్మముచేత కులస్త్రీలు చెడి వారిచే వర్ణసంకరమగు పుత్రులగుదురు.

**అధర్మాభిభవాత్కృష్ణ ! ప్రదుష్యన్తి కులస్త్రియః,**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః.41**

**తా. అధర్మము ధర్మమును నశింపజేయుటవలన కులస్త్రీలు జెడి పోదురు. కృష్ణా ! కుల స్త్రీలు జెడిరేని (1) వర్ణసాంకర్యమగును.**

(1) తల్లిదండ్రులు ఒకజాతివారు గాక యుండినవారి సంతానము వర్ణసంకరమగును.

☞ వర్ణసంకరమైన వానికిని అతని పితరులకు నరకప్రాప్తి యగును.

**సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,**
**పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః. 42**

**తా. కులమునకు వర్ణసాంకర్యమయ్యెనేని కులనాశము జేసినవారికి నరకముగలుగు, అట్టివారి పితృదేవతలు పిండోదకములు లేక అధోలోకము బొందుదురు.**

☞కులనాశకులచేనగు వర్ణసంకర దోషములు సమస్త ధర్మములనూ నాశముఁ జేయును.

**దోషై రేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః**
**ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43**

**తా. వర్ణసంకరమును జేయునట్టి కులనాశకులయొక్క దోషముల చేత శాశ్వతములైన వర్ణాచారములు, కులాచారములు, ఆశ్రమ ధర్మములు, నశింప జేయఁబడుచున్నవి.**

☞లోభమునకు లోఁబడి స్వకులఘాతకులగువారు సర్వధర్మనాశనముఁ గావించి అవధిలేకయే నరకమునందుబడుదురు.

**ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!**
**నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ. 44**

తా. ఓ కృష్ణుడా ! కులధర్మములను జెడగొట్టుకొనిన వారలు ఎల్లపుడు నరకమునందే నివసించుచుదురని వినియున్నవారము కావున కులనాశనము జేసి కులధర్మములను బాడుసేయగూడదు.

☞ముముక్షువు యొక్క లక్షణముఁ జూపించుట కోసరమై అర్జునుఁడు పాపములనుండి భయమని దెల్పుట.

**అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,**
**యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః. 45**

తా. రాజ్యసుఖమందలి యాశచేత బంధువులను గూడ జంపుటకు ఉద్యుక్తులమైతిమి. ఇవ్విధముగ నుద్యుక్తులమై యెంత పాపమును జేయ బూనితిమి. ఎంత ఆశ్చర్యము! ఎంత కష్టము.

**యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః**
**ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. 46**

తా. ఆయుధములను ధరించిన దుర్యోధనాదులు, ఆయుధములు లేనివాడును, బ్రతిక్రియజేయనివాడను అయిన నన్ను జంపిరేని నాకు మిగుల మేలే కలుగును.

☞శోకవిష్టుఁడైన అర్జునుఁడు వైరాగ్యముచేత శస్త్రత్యాగము చేసినవిషయము

సంజయ ఉవాచ :

**ఏవముక్త్వాఽ ర్జునస్సఙ్ఖ్యే రథోపస్థ ఉపావిశత్,**
**విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః. 47**

ఇతి శ్రీమద్భగవద్గీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అర్జున విషాదయోగో నామ ప్రథమోఽ ధ్యాయః

తా. అర్జునుడిట్లు చప్పి దుఃఖముచేత చలింపబడిన మనసు గల వాడగుచు, ధనుర్బాణముల విడిచి యుద్ధమందు రథము మీద గూర్చుండెను.

ఇది యుపనిషత్తును బ్రహ్మవిద్యయు యోగ శాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమగు భగవద్గీతలందు అర్జునవిషాదయోగమును
మొదటి అధ్యాయము.



# సాంఖ్య యోగము

## 2. ద్వితీయోఽ ధ్యాయః

(దీనికి సాంఖ్యయోగమని పేరు. సంఖ్యాశబ్దమునకు ఆత్మానాత్మ విచారణమని యర్థము. దాని గురించినది గావున సాంఖ్యయోగమన బరగు)

☞దయాయుక్తుఁడగు అర్జునునకు శ్రీకృష్ణుఁడు చెప్పినని సంజయుఁడు దెల్పుట.

సఞ్జయ ఉవాచ :

**తం తథాకృపయాఽఽ విష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,**
**విషీదన్తమిదం వాక్యమువాచ మధుసూదనః. 1**

తా. అట్లు దయా సమేతుడై కన్నీరు విడుచుచు వ్యాకులత జెందిన వాడును, దుఃఖాక్రాంతుడైన యర్జునుని జూచి శ్రీకృష్ణుండిట్లు పలికెను.

శ్రీ భగవానువాచ :

**కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్**
**అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికరమర్జున! 2**

తా. అర్జునుడా ! యుద్ధమును జేయుటకు దగిన సమయము నందు, శూరులగు వారికి దగనిదియును, స్వర్గమును గలుగ జేయనిది యును, అపకీర్తికి గారణమైనదియును నైన యీ దుఃఖరూపమైన పిరికి తనము నీకెట్లు గలిగె?

☞అకీర్త్యాది మనః కలుషములను విడిచి యుద్ధమునకు లెమ్ము.

**క్లైబ్యం మాస్మగమః పార్థ ! నైతత్త్వయ్యుపపద్యతే,**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప! 3**

తా. అర్జునా ! మంచిసమయమునందు నీకిట్టి మనోవ్యాకులమెందుకు గలిగె? ఇది యార్య సమ్మతముకాదు,పరలోకసాధనము కాదు,అపకీర్తి కరమైనది. దీనిని విడిచి యుద్ధమునకు లెమ్ము.

☞భీష్మ ద్రోణులు పూజించుటకు యోగ్యులేగాని యుద్ధమునకుఁ దగినవారుగారు.

అర్జున ఉవాచ-

కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన! 4

తా. మధువను రాక్షసుని సంహరించినవాడవును, శత్రువులను సంహరించినవాడవును అయిన ఓ కృష్ణా ! నేను పూజ్యులగు భీష్మద్రోణులను యుద్ధమునందు బాణములచేత నెట్లు కొట్టగలను?

☞గురువుల జంపుటచేఁ గల్గు భోగములకంటె భిక్షాన్నము మేలు

గురూనహత్వా హి మహానుభావాన్ శ్రేయోభోక్తుం భైక్ష్యమపీహలోకే
హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుఞ్జీయభోగాన్ రుధిరప్రదిగ్ధాన్.5

తా. మహానుభావులును, నాకు గురువులునైన భీష్మద్రోణాదులను జంపుటచే లభించెడి భోగముల (ననుభవించుట) కంటె, వారిని జంపక బిచ్చమెత్తి సంపాదించిన ద్రవ్యమును తిని జీవించుటయే శ్రేష్ఠము. ధర్మమును వదలి గురువుల జంపి వారి రక్తమునుజూచి యర్థకామాత్మకములగు భోగములను అనుభవించితినేని, ఈలోకమునందు మాత్రము అనుభవింప గలనేకాని, పరలోకమునందు అనుభవింపజాలను.

☞యుద్ధముఁ జేయుటకు యోగ్యమైనను, అర్జుననకుఁ దోఁచిన సంశయము.

న చైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః
యానేవహత్వా న జిజీవిషామస్తేఽవస్థితాః ప్రముఖేధార్త రాష్ట్రాః6

తా. యుద్ధమునందు మనమే జయమును బొందుదుమో? లేక దుర్యోధనాదులే జయమును బొందుదురో? ఈ విషయమును మనము తెలిసికొన జాలకయున్నాము. మరియు ఏ భీష్మాదులను జంపిన వెనుక మనము జీవింపలేమో? అట్టి భీష్మాదులిప్పుడు యుద్ధసన్నద్ధులై మనకెదుట వచ్చియున్నారు. కావున నిప్పుడు నాకేమియును దోఁచియుండలేదు.



☞శిష్యభావముచే శరణాగతుఁడైన అర్జునునిచేఁ జేయబడిన శ్రేయస్సాధన.

కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామిత్వాంధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.7

తా. స్వజనములనెట్లు చంపుదునను శోకముచేతను, చంపుట వలన పాపము సంభవించునను భయముచేతను, నా మనస్సు చెడిపోయినది. కావున ధర్మాధర్మముల నిశ్చయింపజాలకున్నాను. ఈ ధర్మ సందేహము దీర్చుటకు నాకు నీకంటె వేఱుగతిలేదు. నీవే నాకు గురువు, నన్ను శిష్యునిగా నంగీకరించి యుద్ధముచేయుట మంచిదో యుద్ధము మానుట మంచిదో తెలియ జెప్పుము, నీ యాజ్ఞ ప్రకారము నే నడచుకొనియెద.

☞బ్రహ్మజ్ఞానముఁ దప్ప ఇహలోకములలో భోగలాభముచే శోకనివృత్తి గానేరదు.

న హి ప్రపశ్యామి మమాపనుద్యా ద్యచ్ఛోకముచ్ఛోషణ మిన్ద్రియాణామ్
అవాప్య భూమా వసపత్నమృద్ధం రాజ్యంసురాణామపిచాధిపత్యమ్.8

తా. నిష్కంటకమును,సమృద్ధమునైనట్టి మహీరాజ్యము మాత్రము కాదు, దేవాధిపత్యము సయితము లభించినను, బంధువధోద్యోగమున నింద్రియములను శోషింపజేయుచున్న నా శోకము ఏవిధమున దొలగునో అట్టి యుపాయమునాకు గనబడలేదు. (కావున దానిని బోధించి నా దుఃఖమును బోగొట్టుము.)

☞అర్జునుఁడు యుద్ధాభిలాష విడిచి తూష్ణీభావముఁ బొందుట.

సఞ్జయ ఉవాచ :

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ. 9

తా. శత్రువులను దపింపజేయువాడును, ఆలస్యము లేనివాడును నగు నర్జునుడిట్లు సర్వేంద్రియ నియామకుడగు శ్రీకృష్ణునితో జెప్పి, యుద్ధము చేయనని యూరకుండెను.

☞మోహగ్రస్తుఁడగు అర్జుననకు బోధించుట

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః. 10

తా. ఓ ధృతరాష్ట్రుడా! రెండు సేనలయొక్క మధ్యమునందు నిలిచి యిదివరకు జెప్పబడిన ప్రకారము వ్యసనమును బొందుచున్న యర్జునుని పరిహసించువానివలె శ్రీకృష్ణుడిట్లనియె.

☞ జ్ఞానకర్మయోగములు నిరూపణము.

అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః 11

తా. నీవు దుఃఖింపదగని భీష్మద్రోణాదుల గురించి దుఃఖించితివి. మాటలు మాత్రము వివేకులు పలుకునట్టి మాటలను పలుకుచున్నావు. (పై వాక్యము భగవద్గీతా శాస్త్రమునకు బీజము) మృతినొందినవారిని గూర్చి గాని, బ్రదికియున్నవారిని గూర్చిగాని పండితులు శోకింపరు.

☞ (తత్త్వం) పదార్థమునకు త్రికాలముల యందును బాధలేదు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామ స్సర్వే వయమతః పరమ్. 12



తా. నేను ఒకప్పుడును లేనివాడనుగాను, నీవును లేనివాడవుగావు. ఈ భీష్మాది రాజులును లేనివారునుగారు మనమందరమును ఈ దేహనాశ నము అయిన పిమ్మట లేక పోవువారము గాము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తర ప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి. 13

తా. ఈ శరీరమందు బాల్యయౌవన వార్ధక్యావస్థల లాగున క్రమముగా వచ్చునో ఆ ప్రకారమే జీవునికి నీ శరీరముపోయి వేరొక శరీరము వచ్చును. అనగా జీవుడొక శరీరము విడుచటయు వేరొక దేహముం గొనుటయను స్వభావసిద్ధములగు మార్పులే యనుకొని వాని విషయమై బుద్ధిమంతుడు దుఃఖింపడు.

☞ ముముక్షువు శీతోష్ణాది ద్వంద్వ సుఖములు సహించవలె.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ ! శీతోష్ణసుఖదుఃఖదా
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత! 14

తా. ఓ యర్జునుడా ! ఇంద్రియములకు శబ్దము మొదలుగా గల విషయములతో గలిగిన సంయోగములు శీతోష్ణాదులను గలుగచేసి యా శీతోష్ణాదులద్వారా సుఖమును, దుఃఖమును గలుగజేయును (మరియు) రాకపోకలు గలవి. నశించునట్టివి. కావున ఆ శీతోష్ణాదుల సహింపుము.



☞ సమభావముఁగల ధీరునకు మోక్షమబ్బును.

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ!
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

తా. ఓ పురుష శ్రేష్ఠుడా ! సుఖదుఃఖములను సమానముగా నెంచుచు వివేకియై యెవడు వీనిచే బాధింపబడడో, అతడు మోక్షము నొందును.

☞ ఉండునది ఆత్మయే యని నిరూపించుట.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్తః స్త్వనయోస్తత్త్వదర్శిభిః 16

తా. లేని పదార్థము ఉండదనియు, ఉండు పదార్థము లేకపోదనియు బ్రహ్మవేత్తలగువారు ఈ రెంటియొక్క నిశ్చయము తెలిసికొనిరి.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్,
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి. 17

తా. దేనిచే సమస్త ప్రపంచమును వ్యాపింపబడినదో అట్టి ఆత్మ నాశములేదని తెలియుము. నాశములేని ఈ యాత్మకు నాశము గలిగించుట ఎవనికిని శక్యముగాదు.

☞ ఆత్మానాత్మలకు నిత్యానిత్యత్వ స్థాపనచే స్వధర్మోపదేశము.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత! 18

తా. ఆత్మనాశములేనివాడనియు ప్రత్యక్షాది ప్రమాణములచేత దెలియ దగినవాడనియు, నిత్యుడనియు, నతడు ధరించిన ఈ దేహములు నాశము కాగలవియని చెప్పబడినది. గావున ఓ యర్జునా ! నీవు యుద్ధముఁ జేయుము.

☞ ఆత్మవధాది క్రియలకు ఆశ్రయుఁడుఁగాడు.

య ఏవం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. 19

తా. ఈ యాత్మ చంపునని తలచువాడును, ఈ ఆత్మచంపబడునని తలచువాడును, తెలిసినవారుగారు. ఈ యాత్మ చంపునట్టిదియును గాదు, చంపబడునదియునుగాదు.

☞ ఆత్మ జన్మాది షడ్భావ వికారములు లేనివాఁడు.

న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితావా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే. 20

తా. ఆత్మ ఎప్పుడును పుట్టునదికాదు,చచ్చునదియు కాదు.ఒకప్పుడు లేకుండి నడుమ కలుగునదియుగాదు. మొదల ఉండి కొంత కాలమునకు నశించునదియుగాదు. పుట్టుకలేనిది, నాశములేనిది, స్థిరమైనది, అనాదియైనది. దేహము నశించినను అది నశించదు.

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తికమ్ 21

తా. ఓ యర్జునా ! ఎవడీ యాత్మనాశము లేనిదనియు, నిత్యమనియు, పుట్టుకలేనిదనియు, క్షయము లేనిదనియు దెలిసికొనుచున్నాడో అట్టి పురు షుడు ఎట్లు ఎవనిచేత వధింపబడును? ఎట్లు ఎవని వధించును? అట్టివాడు తాను వధింపబడుటయు, దానితరుల వధించుటయు అసంభవము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

తా. మనుష్యుడు ఎట్లుచినిగిన వస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను గ్రహించునో అట్లు ఈయాత్మ జీర్ణములైన దేహములను వదలి క్రొత్త దేహములను గ్రహించుచున్నది. (దేహముతోనున్నను ఆత్మకు వికారములులేవు.)

☞ శస్త్రాగ్నులచే ఆత్మనాశనముఁ బొందదు.



నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః 23

తా. దీనిని ఆయుధములు ఛేదింపజాలవు. అగ్ని దహింపనోపదు. ఉదకము తడుపజాలదు. వాయువు ఎండింపజేయనేరదు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః 24

తా. ఈ ఆత్మ ఛేదింప నలవిగానిది, దహింపనలవిగానిది, తడప శక్యముగానిది, ఎండింప సాధ్యముగానిది. సర్వవ్యాపకమైనది, నిశ్చలమును అనాదియునైనది, ఇంద్రియములకు గోచరముకానిది, మనస్సుచే జింతింప నలవిగానిది.

☞దేహత్రయాతీతుఁడగు ఆత్మవిషయమున జ్ఞాని దుఃఖింపడు.

అవ్యక్తోఽయమచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి. 25

తా. ఈ ఆత్మయితర వస్తువులవలె గోచరుడుకాడనియు, తలంపనశక్యుడనియు, వికార రహితుడనియు, చెప్పబడుచున్నాడు.కావున, ఆత్మ ఇట్టిదని తెలిసికొని నీవు శోకింపబనిలేదు.

☞ఆత్మకు జన్మమరణము ఉన్నవని ఎంచిననూ దుఃఖము లేదు.

అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథాఽపిత్వం మహాబాహో! నైవం శోచితుమర్హసి. 26

తా. అర్జునా ! ఒకవేళ నీవు ఈ యాత్మ సర్వకాలములయందును పుట్టుచుండుననియును, మరణమును బొందుననియును తలచెదవేమో? అట్లు దలచినప్పటికిని జననమరణములు గలుగుట సహజమే కనుక నీవు వ్యసనములోనికి బొందట దగదు.

☞దేహాదుల నాశమునకు దుఃఖించుట దగదు.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

తా. ఓ యర్జునా ! పుట్టినదానికి జావును, చచ్చినదానికి పుట్టుకయును గలుగుట నిశ్చయమైనది. గావున అవశ్యకముగాఁ గలుగుచున్న జనన మరణముల విషయమై నీవు వ్యసనము బొందుట యుచితము గాఁదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. 28

తా. ఓ యర్జునా ! ఈ శరీరములు పుట్టక మునుపు కనబడుట లేదు. పుట్టిన పిమ్మట కొంతకాలము కనబడుచున్నది. తుదకు మరణ మును బొంది మొదటివలెనే కనబడకపోవుచున్నవి. కావున ఇట్టి శరీర మును గూర్చి వ్యసనము బొందుట యుచితముగాదు.

☞ఆత్మను చూచువాఁడు, చెప్పెడివాఁడు వినువాఁడు దుర్లభుఁడు.

ఆశ్చర్యవత్పశ్యతి కచ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్. 29

తా. ఒకానొకడు ఈ యాత్మను ఆశ్చర్య వస్తువువలె జూచును. మఱియొకడు ఈ యాత్మను ఆశ్చర్యమువలెనే చెప్పును, మఱియొకడు ఆశ్చర్యముగా వినును. ఇంకొకడు వినియు, చూచియు, చెప్పియు తెలిసికొనడు.

☞నీవు ఆత్మను గురించి శోకింపకుము.

దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 30

తా. ఓ యర్జునుడా ! ఈ దేహము హతమైనను ఈ దేహమునం దుండు ఆత్మ యెప్పడును హతముకాదు. అందువలన ఈ భీష్మాది శరీరోపాధులుగల స్వయంప్రకాశాత్మను గూర్చి నీవు దుఃఖించుట దగదు.

☞క్షత్రియుఁడు ధర్మయుద్ధమునందు వెనుదియ్యగూడదు.

స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే. 31

తా. ఇంతియకాదు. నీవు స్వధర్మమును విచారించినను ఈ యుద్ధము విడువరాదని యేర్పడును. ఏలనగా, క్షత్రియులకు ధర్మశాస్త్రోక్తమైన యుద్ధముకంటె నితరమగు ధర్మమేదియును లేదు. మరియును, కుల ధర్మమును వదలగూడదు కాబట్టి క్షత్రియుడవగు నీవు నీ కుల ధర్మముగదా? యని యాలోచించి యుద్దమునుండి తొలగిపోకు.



☞ధర్మయుద్ధమే స్వర్గద్వారము.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ ! లభన్తే యుద్ధ మీదృశమ్. 32

తా. ఓ యర్జునా ! కోరకయే వచ్చినదియు, తెరువబడిన స్వర్గ ద్వారమువంటిదియు అగు నిట్టి యుద్ధమును ఏ రాజులు బొందుదురో ఆ రాజులు సుఖవంతులు.

☞ధర్మయుద్ధముఁ జేయనివానికి పాపము.

అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి. 33

తా. లేక నీవు ధర్మయుక్తమగు ఈ యుద్ధమును జేయని యెడల, క్షత్రియ కులమునకు దగిన ధర్మమును, కీర్తిని వదలిన పాపము బొందుదువు.

☞కీర్తివంతునకపకీర్తి, మరణముకంటె నధికము.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్
సంభావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే. 34

తా. దేవతలు, ఋషులు, మనుష్యులు మొదలగువారు స్వధర్మ త్యాగము జేసెనని చిరకాలము నిన్ను నిందింతురు. గౌరవింపబడినవానికి యపకీర్తి మరణముకంటె నధికము.

భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35

తా. ఏ మహారథులగు దుర్యోధనాదులచే నీవు సమ్మానింపబడితివో వారే నిన్ను రణమునుండి పారిపోయెనని తలంతురు. ఇంతవరకు గౌరవింప బడి ఇపుడు అగౌరవమును బొందుదువు.

**అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః**
**నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. 36**

**తా. మరియు నీ శత్రువులు నీ బలమును నిందించుచు ననేకములగు ననరాని మాటలనందురు. ఇంతకంటె నధికదుఃఖమేమి కలదు?**

☞యుద్ధమునందు జయాపజయంబులచే ఇష్టప్రాప్తి యగు.

**హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ ! యుద్ధాయ కృతనిశ్చయః 37**

**తా. నీవు చంపఁబడినచో నీకు స్వర్గము లభించును. నీవు జయించువేని పృథ్విని భోగించెదవు. ఇందుచే నో కౌన్తేయా! పోరుటకు నిశ్చయించి నీవు లేచి నిలువబడుము.**

☞జయాపజయముల సమబుద్ధిచే యుద్ధముఁ జేసిన పాపము లేదు.

**సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ,**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38**

**తా. సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయము లను సమమముగా భావించి పిమ్మట యుద్ధముజేయుము.ఇట్లుచేసితివేని పాప మును బొందవు.**

☞కర్మబంధ నాశమగు కర్మయోగ నిరూపణము.

**ఏషా తేఽభిహితా సాంఖ్యే(1)బుద్ధిర్యోగే త్విమాం శృణు,**

(1) (ఇందుకు వ్యాఖ్యానము) వేదాంత శాస్త్రమున సద్గురువు వలన శ్రవణము చేసి వెంటనే మననముచేసి దాని సారమును మనస్సుచే గ్రహించుట సాంఖ్య మనియు, గ్రహించిన యర్థము ననుష్ఠానమునకుఁ దెచ్చుకొని ఫలమునొందుట యోగమనియుఁ జెప్పదగు.

**బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి. 39**

**తా. ఇంతవరకు చెప్పినది సాంఖ్యవిషయమగు జ్ఞానము. ఇక యోగ మును గురించిన జ్ఞానము జెప్పెద వినుము. ఈ జ్ఞానమువలన కర్మబంధ ములనుండి విడిపించుకొందువు.**



☞నిష్కామ కర్మ శ్రేష్ఠము.

**నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్. 40**

**తా. ఫలాపేక్షలేక ఈశ్వరార్పణగా జేయబడు నీ కర్మయోగమును ఆరంభించి ముగింపకపోయినను ఫలము లేకపోదు. ఆరంభించినది చెడినను పాపము సంభవింపదు. ఈ యోగము కొలదిగా నాచరింపబడి నను మహత్తరమగు సంసారభయమునుండి రక్షించును.**

☞ఆత్మానాత్మ బుద్ధుల నిర్ణయము.

**వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహకురునన్దన!**
**బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. 41**

**తా. అర్జునా ! సాంఖ్యయోగ జ్ఞానముగాని, కర్మయోగ జ్ఞానముగాని నిశ్చయరూపమగు జ్ఞానమొక్కటియే అగుచున్నది. ఇక నిశ్చయ జ్ఞానము లేనివారికి గలుగు బుద్ధి నానావిధముల యొప్పుచుండును.**



☞కామ్య పురుషుల స్వభావము.

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః**
**వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః. 42**
**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్,**
**క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి. 43**
**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్**
**వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే. 44**

**తా. అర్జునా ! వేదములందు ఫలములను దెలిపెడు అర్థవాదములకు బ్రియములును, స్వర్గమే యుత్తమ పురుషార్థమని నమ్మి దానికంటె నన్యము విశేషఫలము లేదనువారును, పుత్ర,మిత్ర, కళత్రాదులయందాశ గల అవి వేకులు భోగైశ్వర్యప్రాప్తికై అనేక కర్మభేదములను జెప్పుదురు. అట్టి మాటలకు మోసపోయినవారగుచు, భోగైశ్వర్యములందాసక్తి గలవారికి నిశ్చయరూప మైన బుద్ధి కలుగనేరదు.**

☞వేదము యొక్క పూర్వభాగము సాంసారికము తద్వ్యతిరిక్తుఁడగుము.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. **45**

**తా. అర్జునా ! కర్మములను దెలుపునట్టి వేదములు సకల దుఃఖము లను గలిగించునట్టి సంసారమే విషయముగా గలవి. కాబట్టి నీవట్టి సంసార మును వదలుకొనుటకు నిష్కాముడు, శీతోష్ణాది ద్వంద్వములను సహించు వాడు, సర్వకాలములయందు సత్త్వగుణము నాశ్రయించు వాడు, (1) యోగ క్షేమములు లేనివాడు అయి ఆత్మజ్ఞానము గలిగియుం డును.**

(1) "యోగక్షేమము" యోగము కావలసిన సమకూర్చుట పదార్థమును, క్షేమము=ఉన్న దానిని రక్షించుట, అని చదువరుల దెలియ దగినది.

☞ బ్రహ్మవేత్తకు సర్వానంద ప్రాప్తియగు.

యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః **46**

**తా. బావియందును, అంతటను నిండియున్న జలము నందును యెంత ప్రయోజనము గలదో బ్రహ్మజ్ఞానికి వేదములయందంత యుప యోగమే కలదు.**

☞ ఏకర్మగాని భగవదర్పణబుద్ధితో చేసినగాని ముక్తికి కారణముగాదు.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూర్మాతే సఙ్గోఽ స్త్వకర్మణి. **47**

**తా. కర్మచేయుటయందే నీకు స్వతంత్రము, ఫలములయందెపు డును నీకు స్వతంత్రములేదు. కర్మములను చేయుటకు వాని ఫలములను హేతువుగా మంచుకొనకుము, కర్మలను వదలకుము.**

☞ కర్మ సమబుద్ధిచే జేయుము.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ!
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. **48**

**తా. యోగమునందున్నవాడవై కర్మములనుజేయుము. కర్తృత్వాభి మానము వదలుము. కార్యము సిద్ధించినపుడును ప్రతికూలించినపుడును సమబుద్ధితో నుండుము. సమత్వమే యోగమనబడును.**



**వ్యాఖ్య॥ ఏ కార్యమునైన జేయునపుడు "నేను చేయుచున్నా" ననెడు భావము కర్తృసంగమనబడును. "ఇది నాది, దీని ఫలము నాకు జెందవలయు"నను భావము ఫలసంగమనబడును. ఈ ద్వివిధ సంఘ మును విడువవలయు.**

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. **49**

**తా. ఓ యర్జునా ! సమత్వబుద్ధితో గూడుకొనిన నిష్కామకర్మము కంటె కామ్యకర్మము మిగుల దక్కువయైనది. కాబట్టి ఫలాభిలాషను వదలి కర్మము చేయుము. అట్లు జేయువేళ, పరమార్థజ్ఞానముదప్ప మతియేది యును సంసారబంధమును బోగొట్టజాలదని తలచి పరమార్థ జ్ఞానమునే కోరుము. ఫలములు గోరువారు అల్పులు.**

☞ జ్ఞానమునకు కర్మ చేయుము.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. **50**

**తా. సమత్వబుద్ధితో గూడినవానిని పుణ్యపాపములు రెండును పొందవు. కాబట్టి నీవుయోగము నవలంబింపుము. కర్మములు చేయుట యందు యోగము నేర్పరితనము.**

☞ నిష్కామకర్మచే జ్ఞానముఁ బొందిన భవబంధ నివృత్తియగు.

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్. **51**

**తా. సమత్వబుద్ధితోగూడుకొన్న పండితులు, కర్మము వలనఁబుట్టిన ఫలమును వదలి జన్మబంధమునకు లోఁబడనివారగుచు, సర్వోపద్రవ రహిత మైన విష్ణుపదమునుఁ బొందుదురు.**

☞ మోహముఁ గడచిన శ్రవణాదులఁ గర్తవ్యము లేదు.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. **52**

**తా. నీ బుద్ధియందు దేహమే నేననియెడు తలంపు యెప్పుడు విడిచి పోవునో ఆ సమయమునందు కర్మకాండచే వినదగిన దానిచేతను, ఇది**

వరకు వినిన దానితోడను ప్రయోజనములేదు. గావున నీకు వినదగిన యర్థములందును విన్నయర్థములందును వైరాగ్యము గలుగును.

☞ భ్రమసంశయములు బోయిన యోగము సిద్ధించు.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

తా. వేదాంత శ్రవణముచేత చలనము నొందిన నీ బుద్ధియెప్పుడు సమాధియందు నిశ్చలముగా నిలుచునో అప్పుడు జ్ఞాన యోగమును, తద్వారా దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తి బొందగలవు.

☞ స్థితప్రజ్ఞుని లక్షణములందు అర్జునుని ప్రశ్న.

అర్జున ఉవాచ :

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. 54

తా. కష్ణా! సమాధియందున్నవాడై నిశ్చలబుద్ధి గలవానికి ఏమి (1) లక్షణము? నిశ్చలబుద్ధిగల పురుషుడు ఏమి (2) చేయును? ఎట్లు (3) కూర్చుండును? దేనిని (4) బొందును.

(1) (2) (3) (4) ఈ నాల్గు ప్రశ్నలుకు ఉత్తరము ముందు శ్లోకములలో జూడందగు.

శ్రీ భగవానువాచ :

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

తా. అర్జునా ! ఆత్మస్వరూపానుభవముచే సంతసించిన వాడగుచు, మనస్సున బుట్టెడి సమస్త కామములను ఎప్పడు విడుచునో అప్పడతనిని, స్థితప్రజ్ఞుడని దెల్పనగు. (అనగఁదనచేతఁదానే తనయందు సంతసించు వాఁడు)

☞ 2-వ ఉత్తరము - స్థిత ప్రజ్ఞుఁడేమి చేయుననునది.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే. 56

తా. దుఃఖములుఁ గలిగినప్పడు కలఁతపడని మనస్సు గలవాఁడును, సుఖములయందు ఆశలేనివాఁడును, రాగము, భయము, క్రోధము



లేనివాడును అగు (1) మునిస్థిత ప్రజ్ఞుఁడని చెప్పఁబడు.

(1) ముని - సన్యాసి = ఆత్మ మనశీలుడు.

☞ 2-వ ఉత్తరము-

యస్సర్వత్రానభి స్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

తా. ఎవఁడు దేహప్రాణములయందు అంతటను స్నేహములేని వాడగుచు, ఆయా శుభాశుభములఁ బొంది శుభముచే సంతసమును, అశుభముచే దుఃఖమును బొందక యుండునో వాని బుద్ధి నిశ్చలమని చెప్పఁబడును.

☞ 3-వ ఉత్తరము-

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

తా. తాఁబేలు, తన యవయవములను లోపలికి ముడుచుకొనునట్లు యెప్పఁడు యోగి తన ఇంద్రియముల నన్నింటిని విషయములనుండి మఱలించుకొనునో అప్పడు యతని బుద్ధి నిశ్చలమని చెప్పఁబడు.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

తా. ఆహారము మాత్రము విడిచిన దేహికి విషయములు మాత్రమే విడుచును గాని వానియందలి యభిలాష విడువదు. పరమాత్మను దలఁచిన పిమ్మట నాయభిలాషయు నశించును.

యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః. 60

తా. ఓ యర్జునా ! పండితుడైనవాడు ఎంత పూనికతో యుండినను, బలముగల ఇంద్రియములు వాని మనస్సును బలాత్కారముగ నాకర్షించును.

☞ 4-వ ఉత్తరము-

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

తా. ఆ ఇంద్రియములన్నిటిని నిగ్రహించి యోగముతోబూనిన వాడగుచు, నాయందె మనస్సునుంచి యుండవలెను. ఏలనగ, ఎవనికి ఇంద్రియములు స్వాధీనమగునో వానిబుద్ధి నిశ్చలమగును. ఎవఁడు (1) ఇంద్రియములను స్వాధీనము చేసికొనువాఁడే స్థితప్రజ్ఞుఁడు.

(1) భక్తి, ఈశ్వర సాహాయ్యము లేక చేయు పురుషప్రయత్నము ఫలమివ్వదు.)

☞మనో నిగ్రహము లేనివానికి దోషప్రాప్తి.

**ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గ స్తేషూపజాయతే,**
**సఙ్గత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. 62**

తా. పురుషుడు విషయములను ధ్యానించుటచేత వాని యందతనికి నాసక్తి కలుగును. ఆ యాసక్తివలన కామము కలుగును. కామముచేత క్రోధము కలుగును.

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః,**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. 63**

తా. క్రోధమువలన (1) మోహము, మోహమువలన స్మృతిభ్రంశము, దానివలన బుద్ధినాశము, బుద్ధినాశము వలన స్వరూపనాశనముఁ గలుగు.

(1) మోహము=కార్యాకార్య వివేక శూన్యత

☞ స్థిత ప్రజ్ఞుని యాచరణ.

**రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్,**
**ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. 64**

తా. అందువలన (2) రాగద్వేషములను వదలి స్వాధీనములైన ఇంద్రియములచేత శరీరము నిలుచుటకై విడువ శక్యముగాని విషయముల ననుభవించుచు స్వాధీనమైన మనస్సుగల యోగి నిర్మలుఁడగును. లేక స్వస్థతఁ జెందును.

(2) రాగద్వేష వియోగముచే ఇంద్రియ జయమును, ఇంద్రియ జయముచే మనో జయమును, మనోజయముచే నాత్మ దర్శనమునకువలయు మనోనైర్మల్యము గలుగుచున్నదని గ్రాహ్యము.

☞చిత్తప్రసాదమునకు సర్వదుఃఖ శాంతియే ఫలము.



**ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి. 65**

తా. నిర్మలత్వము కలుగుటవలన వీనికి సమస్త దుఃఖములు నశించును. ఎందుకనగ, ప్రసన్నమగు మనస్సుగల వానికి శీఘ్రముగా బుద్ధి, యాకాశమువలె నంతట నుండునదియై స్థిరపడును.

☞శాంతి లేనివానికి సుఖమెక్కడిది ?

**నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా**
**న చాభావయతః శాన్తి రశాన్తస్య కుతః సుఖమ్. 66**

తా. ఇంద్రియనిగ్రహము లేనివానికి ఆత్మబుద్ధి కలుగదు. ఆత్మభావన లేనివారికిఁ జిత్తస్థిరముఁ గలుగదు. చిత్తస్థిరము లేనివారికి సుఖముఁ గలుగదు. (గావున విషయములను వాసనలతో విడిచి మనస్సుతో నింద్రియములను వశపఱచుకొని సతతము బ్రహ్మనిష్ఠ గలవాఁడే జీవన్ముక్తుఁడు.)

☞ఇంద్రియనిగ్రహము లేనిదానిచే పురుషుని ప్రజ్ఞ చెడు.

**ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి. 67**

తా. స్వేచ్ఛగా విషయములలోఁ దిరుగుచున్న ఇంద్రియములకు మనస్సులోఁ బడినయెడల సముద్రమునందు గాలిలో చిక్కిన నావవలెఁ బురుషునియొక్క బుద్ధిని హరించును.

☞బుద్ధి స్థిరముగనుండుటకు పురుషులు ఇంద్రియముల నిగ్రహించవలె.

**తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68**

తా. ఓ యర్జునా ! అందుకై ఎవఁడు తన ఇంద్రియములన్నిటిని దద్విషయములనుండి మఱలించునో అతని బుద్ధి నిశ్చలమగును.

☞స్థిత ప్రజ్ఞుని మహిమ.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః69**



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

**తా. (1) సర్వ ప్రాణులకు ఏ వస్తువు తెలియకపోవుట వలన (2) రాత్రిగనుండునో, ఆ వస్తువును యోగి తెలుసుకొని పగటివలెఁ జూచుచుం డును. యావత్ ప్రపంచమును సమస్త ప్రాణులు జాగ్రత గలిగిఁ జూచుచుం దురో యద్దానిని యోగిరాత్రివలెఁ జూచును.**

(1) సన్యాసోపనిషత్తునందలి, ఆత్మవిద్య నభ్యసించుచున్న వలన వానికిఁ బ్రకాశమాన మగు విద్యయే పగలుగాను, అట్టి ప్రకాశములేని యవిద్యయే రాత్రిగాను జెప్పఁ బడుచున్నది.

(2) నిశా యనగా కామ్యకర్మాసక్తి. జాగ్రతా – యనగ నిష్కామ్యకర్మాసక్తి.

**వ్యాఖ్య ॥ సర్వ ప్రాణులకు రాత్రియగునది పరమాత్మ యొక్క తత్త్వము. ఆ తత్త్వమును యోగిచూచి యానందించును. సర్వప్రాణులకు లౌకిక వైదిక వ్యవహారములు జాగ్రత్కాలము. అద్దానిని యోగి విషయ విస్ఫూర్తి లేని వాఁడగుచు ప్రకాశింపకుండును.**

☞స్థిత ప్రజ్ఞుని యందు సమస్త విక్షేపమూ శాంతముగనుండు.

ఆ పూర్యమాణ మచల ప్రతిష్ఠమ్ సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ. **70**

**తా. నదీనద ప్రవాహములచే నిండినను దన హద్దు మీఱక సముద్ర మెట్లు కొంచమైననూ వికారముఁ జెందక యుండునో, అట్లే శబ్దాది విషయ ముల గ్రహించుచుండియు, లేశమైననూ వికారముఁ బొందక యుండు యోగి శాంతినిఁ బొందుగాని, విషయములఁ గోరువాఁడు ఎన్నటికిని శాంతిని బొందఁడు. (సమస్త విషయములు ఎవనికి ఆత్మయందే యణగు చున్నవో, అతఁడు ముక్తినిఁ బొందు.**

☞వాసనా, స్పృహ, మమత్వము, అహంకారము లేనివాఁడు శాంతినిఁ బొందు.

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః స శాన్తి మధిగచ్ఛతి. **71**

**తా. ఏ పురుషుఁడు సమస్త కామములను విడిచి దేనియందును నాశలేనివాఁడై అహంకారమును, మమకారమును, లేనివాఁడైయుం డునో అతఁడు శాంతిని బొందును.**

☞(బ్రహ్మనిష్ఠా ఫలము).



ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యామన్త కాలేఽపి, బ్రహ్మ నిర్వాహణమృచ్ఛతి. **72**

**తా. ఓ పార్థా! బ్రాహ్మీ స్థితియన నిదియే. ఈ స్థితి బొందినపిదప నెవరును మోహము నొందరు; అంతకాలమునందు, అనగా మరణ సమ యమునందు సయితమీస్థితియందే యుండునుగాన నతనికి బ్రహ్మనిర్వా ణము. అనఁగా బ్రహ్మమందు లీనమగుటయను స్వరూపముఁగల మోక్షము లభించును.**

**వ్యాఖ్య॥ (బ్రాహ్మీ స్థితియనునది కర్మయోగముయొక్క అంతము నందుఁ గలుగు యుత్తమోత్తమస్థితి) ఏ మనుష్యునికైనను జీవితకాల ములో ఈ బ్రాహ్మస్థితి కొంత ప్రొద్దుండి అంత్యకాలములో లేనియడల ముక్తినివ్వదు. అందులకు మనుష్యుఁడు చిన్ననాటినుండి ఆ స్థితిని బొందు టకు ఏర్పరచిన కర్మలను జేయవలె. అట్లు చేసిన అంత్యకాలమున వానికి ఆ స్థితి గలిగి బ్రహ్మముఁ దానే యగునని, కృష్ణ పరమాత్మ అర్జును నకుఁ దెల్పె.**

**ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగోనామద్వితీయోఽధ్యాయః**

ఇదియుపనిషత్తును బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదమగు భగవద్గీతయందు
సాంఖ్యయోగమను, రెండవ అధ్యాయము ముగిసెను.

# కర్మ యోగము

## 3. తృతీయోऽధ్యాయః

(ఈ అధ్యాయము గీతాస్వరూపముఁ దెలియుటకు ముఖ్య కీలకమని దెల్పనగు. ఇందు కర్మ యెట్లు చేయవలెను. మఱియు ఏ కర్మ జేయవచ్చు. నిజమగు కర్మయని దేనిననవలెను? పై మూఁడు విషయములు వివరింప బడ్డవి. (ఇదియునుఁగాక, జ్ఞానము, పారమార్థిక కర్మలనే జేయవలెనని వివరింపబడినది.)

అర్జున ఉవాచ –

☞ అర్జునుని మోక్షసాధన ప్రశ్న.

జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధి ర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ. 1

తా. అర్జునుఁడు అడుగుచున్నాఁడు- ఓ కృష్ణా ! నీకు కర్మమునకంటె జ్ఞానమే శ్రేష్ఠమని యభిప్రాయమైన యెడల నన్ను భయంకరమగు యీ కర్మజేయుమని యేల ప్రేరేపించుచున్నావు?

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోऽహమాప్నుయామ్. 2

తా. నీవు ఒకప్పుఁడు కర్మ గొప్పదనియు, నింకొక మాఱు జ్ఞానము గొప్పదనియుఁ జెప్పుచున్నావు. అందువలన రెండింటిలో నేది గొప్పదోనేను తెలిసికొనఁజాలక యున్నాను. కావున నేను దేనివలన శ్రేయస్సును పొంద



గలనో అట్టిదొక్కటి నాకు నిశ్చయించి చెప్పుము.

☞ మోక్షమునకు కర్మ, జ్ఞానయోగములు రెండును సాధనములే.

శ్రీ భగవానువాచ :

లోకేऽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాऽనఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

తా. శ్రీకృష్ణుఁడిట్లనియె - ఓ పాపరహితుఁడా! ఈ లోకమున జ్ఞాన కర్మముల అధికారభేదముచే రెండు విధములగు నిష్ఠ, వెనుక అధ్యాయము నందు నాచేఁ జెప్పఁబడెను. అందు శుద్ధాంతఃకరణముండువారికి జ్ఞాన యోగమూ, అశుద్ధాంతఃకరణముండువారికి నిష్కామకర్మయోగమూ ఒప్పును.

☞ కర్మచేయకనే వట్టి సన్యాసముచే ముక్తి దొరకదు.

న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోऽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4

తా. ఫలమును గోరక కర్మములనుఁజేసిన యెడల అట్టి కర్మములు సకల పాపములను బోఁగొట్టి చిత్తశుద్ధిని గలుగఁజేసి జ్ఞానమును గలుగఁ జేయుచున్నవి. ఆ జ్ఞానము, ఆత్మానుభవమునుఁ గలుగఁజేయును. గావున లోకమందెవ్వఁడు మోక్షమును గోరునో, అట్టివాఁడు ఫలమునుఁగోరక కర్మములనుఁజేసియే తీరవలెను. కష్టమని సోమరితనముచేఁ గర్మము లనుఁ జేయకపోయిన ముక్తినిఁ బొందడు.

☞ సమాధియందును, సుషుప్తియందును దప్ప తక్కిన వేళలలో కర్మచేయక యుండుట పొసగదు.

న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

తా. ఎవఁడుగాని యొక క్షణమైన కర్మములఁజేయక నుండనోపఁ డు. సమస్త ప్రాణులు ప్రకృతిగుణములకు లోబడివారగుచు నిరంతరముఁ గార్యములఁ జేయుచునే యుందురు.

☞ ఇంద్రియముల నడ్డగించి మనస్సున విషయములుఁ గోరువాఁడు డాంభికుఁడు.

**కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,**
**ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే. 6**

**తా. ఎవఁడు కర్మేన్ద్రియములను నిగ్రహించి విషయములను మనస్సు చేత స్మరించుచుండునో, అట్టి వివేక శూన్యుఁడు (1) మిథ్యాచారుఁడని జెప్పఁబడును.**

(1) మిథ్యాచారుఁడనగ=మనస్సున దలచుట యొకటి, చేయునదే మఱియొకటి.

☞మనస్సును, జ్ఞానేన్ద్రియములను అడ్డగించి కర్మేన్ద్రియములచే నిష్కామకర్మ చేయువాఁడుత్తముఁడు.

**యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,**
**కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. 7**

**తా. అర్జునా ! ఎవఁడు మనస్సుచేత ఇంద్రియముల నిగ్రహించి ఫలాపేక్ష లేనివాఁడగుచు కర్మేన్ద్రియములచేత కర్మయోగము ననుష్ఠించునో యతఁడు ఉత్తముఁడగుచున్నాడు.**

☞కామ్యకర్మ శుభమైననూ బంధకముగాన ఈశ్వరార్పితముగఁ జేయుము.

**నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః,**
**శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః. 8**

**తా. అందువలన నీవు (1) నిత్యమైన కర్మమునుఁజేయవలెను. ఏల యనఁగాఁ గర్మచేయకుండుటకన్నను కర్మచేయుట మేలు. నీవు కర్మచేయవేని నీకు శరీరస్థితి కూడ సిద్ధింపదు.**

(1) నిత్యకర్మయనగ=సంధ్యావందనాది క్రియలు.

**యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః,**
**తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గ స్సమాచర. 9**

**తా. ఈశ్వరార్థముగఁ జేయు కర్మముకంటె భిన్నమగు కర్మలోకమునకు బంధమునుఁ గలిగించును. అందులకై అర్జునా ! నీవు ఈశ్వరార్థమగు కర్మమును ఫలాపేక్షలేని వాఁడై చేయుము.**

☞ప్రజలకు, ప్రజాపతి దెల్పిన విషయము.



**సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,**
**అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్. 10**

**తా. పూర్వము ప్రజాపతి యజ్ఞములతోఁగూడ ప్రజలను సృజించి ఇట్లు పలికెను; "మీరు కోరిన కోరికల నిచ్చునదియగు గాక"**

☞మంచిపనినంతను యజ్ఞమని యూహింపుము.

**దేవా న్భావయతానేన తే దేవా భావయన్తువః,**
**పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ. 11**

**తా. మీరు యజ్ఞములొనర్చి దేవతలను ఆరాధింపుఁడు. వారు మిమ్మును వర్షాదులచే వృద్ధిబొందించి సంతోష పఱతురుగాక, ఇట్లు మీరు ఒకరికొకరు సంభావించుకొనుచు నుత్తమమైన శ్రేయస్సునుఁ బొందుచు జ్ఞానము గలిగి తద్వారా ముక్తినిబొందుఁడు.**

☞దేవతలకియ్యక తినువాఁడు దొంగ.

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః,**
**తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుఙ్క్తేస్తేన ఏవ సః. 12**

**తా. ఏలయనగ, దేవతలు మీచే యజ్ఞముల మూలముగ సంతసించి మీరు గోరిన భోగముల నిత్తురు. దేవతలచే నియ్యబడిన దానిని ఆ దేవత లకు ఇవ్వక ఎవఁడు తానే భుజించుచున్నాఁడో అతఁడు దొంగయేకాని వేఱు కాదు.**

**యజ్ఞశ్శిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః,**
**భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్. 13**

**తా. యజ్ఞముచేసి మిగిలిన పదార్థమును దినువారిని, సమస్త పాపములు వీడిపోవును. యజ్ఞముకొఱకుఁ గాక తమకొఱకే వండుకొనువారు పాపమునే అనుభవించుచున్నారు.**

☞యజ్ఞము లననేమి ?

**వివరణము :**

**మానవుఁడు ప్రతినిత్యమూ అయిదు విధములగు వధలుఁ జేయుచుండును. అవి ఎవ్వియనగ;**

పాపములు

(అ) కోయునపుఁడు (ఆ) విఱుచునపుఁడు

(ఇ) నూఱునపుఁడు (ఈ) కాల్చునపుఁడు

(ఉ) తుడుచునపుఁడు

ఈ పాపములుఁ బోవుటకు పంచయజ్ఞముల శాస్త్రములు చెప్పును, ఎవ్వియన:

(అ) దేవయజ్ఞము - నిత్యాగ్నిహోత్రముచేయుట

(ఆ) పితృయజ్ఞము - పితృదేవతలనారాధించుట

(ఇ) మనుష్యయజ్ఞము - అతిధులకు భోజనము పెట్టుట

(ఈ) భూతయజ్ఞము - జంతువుల కాహారము పెట్టుట

(ఉ) బ్రహ్మయజ్ఞము - వేదాధ్యయనముఁజేయుట

గృహస్థగువాడీ యజ్ఞములచే ఆయా దేవతల సంతోషపెట్టుచో అన్ని పాపములనుండి విముక్తుడగును. ఇవి యన్నియు ఫలాపేక్షారహితులై చేయు వారు మోక్షమునకు అర్హులగుదురు.

☞ప్రాణుల యుత్పత్తి క్రమము.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్న సంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. 14

తా. భూతములు(ప్రాణులు) అన్నమువలనను, అన్నము వర్షాధిపతి యగు పర్జన్యునివలనను, పర్జన్యుఁడు యజ్ఞమువలనను, యజ్ఞము కర్మవల నను కలుగుచున్నవి.

వివరణ : 'అన్నాత్ పురుషః' అని తైత్తిరీయోపనిషత్తులో నన్నము వలన మనుజుఁడు గల్గునని చెప్పఁబడియున్నది. కావున భూతములుఁ బుట్టుటకు అన్నము కారణము.

కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15



తా. కర్మ (1) వేదమువలనఁ గలుగును. ఆ వేదము పరమాత్మవలనఁ గలుగును. అందుకై నిత్యమైన వేదము నందుఁ బ్రతిష్ఠితము యజ్ఞము. (అనగ ఉంచబడినది.)

(1) బ్రహ్మమనగ = వేదము

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయు రిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి. 16

తా. ఓ అర్జునుఁడా! ఇట్టి పరస్పర కారణభూతమగు నీ జగచ్చక్రము నీలోకమున నెవ్వడనుసరించి ప్రవర్తింపఁడో అతఁడు పాపకార్యములఁ జేయుచు విషయలోలుఁడై పనికి మాలిన జీవనము చేయుచున్నాఁడు (గావున జ్ఞానియైనవాఁడు కర్మజేయవలెను.)

☞బ్రహ్మజ్ఞానికి కర్తవ్యము లేదు.

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ (2) మానవః,

(2) మా-అనగ=అజ్ఞానము, వ-అనగ=లేక, వ-అనగ=వర్తించువాడ, మానవ-అనగ=జ్ఞానముఁగలిగి వర్తించువాఁడనియు, ఇట్టివాఁడే మానవుడనియు భగవంతుని యాశయము.

ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే. 17

తా. ఏ మనుష్యుఁడు ఆత్మయందు రమించువాఁడగునో, ఎవఁడు దాని చేతనే తృప్తుఁడగునో, మఱియు దానియందే సంతోషముఁ జెందునో వానికిఁ జేయవలసిన దేమియు నుండదు.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః. 18

తా. అట్టి ఆత్మనిష్ఠగల వానికి లోకమందు ఏ కార్యమునైనఁజేయుట వలనఁ ప్రయోజనములేదు. చేయక యుండిన యెడల అపాయములేదు. అతఁడే ప్రాణులను దేనికిని యాశ్రయించవలసిన పనిలేదు.

☞ముముక్షువు చిత్తశుద్ధి కొరకు నిష్కామకర్మ జేయవలె.

తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తోహ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. 19

తా. కావున నీవు ఫలమందాసక్తి లేక నిరంతరమునియతమగు కర్మనుఁజేయుము. ఎందుకనగ ఫలాసక్తి లేక కర్మచేయుచున్న పురుషుఁడు ముక్తినిఁబొందును.

☞ముక్తుడైననూ లోకసంగ్రహమునకు కర్మ చేయవలె.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 20

తా. జనకుఁడు, అశ్వపతి మొదలగు రాజులు నిష్కామకర్మచేతనే ముక్తినిఁబొందిరి. నీవు ప్రజలు తప్పదారులఁ బట్టకుండ జేయుటకే యైనను ఆలోచించినవాఁడవై కర్మములను జేయఁదగుదువు.

☞జ్ఞానియగువాఁడెందుకు కర్మ చేయవలె.

యద్యదాచరతి (1) శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే. 21

(1) శ్రేష్ఠుడనగ= ప్రధానుఁడని శంకరుల అభిప్రాయము.

తా. తెలిసినవారే దోవత్రొక్కుదురో, ఇతరులు ఆమార్గమునే అనుసరింతురు. నీవు నిష్కామకర్మచేసిన యెడల, నిన్నాదర్శ పురుషునిగా యెంచిన వారును ఆ మార్గమునే నడతురు.

☞నేనే ప్రయోజనము లేకయే కర్మ జేయువాఁడ.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. 22

తా. నాకొకరితో ప్రయోజనము లేకపోయినను, మూఁడు లోకముల యందు నాకు కావలసినది లేకపోయినను నేను కర్మచేయుచునేయున్నాను.

☞శ్రేష్ఠుఁడు కర్మ జేయవలె.

యది హ్యాహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః. 23

తా. అర్జునా! నేను జాగ్రతతో నొకప్పుడును కర్మము చేయకయుందునేని మనుష్యులన్ని ప్రకారములుగా నా మార్గమునే యనుసరింతురు.



☞నేను సహితము కర్మచేయుచున్నాను. ఎందుకు ?

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మచేదహమ్,
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః. 24

తా. నేను కర్మముచేయని యెడ నీ లోకములన్నియు నాశమునొందును. సంకరముకూడఁ జేసినవాఁడ నగుదును. ఈ ప్రజలను చెఱిచిన వాఁడనగుదును.

☞జ్ఞానినిష్కామకర్మ జేయవలె.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసఙ్గ్రహమ్. 25

తా. ఫలాపేక్షతోగూడిన కర్మయందు అజ్ఞానికెంత శ్రద్ధయో అట్లే జ్ఞానియు ఇతరుల నిమిత్తమై అంత శ్రద్ధతో నిష్కామకర్మ చేయవలయును.



☞జ్ఞాని ఇతరులచేత కర్మ చేయించవలె.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్. 26

తా. కర్మమునందాసక్తులైన యజ్ఞానులకు జ్ఞాని బుద్ధిభేదము గలిగింప రాదు. తాను పూనికతోఁ గర్మములను జేయుచుండి వారివలనఁ గూడఁ గర్మములను జేయింపవలెను.

☞అవివేకి నేను కర్మచేయుచున్నానని తలచు.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

తా. ప్రకృతివలనఁ బుట్టిన సత్వరజస్తమోగుణములన్ని కర్మములకు కారణమగుచుండగా, అహంకారముగల యవివేకి యా కర్మములన్నియు తన చేతనే జరుగుచున్నవని తలచును.

☞జ్ఞానికి కర్మబంధము లేదు.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే. 28

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

తా. సత్వ, రజ, స్తమోగుణములు, వానివాని భాగములనుబట్టి వాని వాని పనులు చేయుచున్నవిగాని, నేనుమాత్రము సాక్షిని, నాకేమియు సం బంధములేదని జ్ఞానితలచును. అందుచే కర్మబంధ మతనికి అంటదు.

☞జ్ఞాని, అజ్ఞానికుపదేశించు విధము.

ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు
తానకృత్స్న విదోమన్దా న్కృత్స్నవిన్నవిచాలయేత్. 29

తా. జ్ఞానియగువాఁడు మోహితులగు అజ్ఞానులను చెఱచక తాను వారిని మంచిమార్గమునకుఁదేవలె. వారుండు స్థితిని జెఱుపరాదు. (కర్మ చేయని వానికంటె ఫలాపేక్షతోనైన జేసినవాఁడు, కొలదికాలము ఫలాపేక్షతో చేసినను మఱల నతఁడే నిష్కామకర్మ చేయగలఁడు. (గాన అజ్ఞానిని చెడ దీయకయే బాగు పఱచవలెనని పరమాత్మ యాశయము.)

☞ఈశ్వరార్పణబుద్ధిచే కర్మ చేయవలె.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

తా. సమస్త కర్మములను నాయందు సమర్పించి జ్ఞానముచే నిష్కా ముఁడవై, అహంకారము లేనివాఁడవై, సంతాపమును వదలి యుద్ధము చేయుము.

☞శ్రద్ధచే భగవంతుననుసరించిన యుత్తమ స్థితిఁ బొందు.

యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః,
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః. 31

తా. శ్రద్ధ గలిగి, ద్వేషము లేక యే మనుష్యులు నా మతము ననుస రించి వర్తించుచున్నారో, వారు కూడా కర్మబంధమునుండి విముక్తులగు చున్నారు.

☞భగవంతుని పలుకు ననుసరించనివాఁడు మూఢుడు, దుష్టుఁడు.

యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టా న చేతసః. 32

తా. నా యందు విశ్వాసములేక, నేను చెప్పిన మార్గమున నడవని వారు మూఢులనియు, అజ్ఞానులనియు, చెడిపోవువారనియు, సంసార



బంధనమునందే బంధింపబడియుందురని తెలియును. (వారెంత తెలిసియు తెలియనివారలే.)

☞జ్ఞానికైనను కర్మ నిరాకరించుట యశక్యము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

తా. జ్ఞానవంతుడైనను తన పూర్వజన్మ కర్మనుబట్టి యేర్పడిన స్వభావ మునకుఁ దగినట్లు కర్మనుచేయుచున్నాఁడు. ప్రాణులబట్టి స్వభామును ననుస రించును. అందులకై కర్మలను చేయక నిరాకరించుట యెంతమాత్రము లాభకారిగాదు.

☞రాగ, ద్వేషములు దొంగలవంటివి.

ఇన్ద్రియ స్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ. 34



తా. రాగము, ద్వేషము, ప్రతి ఇన్ద్రియ విషయమునందున్నవి. వానికి స్వాధీనము కాఁగూడదు. అవి దొంగల వంటివిగదా! (శ్రేయోమార్గమునకు శత్రువులు)

☞భయము గలుగఁజేయు పరధర్మముకన్న స్వధర్మమే మేలు.

శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

తా. లెస్సఁగా జేయబడిన యితరుల ధర్మముకంటె, గుణములేని దైనను తన ధర్మము మేలు. తన ధర్మము ననుసరించుచు చనిపోవుట మేలు. ఇతరుల ధర్మము నరకాది రూపమగు భయమును గలుగఁ జేయును.

☞దేనిచే మనుష్యుఁడు పాపమాచరించు.

అర్జున ఉవాచ :

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. 36

**తా. ఓ కృష్ణా ! పురుషుఁడు తనకిష్టము లేకపోయినను నిర్బంధముచేఁ బ్రేరేపింపఁబడినట్లు పాపము చేయుచున్నాఁడే అట్లు ఇతనిఁ ప్రేరేపించునది ఏది?**

☞ కామము జ్ఞానికి నిత్యవైరి.

శ్రీ భగవానువాచ :

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన (1) మిహ వైరిణమ్. 37

(1) మన నిజమగు శత్రువులు కామము, క్రోధములు, వారు మన యందుండువారే.

**తా. రజోగుణమువలనఁబుట్టిన యీ కామము, క్రోధముగాఁ బరిణమించును. కామమునకుఁ దృప్తిలేదు. కావున మహా పాపస్వరూపమైనది. ఇటువంటి కామమే సంసారమందు శత్రువని దెలియును.**

☞ జ్ఞానమునకు కోరికలు కప్పుకొన్నవి.

ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్. 38

**తా. పొగచేత నగ్నియు, ముఱికిచేత అద్దము, మావిచేత గర్భమందలి శిశువు కప్పఁబడినట్లు ఆ కామము చేత ఈ జ్ఞానము కప్పఁబడి యున్నది.**

☞ జ్ఞానియూ, అజ్ఞానియూ కోరికలను జయించవలె.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ. 39

**తా. ఓ అర్జునా ! జ్ఞానికి నిత్యశత్రువును, ఎప్పటికిని కోర్కె తీరనిదియు, తృప్తిలేనిదియు, కోరికలే స్వభావముగా గలదియునగు ఈ కామము చేత జ్ఞానము కప్పఁబడి యున్నది.**

ఇన్ద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 40

**తా. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఈ మూఁడును కామమునకు ఆశ్రయములని చెప్పఁబడును. ఈ కామమే ఇంద్రియములచేత జ్ఞానమును కప్పి నానావిధములుగ మోహపెట్టుచున్నది.**



☞ ఇంద్రియముల జయించి కామమును నిగ్రహించుము.

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్. 41

**తా. అర్జునా ! అందువలన నీవు మొదట నింద్రియములను నిగ్రహించి పాపస్వరూపములను, శాస్త్రానుభవ జ్ఞాననాశకమగు నీ కామమును పూర్తిగ విడువుము.**

☞ కోరికను జయించుటకు ముఖ్య సాధనము

ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు(1)సః. 42

(1) సః = అనగ పరమాత్మయని.

**తా. ఈ స్థూలదేహముకంటె ఇంద్రియములు గొప్పవని చెప్పుదురు. ఇంద్రియముల కన్నను మనస్సు గొప్పది. మనస్సుకంటె బుద్ధి గొప్పది. పరమాత్మ బుద్ధికంటెను గొప్పవాఁడు.**

☞ కోరికలు విడిచిన సర్వానర్థములుఁ దొలగు.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యా(1)త్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. 43

(1) ఆత్మానమాత్మనా = తన ఆత్మను సంస్కరింపఁబడిన మనస్సుచేత.

**తా. ఓ యర్జునా ! బుద్ధికంటె శ్రేష్ఠమగు ఆత్మను దెలిసికొని, ఆత్మచేత బుద్ధిని, బుద్ధిచేత మనస్సును, మనస్సుచేత ఇంద్రియములను జయించి సమస్త దుఃఖములకుఁ గారణమగు కామము అను శత్రువును జయిం చుము.**

గద్య॥ ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః

**వచనము॥ ఇది ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతయందు కర్మయోగమను మూడవ యధ్యాయము ముగిసెను.**

# జ్ఞాన యోగము

## 4. చతుర్థోఽధ్యాయః

(ఇందు కర్మచేయుటవలన నెట్లు చిత్తశుద్ధి కలుగును? మఱల, జ్ఞాన సంపాదనకు పాయమెద్ది? అను నీ రెండంశములు ఈ నాల్గవ యధ్యాయ మున శ్రీకృష్ణపరమాత్మ దెల్పియున్నాఁడు.)

☞గీత సనాతనము

శ్రీ భగవానువాచ :

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

తా. ఇప్పడు నీకు చెప్పచున్న ఈ యోగమును పూర్వము సూర్యునకు చెప్పితిని. (1) సూర్యుఁడు మనువునకు, మనువు ఇక్ష్వాకు మహారాజునకు చెప్పెను.

(1) వివరణము:- సూర్యుఁడు మనువునకు త్రేతాయుగ ప్రారంభమున దెల్పెనని, భారతమున శాంతిపర్వములో గలదు.

☞గీత పరంపరగ, యున్నది.

ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప. 2

తా. ఇట్లు ఒకరినుండి యొకరికి వచ్చిన ఈ యోగమును రాజర్షులు ఎఱుంగుదురు. దీర్ఘకాలమైనందున లోకము మఱచిపోయెను.

☞పరమాత్మకు అర్జునునిపై యున్న ప్రీతికి ఫలము

స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్. 3



తా. నీవు నాకు భక్తుఁడవనియు, స్నేహితుఁడవనియు, పురాతన మైన ఆ యోగమునే ఇపుడు నేను నీకుఁజెప్పితిని. ఈ యోగవిద్య మిక్కిలి రహస్యమై ఉత్తమమైనదని తెలిసి కొనుము.

☞కృష్ణుని పుట్టుక విషయమున అర్జుని ప్రశ్న.

అర్జున ఉవాచ :

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి. 4

తా. అర్జునుఁడు పలికెను- సూర్యుడనాదివాఁడు, నీవు మొన్నటివాఁడు. ఈ విషయము సూర్యునికెట్లు చెప్పితివి? దీని నెట్లు నమ్మవచ్చును!

☞మొదటి ప్రశ్నకు ఉత్తరము.

శ్రీ భగవానువాచ :

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప. 5

తా. భగవంతుడు చెప్పెను : అర్జునా ! నీవు నేను అనేక జన్మముల నెత్తియున్నవారము. ఆ జన్మముల నన్నిఁటిని నేనెఱుగుదును, నీవెఱుఁగవు.

☞అనిత్యత్వమున రెండవ ఉత్తరము.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా. 6

తా. నేను పుట్టుకలేనివాఁడను, నాశము లేనివాఁడను, సమస్త ప్రాణి కోటికి అధికారిని, నా ప్రకృతిని వశపరచుకొని నా మాయచేతనే బుట్టు చున్నాను.

☞భగవన్మూర్తి యవతారకాల నిరూపణము.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాఽత్మానంసృజామ్యహమ్. 7

తా. అర్జునా ! ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు, అధర్మమునకు అభివృద్ధి కలుగునో, అప్పుడప్పుడు మాయచేతను బుట్టుచుందును.

☞భగవన్మూర్తి యవతారమునకుఁ బ్రయోజనము.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. 8

**తా. సజ్జనులను సంరక్షించుటకును, దుర్జనులను శిక్షించుటకును, ధర్మమును స్థిరముగా నిలుపుటకును నేను ప్రతియుగమునందు నవతరించు చున్నాను.**

☞భగవన్మూని జన్మకర్మలుఁ దెలిసిన ముక్తియగు.

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున. 9

**తా. అర్జునా ! ఎవఁడు దివ్యమైన యిట్టి నా జన్మమును కర్మను నిశ్చయముగ దెలిసికొనుచున్నాఁడో అతఁడీ శరీరమును విడిచిన పిదప మరల జన్మమును బొందఁడు. నాలో నైక్యమగును.**

☞భగవత్స్వరూపముఁ బొందు యధికారి లక్షణము.

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః. 10

**తా. రాగద్వేషాదులు వదలినవాడై ప్రపంచమంతయు నా మయ ముగాఁ జూచుచు నన్నాశ్రయించుటచే అనేకులు పవిత్రులై చక్కని జ్ఞానముఁ గలిగి నా భావమును అనగా బ్రహ్మత్వ (మోక్ష) మును బొందిరి.**

☞వారి వారి భావముల ననుసరించి ఫలమిచ్చువాఁడ.

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః. 11

**తా. ఎవరెవరు నన్నే యేరీతుల సేవింతురో వారివారి నా యారీతులనే ననుగ్రహింతును. మనుష్యులందరు సర్వ విధముల నామార్గమనే అనుసరింతురు.**

☞ఫలము గోఱువారు ఇంద్రాదుల యారాధింతురు.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా. 12



**తా. కర్మ ఫలసిద్ధిని గోరు మానవులు, ఈ లోకమున ఇంద్రాది (1) దేవతలను, ఆరాధింతురు. కర్మఫలసిద్ధి మనుష్యలోకమున జాగ్రత్తగ కలుగు చున్నయది.**

(1) దేవత=అనగ ఈశ్వరుని అంశరూపమగు శక్తియే

☞నాలుగు వర్ణముల యుత్పత్తి క్రమము.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

**తా. సత్వ, రజ, తమోగుణముల భేదముల ననుసరించి (ఆయా గుణములచేబుట్టు) కర్మల ననుసరించి, బ్రాహ్మణాది నాలుగు వర్ణములు సృజింపఁబడెను. వాని కర్త నేనైను మాయకు వశుఁడుగాక పోవుటచే నాకు కర్తృత్వములేదు.**

☞కర్మలంటని నన్ను దెలియువాఁడు ముక్తుఁడు.

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే. 14

**తా. నన్ను కర్మలంటవు. నాకు కర్మఫలాసక్తి లేదు. ఇట్టి నన్ను ఎవఁడు తెలిసికొనునో, అతఁడు కర్మబంధముల నుండి ముక్తుఁడగును.**

☞పూర్వులు జేసిన కర్మ ననుసరించుము.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

**తా. కర్తృత్వాభిమానమును, ఫలాసక్తియును తమకు దనియెఱిగియూ పూర్వకాలమున మోక్షాసక్తులగువారు కర్మములుఁ జేసియుండిరి. గాన పూర్వులు అంతకు పూర్వులగువారును చేసినరీతి నీవు కర్మమునేచేయుము.**

☞కర్మతత్త్వము తెలియుట దుర్లభము.

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16

**తా. కర్మమేది యకర్మమేది యను విషయమును(గూర్చి బుద్ధిమంతులు సహిత మెఱుగ(జాలకున్నారు. నీవు మృత్యువుతో గూడిన సంసారము నుండి ముక్తు(డగుటకు, దేనిని( దెలిసికొనుట యావశ్యకమో అట్టి కర్మ రహస్యమును నీకు( దెల్పుచున్నాను.**

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః. **17**

**తా. (1) కర్మ తత్త్వమును (2) వికర్మ తత్త్వమును (3) అకర్మ తత్త్వమును దెలియ(దగినది. కర్మతత్త్వము( దెలిసికొనుట దుష్కరము.**

(1) కర్మ-యనగ = శాస్త్రవిహితకర్మ (2) వికర్మయనగ = శాస్త్రనిషిద్ధకర్మ (3) అకర్మ యనగ=కర్మలుచేయకుండుట.

☞ కర్మాకర్మముల నిర్ణయము.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః,
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. **18**

**తా. ఎవ(డు (4) కర్మయందు అకర్మయును, అకర్మ యందు కర్మయును చూచునో వా(డు మనుష్యులలో బుద్ధిమంతు(డు, యోగి, సర్వ కర్మలు చేసినవా(డు.**

(4) కర్మలుచేయునవి దేహము ఇంద్రియములు. కర్మ సంబంధము లేనిది ఆత్మ. ఇట్లుండ ఆత్మయే దేహము చేయు సమస్త కర్మలు చేయునట్లు లోకము భ్రమ జెందుచున్నయది అట్టి భ్రమ లేకపోవుటయే కర్మయందు అకర్మయు, నకర్మయందు,కర్మను జూచుట. యందు కర్మయును చూచునోవా(డు మనుష్యులలో బుద్ధిమంతు(డు, యోగి,సర్వకర్మలు చేసినవాడు.

☞ పండితు(డన నెవ్వ(డు ?

యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః. **19**

**తా. ఎవని కర్మలు కామ సంకల్పములు కలవి కాదో ఎవని కర్మలు జ్ఞానమనునిప్పుచే( గాల్ప(బడినవో, అట్టి వానిని పండితు(డని బ్రహ్మవేత్తలు( జెప్పుదురు.**

☞ జ్ఞాని కర్మచేయుచుండిననూ( జేయనివా(డే.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. **20**



**తా. కర్మఫలాపేక్షను విడిచి, నిత్యతృప్తు(డై, విషయప్రవృత్తి లేనివా(డు కర్మ చేయచుండినను అట్టివా(డు కర్మచేసినవా(డు కా(జాలడు. వాని కర్మము(గూడ జ్ఞానాగ్నిచే దహింప(బడి అకర్మమేయగును.**

☞ శరీరపోషణకు మాత్రము కర్మచేయుము.

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. **21**

**తా. కోరికలు విడిచి చిత్త స్వాధీనత గలిగి యెల్ల విషయములందు అభిమానము వదలి శరీరపోషణ మాత్రమునకుపయుక్తమైన కర్మచేయు వానిని పాపము తాకదు.**

☞ శరీరయాత్రకు చేసిన కర్మచే బంధము లేదు.

యదృచ్ఛాలాభ సన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః,
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. **22**



**తా. అప్రయత్నముగా నేది దొఱకునో దానితో సంతసించి సుఖదుఃఖములను లక్ష్యపెట్టక శత్రుత్వ బుద్ధిలేక సమానబుద్ధికలిగి ఎవ్వడుండునో అత(డు కర్మచేసినను బంధింప(బడడు.**

☞ భగవత్ప్రీతికై చేయు కర్మ నశించు.

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. **23**

**తా. ఆసక్తి లేనివా(డగుచు, ముక్తు(డై, జ్ఞానమందు నిశ్చయబుద్ధి గలిగి, భగవత్ప్రీత్యర్థము చేయువాని కర్మనిశ్శేషముగ నశించును.**

☞ కర్మ యజ్ఞము బ్రహ్మయే.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్,
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా. **24**

**తా. యజ్ఞము, పరికరములు, కర్త, భోక్త అంతయు బ్రహ్మమయమని చూచువా(డు బ్రహ్మమును బొంది బ్రహ్మయగును.**

☞ జ్ఞాన యజ్ఞము బ్రహ్మయే.

దైవ మేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. **25**

**తా. కొందఱు ఫలాపేక్షతో దేవతలను పూజించు చున్నారు. చిత్తశుద్ధి గల కొందఱు ఆత్మచేతనే ఆత్మయందు హోమముచేసి జ్ఞానులగుచున్నారు.**

☞ జ్ఞానేన్ద్రియ నిగ్రహ యజ్ఞము.

శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే (1) సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి. **26**

(1) సంయమము=ధారణ,ధ్యానము, సమాధి ఈ మూఁడుకలిసి సంయమమగును.

**తా. కొందఱు జ్ఞానేన్ద్రియములను, నిగ్రహమను నగ్నిలో వ్రేల్చు చున్నారు. కొందఱు శబ్దము మొదలగు విషయములను, ఇంద్రియములను అగ్నిలో వ్రేల్చుచున్నారు.**

☞ ప్రాణేంద్రియ వ్యాపార నిరోధక యజ్ఞము.

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. **27**

**తా. మరికొందరు సమస్త ఇంద్రియములు, వాని విషయములను, ప్రాణవాయువులయొక్క పనులను, ఆత్మజ్ఞానముచే ప్రకాశించిన స్వ స్వరూ పాను సంధానమను అగ్నియందు వ్రేల్చుచున్నారు.**

☞ ద్రవ్యాది - ఆరు యజ్ఞములు.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే,
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః. **28**

**తా. కొందఱికి (1) ద్రవ్యదానమే యజ్ఞము, కొందఱికి తపస్సు యజ్ఞము, కొందఱికి యోగము యజ్ఞము, మఱికొందఱికి వేదపఠన (శాస్త్ర) జ్ఞాన సంపాదనములే యజ్ఞములు. ఇతరులకు ప్రయత్నపూర్వకములగు కఠిన నియమములే యజ్ఞము.**

(1) ద్రవ్య యజ్ఞము=మంచికార్యములయందు ద్రవ్యవినియోగము. పాత్రాపాత్రముల యుచితత్వము కనిపెట్టి ఖర్చుపెట్టుట.

☞ ప్రాణాయామమూ యజ్ఞమే.



అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. **29**

**తా. కొందఱు అపానవాయువునందు ప్రాణవాయువును వ్రేల్తురు. (అనగ బాహ్య వాయువును లోపలికి పీల్చుట) ఇయ్యది పూరకము, ప్రాణ వాయువునందు అపానవాయువును వ్రేల్తురు. (అనగ లోపలి వాయువును ఇవ్వలకు వచ్చునట్లు చేయుట) ఇయ్యది రేచకము. ప్రాణవాయువును, అపాన వాయువును లోపలనే నిలుపుదురు. (ఇదే కుంభకము.) దీనికంత కును ప్రాణాయామ యజ్ఞమని పేరు.**

☞ ఆహార నియమమూ యజ్ఞమే.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః **30**

**తా. మఱికొందరు ఆహార నియమముచే ప్రాణవాయువులను ప్రాణ వాయువులందే వ్రేల్చుచున్నారు. ఈయజ్ఞవేత్తలందరును పైనచెప్పబడిన యజ్ఞముతెలిసి చేసినవారేగాన సర్వపాపములుఁబోగొట్టుకొనుచున్నారు.**

☞ యజ్ఞము చేయని వానికిహపరము లేదు.

యజ్ఞ శిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. **31**

**తా. అర్జునా ! యజ్ఞములుఁజేసి యందు మిగిలిన యమృతమును భుజించినవారు శాశ్వత బ్రహ్మమును పొందుచున్నారు. యజ్ఞము చేయని వానికిహపరములు లేవు.**

☞ కర్మచేఁ బుట్టిన యజ్ఞములు శాశ్వత సుఖమివ్వదు.

ఏవం బహువిధా యజ్ఞా వితతా(1) బ్రహ్మణో ముఖే,
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. **32**

(1) బ్రహ్మణోముఖే = వేదముయొక్క ముఖమందు.

**తా. ఇటువంటి యజ్ఞములనేక విధముగా వేదములనుండి వ్యాపించి నవి. ఈ యజ్ఞములంతయు కర్మములచేఁ బుట్టినవి శాశ్వత సుఖమివ్వదని తెలిసినచో బంధవిముక్తియగు.**



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

☞అన్ని యజ్ఞములకన్న జ్ఞానయజ్ఞము గొప్ప.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా జ్జా ్ఞనయజ్ఞః పరన్తప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. **33**

**తా. అన్ని యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము గొప్పది. మనో,వాక్కు కాయిక, కర్మలు, ఆ కర్మఫలితములు జ్ఞానమునందే లయించుచున్నవి.**

☞అనుభవజ్ఞానము గలవారు సందేహముల తీర్తురు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. **34**

**తా. పెద్దల సేవచేయుచు, మాటిమాటికి సందేహముల నడిగి తెలిసి కొనుచు, అనుభవజ్ఞానుల యొద్ద జ్ఞానమును పొందుము. అనుభవజ్ఞానులే నీ సందేహములఁదీర్తురు.**

☞తత్వజ్ఞాన ఫలము

యజ్జా ్ఞత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ,
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథోమయి. **35**

**తా. అర్జునా ! ఆ జ్ఞానము పొందితివేని మఱల మోహము నొందవు. సమస్త భూతములను నీయందే చూడగలవు. పిమ్మట నాయందును చూడ గలవు.**

☞పాపములను సముద్రమును, జ్ఞాన నావచే దాటుము.

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. **36**

**తా. నీవు పాపాత్ములందరిలో మిక్కిలి పాపాత్ముఁడైననూ, ఆ పాపము లను సముద్రమును, జ్ఞానమను యోడచేదాటగలవు.**

☞జ్ఞానాగ్ని సమస్తకర్మలను కాల్చును.

యథైధాంసి సమిద్ధోஉగ్ని ర్భస్మసాత్కురుతేஉర్జున,
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. **37**



**తా. మండుచుండెడు అగ్ని ఏ ప్రకారముగ కట్టెలను భస్మముఁ జేయునో అట్లు జ్ఞానమను అగ్ని సర్వ కర్మలను నాశముఁజేయును. (అనగ పుణ్యపాప కర్మల రెండింటిని యని తెలియవలె.)**

☞జ్ఞానము యొక్క యోగ్యత.

న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి. **38**

**తా. జ్ఞానము పవిత్రమైనది, శుద్ధమైనది, ఉత్కృష్టమైనది. దానితో సమానమిం కొకటి లేదు. అట్టి జ్ఞానమును బహుకాల శ్రద్ధతోఁ బొందఁ గలఁడు.**

☞జ్ఞానమందు శ్రద్ధ గలవాఁడు ముక్తినిఁ బొందును.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి. **39**



**తా. జ్ఞానమందాసక్తి, శ్రద్ధ,సేవ, గురువాక్యములయందు విశ్వాస మును, ఇంద్రియనిగ్రహముఁగల వానికి శీఘ్రములోనే జ్ఞానమగును. జ్ఞానము అనుభవనమునకు వచ్చినతోడనే ముక్తి గలుగును. అపుడే శాంతి చేకూరును.**

☞సంశయాత్మున కిహపరములు లేవు.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోஉస్తి న పరో న సుఖం సంశయాత్మనః**40**

**తా. ఎవఁడు జ్ఞానహీనుఁడై శ్రద్ధలేక సంశయాత్ముఁడై యుండునో అతఁడు నశించును. సందేహము బొందువాని కిహపరములులేవు; సుఖ మునులేదు.**

☞లోకమునకుగాఁ జేయు కర్మ జ్ఞానినంటదు.

యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్,
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ. **41**

**తా. బ్రహ్మజ్ఞాని కర్మలు చేయుచున్నను, అతనికాసంబంధములేదు. వాఁడు చేయు కర్మలు ప్రపంచోద్ధారమునకేగాని, తనకుఁగాదు. అంతయు**

భగవన్తుని మయమని తెలిసిన వానికి సంశయములులేవు. కర్మములు బంధకములుగావు.

☞జ్ఞానమును కత్తిచే సంశయమును నఱుకుము.

తస్మాదజ్ఞాన సమ్భూతం హృత్థ్సం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. 42

తా. అర్జునా ! కావున అజ్ఞానమువలనఁ బుట్టిన నీ హృదయమందలి సంశయమును, జ్ఞానమును కత్తిచే నఱికి, కర్మములును జేయుము. యుద్ధ మునకు సిద్ధముగమ్ము,లెమ్ము.

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు
బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
జ్ఞానయోగోనామ చతుర్థోఽ ధ్యాయః

ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణా
ర్జున సంవాదమును నగు భగవద్గీతయందు జ్ఞానయోగమను
నాలుగవ అధ్యాయము ముగిసెను.



# కర్మ సన్యాస యోగము

## 5. పంచమోఽ ధ్యాయః

(దీనికి కర్మసన్యాస యోగమనిపేరు. కర్మమునకు,సన్యాసమునకు గల భేదాభేదముల నిర్ణయించునది.)

☞కర్మ శ్రేష్ఠమా ? జ్ఞానము శ్రేష్ఠమా ?

అర్జున ఉవాచ :

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

తా. అర్జునుఁడిట్లనియె-కృష్ణా! ఒకసారి కర్మలను విడువుమందువు. ఒకసారిచేయుమందువు. రెండింటిలో ఏది శ్రేష్ఠమో ఒకటి నిశ్చయముగాఁ జెప్పుము.

☞జ్ఞానమార్గముకన్న నిష్కామకర్మ శ్రేయము.

శ్రీభగవానువాచ-

సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. 2

తా. భగవంతుఁడిట్లనియె - జ్ఞాన కర్మమార్గములు రెండునూ ముక్తి నిచ్చునవియే. ఐననూ జ్ఞానమార్గముకన్న నిష్కామకర్మయోగమే శ్రేష్ఠ మైనది.

☞రాగద్వేషములుఁ జయించినవాడు కర్మచేయుచున్నను సన్యాసియే.

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి,
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే. 3

**తా. ఒకటి ద్వేషింపక, ఒకటి కోరక రాగద్వేషముల జయించిన వాఁడు కర్మచేయుచున్నను సన్యాసియే, సంసార రూపమగు బంధము నుండి విడుదలయగును.**

☞సంన్యాసమునకూ, కర్మయోగమునకూ ఫలమొకటె.

సాంఖ్యయోగౌ పృథ(1)గ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః,
ఏకమప్యాస్థితః సమ్య గుభయోర్విన్దతే ఫలమ్. 4

(1) బాలాః=అనగ అజ్ఞానులని దెలియ దగినది.

**తా. సాంఖ్యము వేఱని, యోగమువేరని అజ్ఞానులు పల్కుదురు, జ్ఞానులు అట్లనరు పై రెండింటిలో నొకదానిని బాగుగా నాచరించినను రెండింటి ఫలము బొందుచున్నాఁరు.**

☞సాంఖ్యులకూ, యోగులకూ గమ్యస్థాన మొక్కటియే.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి.5

**తా. ఏ (ముక్తి) స్థానము జ్ఞానులచే బొందబడుచున్నదో, యది కర్మ యోగులచేతను బొందబడుచున్నది. ఎవఁడు సాంఖ్యమును,యోగమును రెండింటినిఁ దెలియునో అతఁడు సమస్తముఁ దెలియుచున్నాఁడు.**

☞ కర్మమాచరింపని సన్యాసముఁ గష్టతరము.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి. 6

**తా. అర్జునా ! కర్మయోగమాచరింపని సన్యాసము నిర్వహించుట చాల కష్టతరము. నిష్కామకర్మ యోగానంతరముఁ బొందుసన్యాసము వెంటనే ముక్తిబొందును.**

☞ తాను అన్నిటివలె, అన్ని తనవలె తలచి చేయు కర్మ అంటదు.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః,
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

**తా. కర్మయోగముఁ జేయువాఁడు చిత్తశుద్ధి గలిగి మనస్సు తనయందుంచుకొని, ఇంద్రియముల నిగ్రహించి భూతములన్నియు తానుగాను తాను సమస్త భూతములుగా దలచి, గర్మములను జేయుచున్నను బంధ మును బొందఁడు.**



☞ జ్ఞాని అజ్ఞానివలె పనులు చేయుచున్నను జేయనివాఁడే యగు.

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.8

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిషన్నిమిషన్నపి
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్. 9

**తా. జ్ఞాని అజ్ఞానివలె అన్నిపనులు చేయుచుండును. కాని తాను సాక్షి ననియు, ఇన్ద్రియములాయా పనులు చేయుచున్నవనియు తలచును. అజ్ఞానికి దేహాభిమానముఁగలదు. జ్ఞానికి అభిమానరహితము గావున బంధము దొలఁగును. పనులు చేయుచున్నను చేయనివాఁడే.**

☞అజ్ఞానికి నిష్కామ కర్మచే బంధరహితము.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మ పత్ర మివామ్భసా. 10

**తా. ఎవఁడు తాను చేయుకర్మముల భగవంతునికర్పించి ఫలాసక్తి విడిచి జేయుచున్నాఁడో అతనికి తామరాకునకు నీరంటని విధంబున పాప ములంటవు.**

☞కర్మయోగి చిత్తశుద్ధికి కర్మలు చేయును.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియైరపి,
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే.11

**తా. కర్మయోగులు చిత్తశుద్ధికొఱకు ఫలాపేక్ష విడిచి, శరీరము చేతను, మనస్సుఁచేతను, బుద్ధిచేతను, మమకార రహితులై, ఇంద్రియములచేత మాత్రము కర్మలు చేయుచున్నారు.**

☞నిష్కామ కర్మచే ముక్తి, సకామకర్మచే బంధము.

(1)యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

(1) యుక్తః=అనగ ఫలమునీశ్వరునికొఱకు, నాకు కాదనువాఁడు.

**తా. నిష్కామ కర్మయోగి ఫలాభిలాషను వదలి కర్మలను చేయుచు చిత్తశుద్ధిచే ఆత్మనిష్ఠకలిగి ముక్తినిఁబొందును. ఫలాభిలాషతో కర్మచేయు వాఁడు బంధమును బొందుచున్నాడు.**

☞జ్ఞాని కర్మచేయడు, చేయించడు.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్. 13

**తా.** ఇంద్రియస్వాధీనము గలవాఁడు చెవులు, కన్నులు మొదలగు తొమ్మిది ద్వారములుగల దేహమను పట్టణములో సమస్త కర్మలను మనస్సుచే విడిచినవాఁడగుచు, యేదియు చేయక చేయించక సుఖముగా నుండును.

☞సమస్తము చేయునది ప్రకృతియే, ఆత్మకాదు.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

**తా.** జగత్ప్రభువు కర్తృత్వమును నిర్మించుటలేదు, కర్మనునిర్మించుటలేదు; కర్మఫలముతోడి సంబంధమును గూర్చుటలేదు, ప్రకృతియే సమస్తమును జేయుచున్నది.

☞చేయువాఁడు, చేయించువాడు ఈశ్వరుఁడని అజ్ఞానులందురు.

నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః. 15

**తా.** ఆత్మ పుణ్యపాపము లిచ్చునదికాదు. తీసుకొనునదియును గాదు. అజ్ఞానులు ఇవన్నియు ఆత్మయందారోపింతురు.

☞అజ్ఞానముబోయిన వెంటనే ఆత్మప్రకాశించు.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః,
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి(1)తత్పరమ్. 16

(1) తత్పరమ్=అనగ పరమాత్మయని దెలియఁదగు.

**తా.** ఆత్మజ్ఞానముచేత ఎవరి యజ్ఞానము నశించునో, యట్టివారి యొక్క సూర్యసమానమగు జ్ఞానము, అజ్ఞానాంధకారముకంటె వేఱగు పరమాత్మను ప్రకాశింపఁజేయును.

☞తత్వజ్ఞానికి విదేహముక్తియగు.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః,
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17



**తా.** జ్ఞానముచేఁ బాపములను బోగొట్టుకొన్నవారు, పరమాత్మయందు బుద్ధిగలవారగుచు, అతనియందే నశించి, అతనిచే పరమగతిగనెంచియు జన్మరాహిత్యముఁబొందుదురు.

☞జ్ఞాని అన్నిటియందు బ్రహ్మమునే జూచు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ (1) పణ్డితాః సమదర్శినః 18

(1) వి-పండితులు-పండా=ఆత్మవిషయాబుద్ధి, అదిగలవారు, పండితులు-జ్ఞానులు.

**తా.** జ్ఞానులు, విద్యావినయసంపన్నులగు బ్రాహ్మణుని యందును, గోవుయందును, ఏనుగునందును, కుక్కయందును, చండాలునియందును, తన ఆత్మరూపమగు బ్రహ్మమునే జూతురు.

☞బ్రహ్మవలె సమభావన గల్గువారికీజన్మయందేముక్తి.

ఇ హైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. 19

**తా.** ఎవరిమనస్సు అన్నిటియందును సమభావము కలదగునో వారీ జన్మమునందే ముక్తినిఁ బొందుదురు. ఏలన, దోషయుక్తములుగఁ గన్పడు రూపములతో నిమిత్తములేని దోషరహితుడగు సర్వాంతర్యామి వారికెప్పడు గోచరించెనో అప్పడే వారు బ్రహ్మమందున్నవారు.

☞జీవన్ముక్తుఁడు ప్రియాప్రియములందు హర్షశోకములఁబొందడు.

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియమ్,
(1)స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః. 20

(1) ఈ శ్లోకమందలి లక్షణములుగలవాఁడు సర్వకర్మ సన్యాసి

**తా.** ఆత్మయందు నిశ్చయబుద్ధి గలిగి, మోహమునువిడిచిన బ్రహ్మవేత్త, బ్రహ్మమందుండువాఁడగుచు, యిష్టము గలిగినపుఁడు సంతసించడు; అనిష్టము కలిగినపుడు దుఃఖముఁ బొందడు.

☞నిర్విషయుఁడై బ్రహ్మమందుండు వానికి ముక్తి.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మనియత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

తా. ఆత్మకంటె ఇతరములగు బాహ్యవస్తువుల యందాసక్తిని విడిచినవాఁడు ఆత్మయందు సుఖమును బొందుచున్నాఁడు. అతఁడు బ్రహ్మానుసంధానముతోఁగూడినవాఁడగుచు, శాశ్వత సుఖమును బొందును.

☞మహా వైరాగ్య నిరూపణము.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే,
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః. **22**

తా. అర్జునా ! విషయేన్ద్రియసంయోగమువలనఁ బుట్టిన భోగములు ఆద్యంతములు కలవిగావున యవి దుఃఖకారణములే! అందుచే, జ్ఞాని వాని యందాశవదలును.

☞సూక్ష్మ వైరాగ్య నిరూపణము.

శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం న యుక్తః స సుఖీ నరః. **23**

తా. ఏ పురుషుఁడు ఈ దేహమును విడుచుటకు మునుపే కామక్రోధాదులచే బుట్టిన తొందరను జయించుటయందలి సమర్థుఁడగునో అతఁడే యోగి: అతఁడే సుఖవంతుఁడు.

☞నిర్వాణ పదముపొందు అధికారి లక్షణము.

యోఽన్తః సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. **24**

తా. ఏ పురుషుడు ఆత్మయందే సుఖముఁ గలవాఁడును ఆత్మయందే క్రీడించువాడును, ఆత్మయందే ప్రకాశము కలవాఁడగునో ఆ యోగి (1) బ్రహ్మభూతుఁడై మోక్షమునుబొందుచున్నాడు.

(1) బ్రహ్మభూతుఁడనగ=బ్రహ్మమైనవాఁడని తెలియఁదగును.

☞జ్ఞానసాధన నిరూపణము.

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితేరతాః. **25**

తా. తమవలె సర్వభూతములను జూచుకొను వారును, పాపములను నశింపఁ జేసికొనినవారును, సంశయములు త్రెంచి కొనినవారును అగు ఋషులు, ముక్తినిఁ బొందుదురు.



మనస్సు, ఇంద్రియ జయముఁ గలవానికి ముక్తి.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. **26**

తా. మనస్సులోబడినవారికి, ఆత్మజ్ఞానముఁగలవారికి, కామక్రోధములు జయించినవారికి బ్రహ్మపదవి సులభముగా నున్నది.

☞జ్ఞానమునకంతరంగ సాధన

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ. **27**

యతేన్ద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః. **28**

తా. బయటనుండి లోపలకుఁ బ్రవేశించు శబ్దాది విషయములను, బయటనే నిలిపి, తన చూపును రెండు కనుబొమల నడుమ నిలిపి, ప్రాణాపాన వాయువులను నాసికయందు వర్తింపఁజేసి, ఇంద్రియముల నిగ్రహించి, దేనియందూ ఇష్టములేనివాఁడగుచు మోక్షమే పరమగతిగ నెంచువాఁడు సదా ముక్తుఁడే యగును.

☞మోక్షమిచ్చు జ్ఞాన నిరూపణము.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి. **29**

తా. నేను అన్నిలోకములకు అధిపతిననియు, వారు వారిచ్చు ఫలముల స్వీకరించువాడననియు, అందరికి మంచిది చేయువాఁడననియు, నన్ను నెఱిగినవారు శాంతిని బొందుదురు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సుబ్రహ్మవిద్యాయామ్
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్యాసయోగో
నామ పంచమోఽధ్యాయః

ఇది యుపనిషత్తులును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతయందు కర్మ
సన్యాసయోగమను ఐదవ అధ్యాయము ముగిసెను.

# ఆత్మ సంయమయోగము

## 6. షష్ఠోఽ ధ్యాయః

(దీనికి ఆత్మసంయమయోగమని పేరు. ఇందు ఆత్మయనగ మనస్సు, సంయమ మనఁగ వశపఱచుకొనుట. ఆత్మసంయమనగ మనస్సును వశ పఱచుకొనుట యని దెలియవలె.)

☞జ్ఞాని కాగలవాఁడు చిత్తశుద్ధికై కర్మ చేయవలెను.

శ్రీ భగవనువాచ :

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః. 1

తా. శ్రీకృష్ణుఁడిట్లనియె : కర్మఫలాపేక్ష వదలి తనకు నియతమగు కార్యము నెవఁడు జేయుచుండునో అతఁడే సన్యాసి. అతఁడే యోగికాని కేవల కర్మలను మాత్రము వదలినవాఁడు సన్యాసియుగానేఱఁడు; యోగి యునుఁగాఁడు.

☞సన్యాసమునకూ, యోగమునకూ అభేదము.

యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ,
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 2

తా. అర్జునా ! దేనిని సన్యాసమని చెప్పదురో యద్దానిని నీవు యోగమని తెలియుము. ఎవఁడు మనస్సుయొక్క సంకల్పములఁ ద్యజింపలేదో వాఁడెన్నటికిని యోగి కాఁజాలఁడు.



☞ముముక్షువుయొక్క సాధన కారణములు.

ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మకారణముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే. 3

తా. ముక్తినిఁ బొందుటకు ముముక్షువునకు నిష్కామ కర్మయే సాధనము ముక్తినొందినవానికి శాంతియే కారణము.

☞యోగారూఢుని లక్షణములు.

యదా హి నేన్ద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే. 4

తా.ఎప్పడు, కర్మలయందును, విషయములయందును, ఆసక్తి లేనివాఁడైయుండునో, అపుడు యోగారూఢుడని చెప్పఁబడును.

☞తనకు మిత్రులెవ్వరు ? శత్రులెవ్వరనగ :

ఉద్ధరేదాత్మ నాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః. 5

తా. తనయభివృద్ధికి తానేకారణము. తానుద్ధరించుకొనుటలో అశ్రద్ధ చేయగూడదు. ఇంద్రియముల, నిగ్రహించిన తన మనస్సే తనకు బంధువు నిగ్రహింపని మనస్సే తనకు శత్రువగును.

☞హితాహితుని యాత్మ స్వరూపము.

బన్ధు రాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. 6

తా. ఎవఁడు తన మనస్సుచేత దేహేన్ద్రియాది సమూహమును జయించుచున్నాఁడో, అతనికిఁ దనమనస్సు ఉపకారియగును. యింద్రియ జయములేనివారికి మనస్సు శత్రువగును.

☞మనోజయమునకు ఫలము.

(1)జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

(1) ప్రసన్నమగు అంతఃకరణముగల సన్యాసి.

**తా. శీతోష్ణ సుఖదుఃఖములందు, మానాపమానముల యందు, సమ బుద్ధి గలిగి ఆత్మజయమును బొందిన పరమశాంతునకు పరమాత్మానుభవము గలుగును.**

☞యోగారూఢుని వర్ణన.

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. **8**

**తా. శాస్త్రజ్ఞానముచేతను, అనుభవజ్ఞానముచేతను తృప్తి బొందిన వాడు కూటస్థుఁడును ఇంద్రియ జయముగలవాఁడును, యుక్తుఁడన బడును, అట్టి యోగికి బంగారు, మన్ను, రాయియును సమానములు.**

☞సమబుద్ధి గలవాఁడు సర్వ శ్రేష్ఠుఁడు :

సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థద్వేష్యబన్ధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. **9**

**తా. (1) స్నేహితులు (2) మిత్రులు, శత్రులు, ఉదాసీనులు, మధ్యస్థులు, అప్రియులు, బంధువులు, సాధువులు, పాపాత్ములునగు వారియెల్లర యందు సమబుద్ధి గలవాఁడుఁ యోగులలోఁ నుత్తముఁడు.**

(1) స్నేహితులనగ=ఉపకారముఁబొందక ప్రత్యుపకారము చేయువారు.

(2) మిత్రులనగ=ఉపకారము బొందించుకొని ప్రత్యుపకారము చేయువారు.

ధ్యాన యోగము దాని అంతరంగ సాధనము.

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః. **10**

**తా. యోగి రహస్యప్రదేశమున ఒంటరిగ నుండి మనోదేహముల జయించి, ఆశలను విడిచి, దేనిని గైకొనక నిరంతరము ఆత్మయోగము నందు నిలుపవలెను.**

☞యోగముయొక్క బహిరంగ సాధన.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్. **11**



తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుఞ్జ్యా ద్యోగమాత్మ విశుద్ధయే. **12**

**తా. పవిత్ర స్థానమున ధర్భాసనము, మృగచర్మము, మఱియు వస్త్రము, నొకదానిపై నొకటి పఱచి మిక్కిలి యెత్తును మిక్కిలి పల్లముగా నట్టి యాసన మును జేసికొని దానిపైనేకాగ్ర మనస్సుతోఁ గూర్చుండి చిత్తమును, ఇంద్రియములను వశపఱచుకొని ఆత్మశుద్ధి నిమిత్తము యోగ సాధనము చేయవలెను.**

☞యోగాభ్యాస విధానము.

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. **13**
ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పర. **14**

**తా. తలను, మెడను,శరీరమును కదల్చక చూపును తన ముక్కుకొన యందు లయింపఁజేసి, దిక్కులు చూడక పరమశాంతిచేత నిర్భయముగల్గి బ్రహ్మనిష్ఠయందునిల్చి మనస్సును స్వాధీనపఱచుకొని నాయందుఁ చిత్తమునిలిపి నాయందసక్తి గలవాడగుచుయోగ యోగ సమాధియం దుండవలెను.**

☞సమాధి యొక్క ఫలము.

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. **15**

**తా. ఇట్లు నిశ్చయించిన మనస్సుగల యోగి తన మనస్సు సర్వదా స్వాధీనముఁ జేసికొని ఉత్తమమగు నాయొక్కస్థానముఁ బొందుచున్నాడు.**

☞ఆహారాది నియమము లేనివానికి సమాధి సిద్ధింపదు.

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. **16**

**తా. అర్జునా ! ఎక్కువ భుజించువానికి, బొత్తిగా భోజనము చేయని వానికి, అధికముగా నిద్రబోవువానికి, బొత్తిగా నిద్రింపనివానికి యోగము సంభవింపదు.**

☞ఆహారాది నియమముఁ గలవానికి సమాధి సిద్ధించు.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

**తా. మితాహారము, మితసంచారము, మితకర్మ, మితనిద్ర, మితముగ మేలుకొనుటగలవానికి మాత్రము సర్వదుఃఖహరమగు యీ యోగము సిద్ధించుచున్నది.**

☞నిష్కామ యోగి వర్ణన.

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

**తా. ఎప్పుడు మనస్సును స్వాధీనముఁ జేసికొని పరమాత్మాను సంధానము జేయుచున్నాఁడో అప్పుడు నిష్కాముడగు యోగియని చెప్పఁబడును.**

☞వృత్తి రహితమగువాని చిత్తమునకు దృష్టాంతము.

**తా. గాలి లేనిచోట నుంచిన దీపముఁ జలింపక ఏకాగ్రముగా నుండు విధవే మనోనిగ్రహము కావించి ఆత్మయోగము నభ్యసించినవానికి దృష్టాం తము.**

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమాస్మృతా,
యోగినోయతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః. 19

**తా. గాలి లేనిచోట నుంచిన దీపముఁ జలింపక ఏకాగ్రముగా నుండు విధమే మనోనిగ్రహము కావించి ఆత్మయోగము నభ్యసించిన వానికి దృష్టాంతము.**

☞యోగ శబ్దార్థము.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్రచైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 20

సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః. 21



**తా. యోగాభ్యాసమునందు నియమింపబడిన చిత్తమునకు శాంతి యెచ్చట గలుగునో, మనస్సుచే నాత్మయందాత్మ దర్శనముఁ బొంది మహదానంద మేస్థితియందు మాత్రమగునో, ఇంద్రియముల కందరానిదియై బుద్ధికి మాత్రము గోచరించునదియునైన యుత్తమసుఖమే స్థితియందను భవించుచున్నాఁడో, యట్టి యుత్తమస్థానమును బ్రాపించిన యోగి తత్త్వము నుండి చలింపఁడు.**

☞నిశ్చలస్థితి నిరూపణ.

(1)యంలబ్ధ్వా చాపరం లాభంమన్యతే నాధికంతతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. 22

(1) యం = అనగ ఏయాత్మలాభమును.

తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

**తా. దేనిని పొంది మఱల దానికంటె నుత్తమలాభము మఱియొకటి యున్నదని తంపడో, దేనియందుండి మహత్తరమగు దుఃఖముచే చలింపడో, దానిని, దుఃఖసంబంధముతోడి యెడబాటే స్వభావముగాగల యోగముగాఁ దెలియవలె. అట్టి యోగమును నిశ్చల మనస్సుతో జేయవలెను.**

☞యోగోపాయ నిరూపణము.

సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః. 24

శనైః శనైరుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్. 25

**తా. సంకల్పమువలన బుట్టు సమస్తకోరికలను పూర్తిగ విడిచిమనస్సుచే నింద్రియసమూహమును సర్వవిషయములనుండి నిగ్రహించి, ధైర్య ముతోఁ గూడిన బుద్ధితో మెల్ల మెల్లగా విషయవిరాగమును బొందవలె. మనస్సు నాత్మయందు లెస్సగ నిలిపి ఏమియు చింతింపక యుండవలెను.**

☞ నిర్వికల్ప సమాధిని చెప్పుట.

**యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్,**
**తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26**

**తా.** చంచలమై యస్థిరమగు మనస్సు ఏయే విషయములందు దిరుగు చున్నదో ఆయా విషయములలోనుండి దానిని త్రిప్పించి యాత్మ యందుండు నట్లు తనస్వాధీనము చేసికొనవలయును. యోగాభ్యాస బలమున యోగి యొక్క మనస్సు ఆత్మయందే శాంతిని బొందును.

☞ నిరతిశయ స్వరూప సుఖ వర్ణన.

**ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్,**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్. 27**

**తా.** యోగాభ్యాసమొనర్చిన కొలదిని మనస్సుయొక్క చంచల త్వము బోవుచుండును. రజోగుణమునశించును. బ్రహ్మభావనబొందును. అంతటను దోషములేని నిర్మలభావన గలుగును.గావున అట్టి యోగికి ఉత్తమ సుఖము గలుగుచున్నది.

**యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,**
**సుఖేన (1)బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే. 28**

(1) బ్రహ్మస్పర్శం = అనగ బ్రహ్మముకంటె భిన్నముకాని.

**తా.** నిరంతరము ఇట్లు యోగమునందుఁ దన యాత్మను నిల్పు స్థిరప్రయత్నముగల యోగికి దోషములు సంపూర్తిగ నశించును. గావున నాతఁడు అనాయాసముగ అత్యుత్తమ మగు బ్రహ్మానంద సుఖము నను భవించుచున్నాఁడు.

☞ త్వం పదలక్ష్యార్థోపదేశము.

**సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29**

**తా.** యోగ యుక్తుఁడు అంతటను సమానమగు ఆత్మదర్శనము గలవాఁడగుచు, తాను సర్వభూతములందును, సర్వ భూతములు తన యందు నున్నటులు అనుభవముచేఁ దెలిసి కొనుచున్నాఁడు.



☞ తత్పద లక్ష్యార్థోపదేశము.

**యో మాం పశ్యతి సర్వత్ర స్వం చ మయి పశ్యతి,**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. 30**

**తా.** ఎవఁడు సమస్త భూతములయందునన్నును, నాయందు సమస్త భూతములను జూచుచున్నాఁడో అతనికి నేను, నాకు నతఁడు, ప్రత్యక్షులుగా నుందుము.

☞ ఐక్యార్థోపదేశము.

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. 31**

**తా.** అన్ని భూతములయందు నేనున్నానను జ్ఞానముగలిగి, నన్ను భజించువాఁడు, సర్వప్రకారములుగాను నాయందే యుండును.

☞ పరమయోగి స్వరూపము.

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమోమతః. 32**

**తా.** అర్జునా ! ఎవఁడు సర్వభూత సుఖదుఃఖములను తన సుఖదుః ఖములుగాఁ దలఁచునో, ఎవ్వనికిని ప్రతికూలము చేయక అహింసా పరుడై యుండునో అట్టి జ్ఞాని నాకు సమ్మతుఁడైనవాఁడు జ్ఞానులలో నుత్తముఁడు.

☞ మనస్సతిచంచలము, యోగము స్థిరముగ నిల్వదని అర్జునుని ప్రశ్న.

అర్జున ఉవాచ :

**యోఽయం యోగస్త్వయాప్రోక్త స్సామ్యేన మధుసూదన**
**ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్స్థితిం స్థిరామ్. 33**

**తా.** అర్జునుఁడిట్లనెను - కృష్ణా ! నీవు సమదృష్టితోఁ గూడిన యే యోగమును జెప్పితివో, యద్దానిని నా మనస్సు చంచలమగుటచే స్థిరముగ నిలుపజాలను.

**చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 34**

**తా. కృష్ణా ! మనస్సు చంచలము, కలతపెట్టునదియు బలవంతము, స్వాధీనమునకు రానిదియు నగుటవలన దానిని వశీకరణము చేసికొనుట గాలిని మూటగట్టుటవలె కష్టసాధ్యమని నే తలచుచున్నాను.**

☞కృష్ణుఁడర్జునుని ప్రశ్నకొప్పుకొని మనోజయమునకుపాయము దెల్పుట.

శ్రీభగవానువాచ :

అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే. **35**

**తా. భగవంతుఁడిట్లనెను- గొప్ప భుజములుగల అర్జునా ! మనస్సును నిగ్రహించుటకష్టమే; అది చంచలమే, సందేహములేదు. అయినను వైరా గ్యము చేతను, అభ్యాసము చేతను నిగ్రహింపవచ్చును.**

☞ఎడ తెగని అభ్యాస వైరాగ్యములచే యోగము సిద్ధించు.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. **36**

**తా. అభ్యాసవైరాగ్యములచే నిగ్రహింపఁబడని మనస్సు గలవాఁడు యోగమును బొందజాలఁడు. మాటిమాటికి ఎడతెగక ప్రయత్నించు అభ్యాస వైరాగ్యములతోఁగూడిన మనో నిగ్రహమనునట్టి యుపాయము వలన యోగ మును పొందవచ్చును.**

☞యోగముఁ జెడినవాఁ డేగతిఁ బొందునని యర్జునుని ప్రశ్న.

అర్జున ఉవాచ -

అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. **37**

**తా. అర్జునుఁడిట్లనెను- కృష్ణా ! యోగమునందు శ్రద్ధమాత్రముకలిగి మనోనిగ్రహశక్తి జాలక చలించి మృతినొందినవానికేమి గతి గలుగును?**

కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. **38**



**తా. కృష్ణా ! పరమాత్మానుసంధానముఁ జేయలేని మూఢుఁడు కర్మ జ్ఞానమార్గముల రెండింటియందుభ్రష్టుఁడై చెదరిపోయిన మేఘమువలె చెడ కుండునా?**

ఏత న్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్య శేషతః,
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. **39**

**తా.కృష్ణా ! నాకుఁ గలిగిన ఈ సంశయమును నిశ్శేషముగా నివర్తింపఁ జేయుటకు నీవే తగినవాఁడవు. ఈ సంశయమును బోఁగొట్టుటకు నీవు దక్క మఱియొకఁడు దొరకఁడు.**

☞ఉత్తమునకు దుర్గతి లేదు.

శ్రీ భగవానువాచ :

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. **40**

**తా. భగవంతుఁడిట్లనెను - అర్జునా ! అట్టి యోగభ్రష్టునకు నిహ పరలోకములయందు నాశములేదు. నాయనా! మంచి చేసినవానికెన్నటికి దుర్గతి లేదుగదా?**

☞సకామ యోగభ్రష్టుఁడు శ్రీమంతుని గృహమున బుట్టు.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీః సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. **41**

**తా. యోగ సంసిద్ధిని బొందలేక ఎవ్వఁడు మరణించుచున్నాఁడో అతఁడు పుణ్యకర్మలు జేసినవారు పొందుస్వర్గాది లోకములను బొంది అందు బహుకాలము సుఖముగయుండి మల భూలోకమున పరిశుద్ధులగు శ్రీమంతుల ఇండ్లలోఁ బుట్టుచున్నాఁడు.**

☞నిష్కామ యోగభ్రష్టుఁడు జ్ఞానయోగుల కులమందు బుట్టు.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. **42**

**తా. లేదా ! బుద్ధిమంతులగు యోగుల వంశములో బుట్టును. యోగుల వంశమునందుఁ బుట్టుట సామాన్యముగాదు(చాలా దుర్లభము)**

☞ పూర్వజన్మ సంస్కారముచేత మఱియొక జన్మములో ప్రయత్నముచే జ్ఞానము గలుగు.

తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన. 43

**తా. అర్జునా ! అట్లు యోగికులమునందు బుట్టి పూర్వ దేహమున సంపాదించిన యోగబుద్ధి విశేషమునుబొందు చున్నాఁడు. ఆ పూర్వ సంస్కారమువలన నాతడనేకరెట్లు యోగసంసిద్ధికొఱకు ప్రయత్నము జేయు చున్నాడు.**

☞ పూర్వాభ్యాసమే తనచే యోగమును చేయించు.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

**తా. పూర్వజన్మమునందు చేసిన ఆ యోగాభ్యాసము చేతనే అతఁడు బలవంతముగా మఱల యోగాభ్యాసమునుచేయవలసినవాడగును. యోగాభ్యాసముచేయు సాధకుఁడు కూడ శబ్ద బ్రహ్మము నతివర్తించు చున్నాఁడు.**

☞ పూర్వజ్ఞాన సంస్కారములచే తుదకు ముక్తి.

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. 45

**తా. ప్రయత్నమువలన యోగమునందు కృషియొనర్చు చుండు యోగి యొక జన్మమున తరింపకపోయినను, గ్రమముగా అనేక జన్మములనెత్తి యొక జన్మముకంటె మఱియొక జన్మమున విశేషముగాఁ దన దోషముల నెల్ల హరింపఁజేసికొని తుదకు యోగసిద్ధినిఁబొంది ఉత్తమమగు ముక్తిని బొందును.**

☞ కృష్ణుఁడు అర్జునుని యోగివిగమ్మనుట.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. 46



**తా. అర్జునా ! యోగియైనవాఁడు, తపస్సుచేసినవారి కంటెను, శాస్త్రార్థ పాండిత్యముగలవారికంటెను, కర్మనిష్ఠుల కంటెను నధికుఁడు, అందువలన నీవు యోగివికమ్ము.**

☞ యోగులలో శ్రేష్ఠుఁడు.

యోగినామపి సర్వేషాం మద్గతేనా న్తరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

**తా. యోగులందరిలో నా యందంతః కరణముగలవాడగుచు, శ్రద్ధతో నన్నెవ్వఁడు సేవించుచున్నాఁడో అతఁడు యోగిశ్రేష్ఠుఁడని నా మతము.**

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ఆత్మ సంయమయోగో
నామ షష్ఠోధ్యాయః

**ఇది యుపనిషత్తులును,బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,**
**శ్రీకృష్ణార్జున సంవాదమునునగు భగవద్గీతలందు**
**ఆత్మసంయమయోగమును ఆరవఅధ్యాయము ముగిసెను.**

# విజ్ఞాన యోగము

## 7. సప్తమోఽధ్యాయః

**(దీనికి విజ్ఞానయోగమని పేరు. విజ్ఞానమనఁగా అనుభవజన్య జ్ఞానము.)**

☞(1) తత్పదార్థోపదేశము.

(1) తత్పదార్థ శబ్దముచే వాచ్యార్థమున మాయావిశిష్టచైతన్య మగు ఈశ్వరుని లక్ష్యార్థమున శుద్ధబ్రహ్మమును యుపదేశించును.

శ్రీ భగవానువాచ :

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

**తా. భగవంతుఁడిట్లనెను-అర్జునా ! నాయందే ఆసక్తి గలిగి నన్నే ఆశ్రయించినచో, సంపూర్ణముగా నన్నెట్లు తెలిసికొనగలవో ఆ జ్ఞానమును చెప్పెద వినుము.**

☞జ్ఞాన, విజ్ఞాన విషయము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్య శేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

**తా. నీకొరకు అనుభవజ్ఞానముతోఁ గూడిన శాస్త్రీయ జ్ఞానమును సవిస్తారముగనేను జెప్పెదను. ఈ జ్ఞానమును దెలిసికొంటివేని తెలిసికొన దగిన వేఱు విషయమేదియును లేకపోవుచున్నది.**



☞జ్ఞానము దుర్లభము.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. 3

**తా. వేలకొలది మనుష్యులలో నెవఁడో ఒక్కడుమాత్రము సిద్ధికొఱకు ప్రయత్నించుచున్నాఁడు. అట్లు ప్రయత్నముచేసిన సిద్ధులలో వేలలో నొకఁడు మాత్రమే నన్ను యథార్థముగ తెలిసికొనుచున్నాఁడు.**

☞అపర ప్రకృతి స్వరూపము.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా. 4

**తా. భూమి, నీరు, అగ్ని,గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని నామాయాశక్తి ఎనిమిది విధములుగా భేదమును బొంది యున్నది.**



☞పరా ప్రకృతి స్వరూపము.

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్. 5

**తా. అర్జునా ! పైఁ జెప్పిన ఎనిమిది విధములు గలది నా అపరా ప్రకృతి. దానికంటె ఇతరమైనది పరాప్రకృతియని యొకటి గలదు. అదియే సమస్త ప్రాణధారణ కారణము. సకల ప్రపంచమును ధరింపఁబడియున్నది యని తెలిసికొనుము.**

☞జగత్కారణ ప్రతిపాదనము.

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా. 6

**తా. సమస్త భూతములు ఈ పరాపరా ప్రకృతులవలననే పుట్టినవని తెలియును. నేను సమస్త జగత్తునకు నుత్పత్తికిని, నాశనమునకును కారణ భూతుఁడనని తెలియుము.**

☞సర్వము మాయచేఁ గప్పఁబడిన బ్రహ్మమే.

మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

తా. అర్జునా ! నాకంటె నితర కారణము మఱొకటి లేదు. ఈ సమస్త ప్రపంచము దారమునందు రత్నములవలె నాయందుఁ గూర్పఁబడి యున్నది.

**రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః,**
**ప్రణవః సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8**

తా. అర్జునా! ఉదకమందలి సారమును, సూర్యచంద్రులయందలి ప్రకాశమును, వేదములయందలి ఓంకారమును, ఆకాశమందలి శబ్దమును నరులందలి పురుషలక్షణమును నేనే అయియున్నాను.

**పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ,**
**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు. 9**

తా. భూమియందు గంధమును, అగ్నియందు తేజస్సును, సమస్త భూతములకు ప్రాణాధారములగు వృత్తులును, తపస్సు చేయువారి యందు తపస్సును, నేనే యని తెలిసికొనుము.

☞మాయోపాధికుఁడగు ఈశ్వరుఁడే సర్వ జగత్తునకు కారణుఁడు.

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్,**
**బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తే జస్వినా మహమ్. 10**

తా. అర్జునా ! సర్వభూతములును పురాణ పురుషుఁడగు నా యందుఁ బుట్టుచున్నవని తెలియుము. బుద్ధిమంతుల యందలి బుద్ధి యును (1) తేజస్సుల యందలి తేజస్సును నేనే అని తెలియుము.

(1) తేజః ప్రాగల్భ్యం - నేర్పు.

**బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్,**
**ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. 11**

తా. అర్జునా ! బలవంతులయందు కామరాగములులేని బలము, ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కామము నేనుగా తెలిసికొనుము.

☞కల్పిత వస్తువులచే భగవంతుఁడు వికారముఁబొందడు.



**యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే,**
**మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి. 12**

తా. సత్త్వగుణరూపములైన శమదమాదులు, రజోగుణరూపములైన గర్వసంతోషాదులు, తామసగుణరూపములైన వానికి నేను సంసారులవలె స్వాధీనుఁడఁగాను, అవి నాకు స్వాధీనము.

☞మాయచే మోహితులైనవారు నన్ను దెలియలేరు.

**త్రిభిర్గుణైర్మయైర్భావై రేభిస్సర్వమిదం జగత్,**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్. 13**

తా. సత్త్వరజస్తమోగుణముల మూడిటి వికారములగు నీ భావముల యొక్క మోహమునఁదగుల్కొనిన ఈ సమస్త ప్రపంచమును, ఈ భావముల కంటె వేరు లక్షణములుగల యన్యయుడనగు నన్నుఁ దెలిసికోఁ జాలదు.

☞బ్రహ్మారూపుఁడగు నన్ను తెలియువాఁడు ఈ మాయను దాటును.

**దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా,**
**మామేవ యే ప్రపద్యన్తే మా యా మేతాం తరన్తితే. 14**

తా. దైవసంబంధమగు నీ త్రిగుణాత్మకమగు నా మాయదాట శక్యముఁగానిది. నన్నేశరణుపొందువారు మాత్రమే ఈ మాయను సులభముగా దాటగలరు.

☞దుష్కర్ములగు మూఢులు నన్నుఁ దెలియరు.

**న మాం దుష్కృతినోమూఢాః ప్రపద్యన్తే నరాధమాః,**
**మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః15**

తా. పాపముఁజేయువారును, మూఁఢులగు మానవాధములు, మాయచేత నపహరింపబడిన జ్ఞానముఁ గలవారై రాక్షసధర్మములగు హింస, అనృతాదుల నాశ్రయించినవారు నన్నుబొందజాలరు.

☞భగవద్భక్తులలో నాలుగు విధములు.

**చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున,**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. 16**



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

తా. అర్జునా ! కష్టములోనున్నవాఁడు, కోరికలుగలవాఁడు, మోక్షాపేక్ష గలవాఁడు పూర్ణతత్త్వముఁగల జ్ఞానియు ఈ నాల్గు తెగలవారు నన్ను సేవించుచున్నారు.

☞భగవద్భక్తులలో జ్ఞాని యుత్తముఁడు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమప్రియః.

తా. ఈ నలుగురిలోఁ జలింపని భక్తిగల ఆత్మజ్ఞాని యందఱికన్న శ్రేష్ఠుఁడు అట్టివానికి నేను మిక్కిలి యిష్టుఁడను, వాఁడును, నాకుఁ బ్రియమైన వాడు.

☞నాకు జ్ఞాని అత్యంత ప్రియభక్తుఁడు.

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థితః సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్. 18

తా. ఈ భక్తులందరును గొప్పవారే. అయినను వారిలో జ్ఞాని నేనే యని నా యభిప్రాయము. ఏలనన జ్ఞాని యోగముచే నిశ్చలమైన మనస్సు గలిగి, నన్నేయుత్తమగతిగా నమ్ముచున్నాడు.

☞జ్ఞాని అత్యన్త దుర్లభుడు.

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
(1)వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. 19

(1) "సర్వం ఖల్విదం బ్రహ్మ=" యను శ్రుత్యర్థము ఈ శ్లోకమందలి "వాసుదేవస్సర్వం" అనుటచే వ్యక్తమగును.

తా. అనేక జన్మములెత్తి యెత్తి జ్ఞానము సంపాదించి, సర్వమును వాసుదేవుడే యని తెలిసి పరమేశ్వరుడగు నన్నుఁ జేరుచున్నాఁడు, అట్టి వాని కెవ్వరును సాటికారు. అట్టి మహాత్ముఁడు అఱుదైయుండును. (అనేక వేలలో నొక్కడని భావము)

☞అజ్ఞానులు పరమాత్మయైన నన్ను విడిచి ఇతర దేవతలు గొల్తురు.

కామైస్తై స్తైర్హృత జ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః,
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా. 20



తా. మనుష్యులు కోరికలవలన వివేకశూన్యులై ఆయా కోరికలనిచ్చు దేవతలను వారి వారి స్వభావములచేతనే వ్రతములు మొదలగు నియమముల నాశ్రయించి, శరణుపొందుచున్నారు.

ఇతర దేవతలనారాధించిననూ ఫలమిచ్చు వాఁడు నేనే.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. 21

తా. ఏమూర్తియందెవరికి (1) శ్రద్ధగలిగి యుండునో ఆ మూర్తి యందే అతనికి చలింపని శ్రద్ధ నేనే కలుగ చేయుచున్నాను.

(1) వివరణము=శ్రద్ధ హెచ్చినకొలది జ్ఞానము హెచ్చును. జ్ఞానము హెచ్చిన కొలది భక్తి హెచ్చును. భక్తి హెచ్చిన కొలది రాగ, ద్వేషములు నశించును. వెంటనే ముక్తిఁగలుగును.

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్. 22



తా. అట్టి దేవతా భక్తుఁడు నాచే నొసగబడినయట్టి శ్రద్ధతోఁ గూడిన వాడగుచు ఆ దేవతనే పూజింపగోరును. నేనా దేవతల మూలకముగ వానికిష్టములైన కోరికల నిచ్చుచున్నాను.

☞దేవతల గొల్చువారు దేవతలను, నన్ను గొల్చువారు నన్ను బొందుదురు.

అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్,
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి. 23

తా. అల్పబుద్ధిమంతులగు దేవతా ఉపాసకులు దేవతలనే చేరుచున్నారు. వారిఫలము నశించునదేకాని శాశ్వతమగు ముక్తిగాదు. నా భక్తులు నన్నేచేరుదురు. మోక్షమును బొందుదురు, అదియే నాశరహితమగు ఫలము.

☞మూఢులు నా స్వరూపమునుఁ దెలియలేరు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః
పరం భావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్. 24

తా. వ్యక్తముగాని నన్ను బుద్ధిహీనులు వ్యక్తునిగా ఎంచుచున్నారు. నా సర్వోత్కర్షమును ఎఱుఁగనివారు నాకు నాశము గలదని భావించు చున్నారు.

☞ఉత్తమ భక్తులకు అగుపడుదును.

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్. 25

**తా. నేనందఱకును ప్రకాశించువాఁడను కాను. నా యుత్తమ భక్తులకు మాత్రమే గోచరించువాడను. ఈ జగత్తు యోగమాయచేఁ గప్పబడిన నన్ను ఉత్పత్తి వినాశములులేని వాఁడనని తెలిసికొనజాల కున్నది.**

☞నన్నెవ్వరూ చూడరు, నేనందరినిఁజూతును.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. 26

**తా. మరణించిన జీవులను, పుట్టబోవు జీవులను, బ్రతికియున్న జీవులను నేనెఱుగుదును. నన్నొక్క జీవియూ తెలిసికొనుటలేదు.**

☞ద్వంద్వరూపమగు భ్రాన్తిచే నన్ను చూడరు.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప. 27

**తా. జీవులకు పుట్టుకతోడనే రాగద్వేషము లేర్పడుట చేత జ్ఞానముఁ గప్పబడి, అజ్ఞానమును బొందుచున్నారు. అందుచేతఁ గోర్కెలచే బంధింపఁ బడి నావంక చూడకున్నారు.**

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః. 28

**తా. పుణ్యకర్మలు చేయువారు తమపాపములు నశించిన తరువాత సుఖదుఃఖాది కారణమగు మోహమును విడనాడి నిశ్చల నియమము గల్గి నన్ను సేవింతురు.**

జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

**తా.ఎవరు జననమరణ రహితమైన మోక్షాపేక్షతో నన్ను ఆశ్రయించి అందులకుఁ దగిన యత్నములు చేయుచున్నారో అట్టివారు సమస్త జీవ కోటికి నంతర్గతముగా నుండు ఆ పరబ్రహ్మమును సమస్త కర్మలను తెలిసికొనవారగుదురు.**



సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్త చేతసః. 30

**తా. ఆదిభూత, అధిదైవ, అధియజ్ఞములతోఁగూడిన నన్నెవరెఱుగుదురో వారు మృత్యుకాలమందును నన్నుఁదెలిసికొందురు.**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విజ్ఞానయోగోనామ సప్తమోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు,యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు విజ్ఞానయోగమను నేడవ యధ్యా యము ముగిసెను.**

# అక్షరపరబ్రహ్మ యోగము

## 8. అష్టమోఽధ్యాయః



(ఈ యధ్యాయమునందీశ్వరతత్త్వము విశేషముగా బోధింపఁబడినది.)

అర్జున ఉవాచ :

☞ బ్రహ్మాది సప్తపదార్థముల తెలియజేయు ఏడుప్రశ్నలు.

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే. 1

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

తా. అర్జునుఁడిట్లనెను - కృష్ణా ! ఆ బ్రహ్మమేది? అధ్యాత్మమననేమి? కర్మమననేమి? అధిభూతమననేమి? అధిదైవమననేమి? ఈ దేహమం దధియజ్ఞుఁ డెవడు? అతఁడెట్టివాఁడు? ఆత్మనియమముఁ గలవారు ప్రాణప్రయాణ సమయమందెట్లు నిన్ను తెలిసికొందురు? ఈ విషయములను నాకుఁజెప్పుము.

☞ అర్జునుని ఏడుప్రశ్నలకుత్తరము.



శ్రీ భగవానువాచ :

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః. 3

అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర. 4

అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః 5

తా. భగవంతుఁడిట్లనెను - కర్తృత్వ భోక్తృత్వాది లక్షణములులేని నిర్గుణస్థితికి (1) బ్రహ్మమనియు, కర్తృత్వ భోక్తృత్వాది లక్షణములు గల సగుణస్థితికి (2) అధియజ్ఞుఁడనియు, మాయచేఁ గప్పబడియుండిన స్థితికి (3) అధ్యాత్మము లేక (జీవాత్మయనియు), యజ్ఞయాగాది క్రతువులచే పొందబడి దేవతలకన్న అగ్రస్థానము నొందినపుడు ఆ యధ్యాత్మమే(4) అధిదైవమనియు, నశించునదిగావున, దేహమునకు (5) అధిభూతమనియు, ఈ దేహముచే చేయబడు యజ్ఞయాగాదులే కారణముగాగల సృష్టి వ్యాపారమునకు (6) కర్మయనియు (7) ఎవఁడు మరణకాలమున నన్నే చింతింపుచు దేహమును వదలునో అతఁడు నన్నే బొందును. సంశయము లేదు.

☞ అంత్యకాలపు భావన యనుసరించి జన్మముఁ గల్గును.

యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్,
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః. 6

తా. అర్జునా! ఎవఁడు మరణకాలమందు ఏయే భావమును స్మరించుచు శరీరము విడుచునో వాడెల్లప్పుడును ఆ భావమునే తలంచినవాఁడై ఆయా భావమునే బొందును.

☞ నిరంతరము నన్ననుసరించుము.

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ,
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్యస్యసంశయః. 7

**తా. కావున, సర్వకాలములయందును నన్ను స్మరింపుము. యుద్ధమును గూడ జేయుము. నా యందు మనస్సు, బుద్ధిని యుంచినవాడవై తప్పక నన్ను పొందుదువు.**

☞ప్రాణములు విడుచువేళ మనస్సు బరమాత్మపై నుంచుము.

(1)అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్. 8

(1) వి-అభ్యాసయోగము=అనగా నాయందు దక్కనితరము మీఁదికి చిత్తమును బోనీయక యుండుట అభ్యాసము. అదియే యోగము.

**తా. కొంచెము కొంచెమలవాటు చేసికొనుచు, మనస్సు పరమాత్మపైఁ జేర్పవలయును. అట్లు సర్వకాలములందును పరమపురుషుని ధ్యానించిన యెడల ఆతనినే పొందుదువు.**

☞అంత్యకాలమున స్మరించు పరమాత్మ వర్ణన.

కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచిన్త్య రూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

**తా. ఎవఁడు సర్వజ్ఞుఁడై, పురాతనుఁడై, లోకశాసనకర్తయై, సూక్ష్మాతిసూక్ష్మస్వరూపుఁడై, అన్నిటికి ధాతయై, ఊహింపశక్యముఁగాని రూపముఁగలవాడై అజ్ఞానాన్ధకారము కంటె నితరమగు జ్ఞానస్వరూఁపుడైన పురుషుని స్మరించునో వానినేఁ బొందును.**

ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతిదివ్యమ్

**తా. ప్రాణప్రయాణ సమయమున నిశ్చలమనస్సుతో, భక్తితో, యోగబలములతో, రెండు కనుబొమ్మల నడుమ,ప్రాణము చక్కగా నిలిపి ఆ పరమాత్మను నెవఁడు ధ్యానించునో వాఁడతనినేఁ బొందును.**

☞అక్షర బ్రహ్మస్వరూపము.

యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11



**తా. వేదాంతులు దేనిని అక్షరమందురో, జితేన్ద్రియులగు యతులు దేనిని బొందుదురో, దేనిని తెలిసికొనుటకై బ్రహ్మచర్య నియమము పాటించు చున్నారో అట్టి పదమును నీకు సంక్షేపముగా దెల్పెదను.**

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్.

**తా. తొమ్మిది ద్వారములను చక్కగా నరికట్టి, మనస్సును హృదయమందు నిరోధించి, తన ప్రాణవాయువును శిరస్సునందుంచియోగము నాచ రించినవాడు పరమగతినిఁ బొందును.**

☞ఓంకారము నుచ్చరించుచు ప్రాణములు విడుచువాని గతి.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్. 13

**తా. పరబ్రహ్మ వాచకమగు "ఓం"అనెడి ఏకాక్షరమునుచ్చరించుచు, ఓంకారస్వరూపుఁడై నన్నుఁ జింతించుచు నెవఁడు దేహమును విడుచునో యట్టివాఁడు సర్వోత్తమమగు ముక్తిపదమును బొందు చున్నాఁడు.**

☞ఇతర చింతలు లేక పరమాత్మను దలంచు వానికి ముక్తి.

అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. 14

**తా. ఇతర చింతలులేక యెవఁడు నన్ను సర్వకాల సర్వావస్థల యందును తలంచునో అట్టి నిత్యయోగికి సులభముగా నేను చిక్కువాఁడను.**

☞నన్ను బొందినవారలకు పునర్జన్మము లేదు.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్,
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. 15

**తా. నన్నుఁబొందు మహాత్ములుత్తమగతినిఁ బొందుదురు. అట్టి వారలకు పునర్జన్మములేదు. పునర్జన్మమేగదా దుఃఖమునకు కారణము.**

☞లోకములన్నిటికంటె నాలోకమే ముక్తిపదము.

ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే. 16

తా. అర్జునా! బ్రహ్మలోకమువరకును యేలోకమునకుఁ బోయినను పునర్జన్మమునుఁ బొందుదురు. నన్ను బొందిన వారికి మరల పుట్టుకలేదు.

☞కాలపరిమాణము.

సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణోవిదుః
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్ర విదో జనాః 17

తా. ఎవరు వేయియుగముల లవధిగల బ్రహ్మముయొక్క పగటికి వేయి యుగములు అంతముగాఁగల రాత్రిని దెలియుదురో వారహోరాత్ర ములఁ దెలిసినవారు.

☞భూతముల యుత్పత్తి నాశవిషయము.

(1)అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే. 18

(1) అవ్యక్త= మనగ ప్రజాపతి.

తా. బ్రహ్మకుక పగలురాఁగానే అవ్యక్తమగు ప్రకృతి నుండి భూతము లన్నియు పుట్టుచుండును. రాత్రికాఁగానే ఆ ప్రకృతియందే లయ మొం దును.

☞అజ్ఞానముఁగల ప్రాణుల యుత్పత్తినాశ విషయము.

భూతగ్రామస్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే,
రాత్రాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే. 19

తా. అర్జునా ! ఈ భూతసమూహము బ్రహ్మకు పగలగునప్పడు పుట్టుచు, రాత్రియైనపుడు నాశనమొందునట్లే రాత్రియైన నాశనముఁ బొందు, పగలైన యుత్పత్తియగును.

☞బ్రహ్మకంటె మఱొక పరబ్రహ్మ కలఁడు.

పరస్తస్మాత్తు భావోఽన్యో ఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20

తా. సృష్టికర్తయగు బ్రహ్మకంటె ఇంకొక పరబ్రహ్మము కలదు. అయ్యది శాశ్వతమగునది. మార్పులేనిది, భూతముల శరీరములు మారు చున్ననూ, ప్రళయములో మునిఁగిననూ అది స్థిరముగ నుండునది.



☞పరమాత్మ స్థానవర్ణనము.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ. 21

తా. నా స్థానము శాశ్వతమయినది. అద్దానినిఁ బొందిన వానికి పుట్టుక లేదు; వ్యక్తముఁగానిదియని, అక్షరమని, పరమపదమని దెల్పు దురు. అదియే జ్ఞానము, ఆనందము.

☞పరమాత్మ స్థల నిరూపణము.

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా,
యస్యాన్తః స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్. 22

తా. ఎవనిలో భూతములన్నియు నున్నవో, ఎవనిచే ప్రపంచమం తయు నిండియున్నదో ఆ పరమపురుషుఁడగు నేను ఏకాంతభక్తిచే పట్టు బడుదును.



☞ముక్తియొక్కయు, జన్మముయొక్కయు నిరూపణము.

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాన్తితం కాలం వక్ష్యామి భరతర్షభ. 23

తా. ఏ సమయంబున మరణించిన ముక్తియో, ఏ సమయము నందు మరణించిన మరల పుట్టుదురో ఆ కాలము దెల్పెదను.

☞ ఉత్తరాయణము ముక్తి ప్రదము.

అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

తా. ఉత్తరాయణ పుణ్యకాలమందును, శుక్లపక్షమి యందును, పగటి వేళ ప్రాణములు విడుచు బ్రహ్మవేత్తలు బ్రహ్మమునే బొందుదురు.

☞దక్షిణాయనము జన్మమునకు హేతువు.

ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

తా. దక్షిణాయనము, కృష్ణపక్షమి, రాత్రివేళ మరణము బొందిన యోగి చంద్రలోకముఁ జేరి, అందు ఫలము ననుభవించి మరల జన్మమెత్తును.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

☞ శుక్ల, కృష్ణ మార్గముల నిరూపణము.

శుక్లకృష్ణే గతీహ్యేతే జగతః శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽ వర్తతే పునః. 26

**తా. శుక్ల, కృష్ణములనెడి జ్ఞానాజ్ఞాన ప్రకాశములైన రెండు మార్గములు శాశ్వతముగా నేర్పడియున్నవి. వానిలో జ్ఞానప్రకాశమగు శుక్ల మార్గము పునర్జన్మము లేనిది; అజ్ఞాన ప్రకాశమగు కృష్ణమార్గము మరల జన్మములు గలది.**

☞ గాన, నిష్కామకర్మ జేయుము.

నైతే సృతీ పార్థ జాన న్యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27

**తా. అర్జునా ! పైఁ జెప్పిన శుక్ల, కృష్ణ మార్గముల రెండిటినిఁ దెలిసిన యోగి మోహము నొందడు. నీ వికముందు నిష్కామముచేత సమస్త కర్మలు నాచరించుము.**



☞ ఇదంతయు తెలిసినయోగి, శుక్ల గతిలో మరణించును.

వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్

**తా. ఇదంతయు దెలిసికొన్న యోగి, వేదములు, యజ్ఞములు, తపస్సులు, దానములు మొదలగువానియందే ఫలము చెప్పఁబడియున్నదో, ఆ ఫలమునంతయు నతిక్రమించి శ్రేష్ఠమగు యుత్కృష్ట స్థానము బొందు చున్నాఁడు.**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు అక్షర
పరబ్రహ్మయోగ మను నెనిమిదవ యధ్యాయము ముగిసెను.**



# రాజవిద్యా రాజగుహ్య యోగము

## 9. నవమోఽధ్యాయః

**(భక్తిస్వరూపము నెఱుఁగుటకు కావలసిన విషయములన్నియు నిందు స్పష్టముగ వివరింపఁబడియున్నవి. ఈ తొమ్మిదవ యధ్యాయ మును సావధాన మనస్సుతోఁ జదువువారికి స్పష్టమగును.)**

☞ ఫలసహితమగు విజ్ఞానముతోఁగూడిన జ్ఞానోపదేశము.

శ్రీ భగవానువాచ :

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

**తా. భగవంతుఁడిట్లనెను దేనిని దెలిసిన సంసారము నుండి విడుదల యగుదువో, అట్టి ఈశ్వరోపాసనతోఁగూడి నదియు, మిక్కిలి రహస్య మగు జ్ఞానమును అసూయలేని నీకు చెప్పచున్నాను.**

☞ జ్ఞానముయొక్క మహాత్మ్యను స్తుతించుట.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్. 2

**తా. ఈజ్ఞానము విద్యలలో నుత్తమవిద్య, రహస్యములో నుత్తమ విద్య, రహస్యములో నుత్తమరహస్యము, పవిత్రమైనయది. ఉత్తమమైన**

యది, ప్రత్యక్ష ముగ బొందఁదగినది, ధర్మమైనది. ఆచరించుటకు సులభ మైనది. నాశము లేనిది, చేయుటకు సులభమైనయది.

☞మలినాంతఃకరణముఁ గలవారు సంసారమునందు దిరుగుదురు.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప,
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని. 3

తా. అర్జునా ! ఇట్టి ధర్మమును నమ్మనివారు నన్నుఁజేరక మృత్యువుతోఁ గూడిన సాంసారిక మార్గమునఁ దిరుగుదురు.

☞(1) ఈశ్వర స్వరూప నిరూపణ.

(1) సర్వభూతములయందీశ్వరుఁడున్నాఁడనియు, ప్రపంచ మంతయు భగవన్మయమని దెలియఁదగినది.

మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా,
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః। 4

తా. ఇంద్రియ గోచ రముఁ గాని స్వరూపముఁగల నాచేత నీ జగత్తంతయు వ్యాపింపఁబడినది. సమస్త భూతములు నాయందున్నవి. అన్నిటికి నేనాధారమైయున్నవాఁడను, అవి నాకాధారములుఁగావు.

☞పరమాత్మయొక్క అద్భుత ప్రభావ వర్ణనము.

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. 5

తా. నావిలాసమునుఁజూడుము. నేను భూతములయందులేను, భూతములను నేనే పుట్టించుచు, పోషించుచున్నను, నా స్వరూపము భూత ములయందుండునదికాదు.

☞ఆకాశమందు వాయువలె సర్వభూతములు నాయందున్నవి.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ. 6

తా. అంతట సంచరించు మహావాయువు సర్వదా ఎట్లు ఆకాశ మందుండునో, అట్లు సర్వభూతములు నాయందున్నవనిఁ దెలియుము.

☞భూతములుఁ బుట్టుటకు లీనమగుటకుఁ గారణము నేనే.



సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. 7

తా. అర్జునా ! కల్పాంతమందు భూతములన్నియు నా మాయలో లీనమగును. మరల వాటిని కల్పాదియందు నేనే పుట్టించుచుందును.

☞భూతములను నా మాయచే బుట్టించు చుందును.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. 8

తా. ప్రకృతివశమై యస్వతంత్రమగు ఈ నిఖిలభూతకోటిని నాయధీన మగు మాయనవలంబించి మాటిమాటికిఁ పుట్టించుచుందును.

☞పరమాత్మ కర్మ చేయుచుండినను బంధరహితుఁడు.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ,
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు. 9

తా. ఆ ప్రాణుల కర్మలయందు ఆసక్తి, అభిమానము, లాభాపేక్ష లేని కారణమున అట్టి కర్మలు నన్ను బంధింపవు.

మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే. 10

తా. అర్జునా ! నా యధ్యక్షతచేతనే చరాచరమగు సమస్త భూతములును ప్రకృతిఁ బుట్టుచున్నయది. అందుచేతనే ఈ ప్రపంచము మరలఁ బుట్టుచుండును.

☞దేహధారియగు నన్ను బరమాత్మయని మూఢులు దెలియరు.

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్,
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్. 11

తా. సర్వభూత నియామకమగు నా తత్త్వమునుఁ దెలియని వారగుచు, మూర్ఖులు మనుష్యశరీర మవలంబించి నన్నలక్ష్యముఁ జేయుచున్నారు.

☞నన్నుఁరాక్షసాసురప్రకృతి గలవారు దెలియరు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

**తా. అట్టివారు లోకేశ్వరుఁడగు నాయందుఁ బ్రమాణబుద్ధి లేనివారగుచు, మనుష్యప్రకృతికి, దైవప్రకృతికి గూడఁ వ్యతిరిక్తమగు (1) రాక్షస ప్రకృతిచేతను, (2) అసుర ప్రకృతిచేతను, మోహింపఁబడినవారలగుచు వ్యర్థమగు కోర్కెలతో వ్యర్థమగు కర్మలఁ జేయుచు, ఫలములేని జ్ఞానముఁ బొంది బుద్ధిలేనివారగుచు చెడిపోవుచున్నారు.**

(1) రాక్షసప్రకృతియనగ=దయా, సత్యశౌచములు లేకుండుట (2) అసురీ ప్రకృతి యనగ = అహంకారప్రధానమగునది.

☞దైవీగుణము గలవారు నన్ను భజింతురు.

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్. 13

**తా. అర్జునా! మహాత్ములు ప్రకృతిలోగల సత్వగుణమును ఆశ్రయించి భూతములకు మొదలు శాశ్వతుఁడనగు నన్నుఁదెలిసికొని విషయ చింతలు లేని మనస్సుతో సేవించుచున్నారు.**

☞శ్రవణ మననాది జ్ఞానసాధన నిరూపణము.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః,
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

**తా. చలింపని వ్రతముఁగలవారగుచు ఎల్లపుడు కీర్తించుచు, (నన్నుఁ దెలియుటకు) ప్రయత్నించుచు, (నాకు) నమస్కరించుచు, నాయందే చిత్తము నిల్పి యత్యంత భక్తితోనన్ను సేవించుచున్నారు.**

☞త్రివిధ భక్తుల లక్షణము.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్. 15

**తా. "ఉత్తమాధికారులైన" కొంతమంది జ్ఞాన యజ్ఞముచే నన్ను పూజింతురు. "మధ్యమాధికారులు" భేదరూపముచే పూజింతురు. "మందాధి కారులు" బహు ప్రకారములచే విరాడ్రూపుఁడగు నన్నే చింతింతురు.**



☞భగవంతుఁడు నేను సర్వతో ముఖుడని దెల్పుట.

అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్,
మన్త్రోఽహమహమేవాజ్య మహమగ్ని రహంహుతమ్. 16

**తా. క్రతువు నేను, యజ్ఞమునేను, పితరులకిచ్చు పిండమునేను, ఔషధమునేను, మన్త్రమూ నేనే. నేయి మొదలగు హోమద్రవ్యము నేను, అగ్ని నేను, హోమకర్మ నేను.**

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవచ. 17

**తా. ఈ జగత్తునకుఁ దల్లి, దండ్రి, తాత, (1) ధాతయు తెలిసికొన దగిన పవిత్రమైన ఓంకారస్వరూపమగు ప్రణవమును, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము ఈ మొదలగునవన్నియు నేనే.**

(1) ధాతయుఅనగ=కర్మఫలమును ప్రాణులకు విధించువాఁడు



గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్,
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్. 18

**తా. కర్మఫలము భరించువాఁడు, నియమించువాఁడు, శుభమును, అశుభమును జూచువాఁడు, భోగస్తానము రక్షించువాఁడు, హితముఁ జేయు వాఁడు, పుట్టించువాఁడు, నాశముఁజేయువాఁడు, ఆధారము, లయ స్థానము, నాశరహితమైన బీజమునేను.**

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ,
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున. 19

**తా. అర్జునా! నేను తపింపఁ జేయుచున్నాను. నేను వర్షమును కురియించుచున్నాను. "దేవతల" యమృతత్వము, "మానవుల" మృత్యువు, సత్తును, అసత్తునుగూడఁ నేనే.**

☞సకామ పురుషులు చేరు స్థలము.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్. 20

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

తా. మూఁడువేదములనధ్యయనముఁజేసినవారు, సోమ పానముఁ జేసినవారు, పాపములచే విడువబడి యజ్ఞములచేఁ నన్నుఁబూజించి స్వర్గము కొఱకు వేడుచున్నారు. వారు(మరణాంతరముఁదప్పక) దేవలోక మునుబొంది అందు సర్వోత్తములగు దేవభోగముల ననుభవించు చున్నారు.

☞భోగాసక్తులు జన్మమరణములఁ బొందుదురు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే. 21

తా. ఇట్లు స్వర్గసుఖముల ననుభవించి, మఱల బుట్టుచు,మఱల స్వర్గమునకుఁబోయి పుణ్యము నాశముఁగాగ భూలోకమునకు వచ్చు చున్నారు. ఇట్లు వేదములలోని కర్మకాండను ఆశ్రయించిన భోగాసక్తులు రాకపోకలనుఁ బొందుచున్నారు.

☞నన్ను దలంచిన వారి యోగక్షేమములను నేనే జూతును.

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

తా. ఇతర చింతలు లేక ఏ జనులు నన్ను చింతించుచు సేవించు చున్నారో అట్లు నిత్యమును నన్నేగతిగా తలంచిన యా జనులయొక్క యోగ క్షేమములను నేనే వహించుచున్నాను.

☞భక్తితో దేనిని పూజించిననూ నన్నే చెందును.

యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్. 23

తా. అర్జునా ! శ్రద్ధచేఁ గూఁడిన భక్తులు అన్యదేవతలను బూజించి ననూ నన్నే బూజించినవారగుదురు కాని, వారు చేసిన పూజ విధిపూర్వక ముఁగాదు. (ఎందుకనగా నేను సర్వాంతర్యామియనిఁ దెలియకజేయు పూజగావున.)

☞నా స్వరూపముఁ దెలియనివారు పునరావృత్తినిఁ బొందుదురు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే. 24



తా. ఆయా దేవతారూపముగా సర్వ యజ్ఞములను భుజించువాఁడు, ఫలమిచ్చువాఁడు నేనే. ఇట్టి నన్ను యథార్థముగఁ దెలియరు. గావున గాన పునరావృత్తినిఁ బొందుచున్నారు.

☞ఏయే దేవతల పూజింతురో ఆయా దేవతలను బొందుదురు.

యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపిమామ్. 25

తా. దేవతలనుఁ బూజించువారు దేవతులనుఁ బొందుదురు. పితరులనుఁ బూజించువారు పితృదేవతులనుఁ బొందుదురు. వినాయకాది భూత ములఁ బూజించువారు భూతములనే బొందు చున్నారు. నన్ను భజించువారు నన్నే బొందుదురు.

☞భక్తిచే సమర్పించునది యల్పమైననూ స్వీకరింతు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

తా. ఎవఁడు భక్తితోఁ బత్త్రముగాని, పుష్పముగాని, పండునుగాని, నీళ్లునుగాని నాకు సమర్పించుచున్నాఁడో అట్టి శుద్ధ మనస్సుతో భక్తి పూర్వకముగ నీయబడిన ఆ పదార్థమును నేను ఆరగించుచున్నాను.

☞నీవు చేయు సమస్త కర్మలు నాకర్పించుము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్. 27

తా. అర్జునా ! దేహయాత్రకు వలయునట్టి లౌకిక కర్మ ఏది చేయు చున్నావో, దేహధారణముకొఱకు ఏది తినుచున్నావో, ఏది హోమము చేయు చున్నావో, ఏది దానము జేయుచున్నావో, దానిని నాకర్పణ జేయుము.

☞సమస్తము నాకర్పించుటవలన బొందుదువు.

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. 28

**తా. ఇట్లు నాకర్పించుటవలన శుభాశుభ ఫలములుగల కర్మబంధము లచే విముక్తుఁడగుదువు. ఇట్లు విడువఁబడిన వాఁడగుచు నన్నుఁ బొంద గలవు.**

☞పరమేశ్వరుని సర్వ సమభావ నిరూపణము.

సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. 29

**తా. నేను సకల ప్రాణులయందును సమానుఁడను. నాకు శత్రువు గాని, మిత్రుఁడుగాని లేఁడు. ఎవ్వరు భక్తిచేత నన్ను సేవించెదరో అట్టివారు నాయందున్నవారగుదురు. నేను వారియందుందును.**

☞దురాచారుఁడైననూ నన్ను తలచువాఁడు శ్రేష్ఠుడే.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః. 30

**తా. ఎడతెగని భక్తితో నన్ను సేవించువాఁడు మిక్కిలి దురాచారుఁ డైననూ వానిని శ్రేష్ఠుఁడనియే తలపవలె. (ఏలనన) ఎప్పుఁడూ నితర దేవతాచింతలులేక నాయందే నిశ్చయబుద్ధి గల భక్తుఁడు సామాన్య ధర్మ ముల కతీతుఁడగు చున్నాఁడు.**

☞నా భక్తుఁడు నాశముఁ బొందడని ప్రతిజ్ఞ చేయుము.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

**తా. అర్జునా ! అట్టి దురాచారుఁడు శీఘ్రముగ ధర్మాత్ముఁడగును. శాశ్వతమగు శాంతినిఁ బొందును. నా భక్తుఁడెన్నటికిని నాశముఁ బొందు వాఁడు కాఁడని ప్రతిజ్ఞ చేయుము.**

☞నన్ను సేవించుటకు జాతి నియమము లేదు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాంగతిమ్.

**తా. అర్జునా ! అట్టి దురాచారుఁడు శీఘ్రముగ ధర్మాత్ముఁడగును. శాశ్వతమగు శాంతినిఁ బొందును. నా భక్తుఁడెన్నటికిని నాశముఁ బొందు వాఁడు కాఁడని ప్రతిజ్ఞచేయుము.**



**తా. (1) స్త్రీలుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని, ఎవరైనను, ఎట్టి వారైనను నిశ్చలబుద్ధితోఁ నన్ను సేవింతురేని గృతార్థులగుదురు. (కనుక నన్ను సేవించి ముక్తినిఁ బొందుటకు జాతి నియమ మక్కరలేదు.)**

(1) దీనివలన భక్తియోగమందఱకు బాధ్యతయనియు, భగవంతుఁడందఱివాడనియుఁ దెలియుచున్నది.

☞ నీవు నన్ను సేవింపుమని అర్జునునకు భగవంతుఁడు దెల్పుట.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్యమసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్. 33

**తా. పుణ్యాత్ములును, భక్తులును అగు బ్రాహ్మణులు, రాజఋషులు ఉత్తమ గతినిఁ బొందుదురని వేఱు జెప్పవలయునా? (గాన) అశాశ్వత మును సుఖహీనము నగు నీ భూలోకమున నుత్తమ క్షత్రియజన్మమెత్తిన నీవు సమయముఁ దాటిపోనీక (జన్మరాహిత్యమునకు) నన్ను భజింపుము.**

☞నాయందు మనస్సుంచిన నన్నేఁ బొందుదువు.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మా మేవైష్యసి యుక్త్వై వ మాత్మానం మత్పరాయణః. 34

**తా. నాయందే మనస్సు నిలుపుము. నాయందే భక్తిఁ గల్గియుండుము. నాకే నమస్కరింపుము. ఇట్లు నన్నే ఎంచితివేని నన్నేఁ బొందగలవు.**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యా రాజగుహ్య యోగోనామ
నవమోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణా ర్జున సంవాదమును నగు భగవద్గీతలందు విజ్ఞానయోగమను తొమ్మిదవ యధ్యాయము ముగిసెను.**

# విభూతి యోగము

## 10. దశమోఽధ్యాయః

(పూర్వాధ్యాయములందు భక్తియోగము దాని పరికరములు వక్కాణింపఁబడెను. ఇప్పుడాభక్తి పుట్టుట కొఱకు, పుట్టిన భక్తి వృద్ధి నొందుట కొరకు సాధనములు దెల్పును.)

శ్రీ భగవానువాచ :

☞అర్జునా ! నీకు హితవాక్యమును దెల్పెద.

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా 1

**తా. భగవంతుఁడిట్లనెను - అర్జునా! నీవు నా వాక్యములందత్యంత ప్రీతిగలిగి ఆలకించుచున్నవాఁడవు. గాన నుత్తమమగు హితవాక్యమునుఁ దెల్పఁదలచినాఁడ వినుము.**

☞సర్వజ్ఞులగు నింద్రాదులు సహితమూ నన్ను దెలియలేరు.

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. 2

**తా. నా ప్రభావమును దేవతా సమూహములు, మహర్షులు గూడ దెలియరు. దేవతలయొక్క మహర్షులయొక్క పుట్టుకకు సర్వప్రకారముల చేతను కారణమైయున్నవాఁడను.**



☞తత్వజ్ఞాని సర్వ పాపములచే విముక్తుడగు.

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

**తా. ఎవఁడు బుట్టుకలేనివానిగను, మొదలు లేనివానిగను, సమస్త లోకములను నియమించువానిగను దెలియునో నతఁడు మానవులలో మోహరహితుఁడగుచు పాపములచే విడవఁబడును.**

☞ నా యందు సర్వలోకేశ్వరత్వమున్నది.

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ. 4

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. 5

**తా. బుద్ధి, ఆత్మచింతన, వ్యాకులము లేకపోవుట, ఓర్పు, సత్యము, అంతరిన్ద్రియ, బాహ్యేన్ద్రియనిగ్రహము, సుఖము, దుఃఖము,పుట్టుట, నాశమగుట, భయము, భయము లేక యుండుట, అహింస, రాగద్వేష రాహిత్యము, సంతసము, తపస్సు, కీర్త్యపకీర్తులు, ప్రాణులకు నానావిధములగు భావములు నావలననే కలుగుచున్నయవి.**

☞ భృగ్వాదులు నాచేఁ బుట్టిరి, వారిచేఁ బ్రజలుఁ బుట్టిరి.

మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. 6

**తా. భృగువు మొదలగు సప్తమహర్షులు వారికంటె పూర్వులగు సన కాదులు, మనువులు వీరందఱు నా భావముఁగలవారగుచు నా సంకల్ప ముచేఁ బుట్టిరి. లోకమందలి ప్రజలందఱు వారిచేఁ నుద్భవించిరి.**

☞నా విభూతినిఁ దెలిసినవాఁడు యోగముఁ బొందు.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. 7

**తా. నాదగు నిట్టి విభూతి యోగమును యథార్థముగ నెవఁడు దెలియునో, నతఁడు నిశ్చలమగు యోగమునుఁ బొందుచున్నాఁడు. ఇందు సందేహము లేదు.**

☞నేనే అన్నిటికిఁ గారణమని దెలిసి వివేకులు నన్నుసేవింతురు.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః. 8

తా. నేను అన్నిటికిఁ గారణము, నా చేతనే సర్వముఁ బ్రవర్తించు చున్నదని తెలిసి వివేకులు ప్రీతిభావముచేఁ గూడినవారగుచు నన్ను సేవింతురు.

వ్యాఖ్య - ఈ శ్లోకముచేఁ దెలియఁదగిన ముఖ్యాంశమేమన- సర్వమునకు భగవంతుఁడే కారణము. ప్రపంచ వ్యాపారమంతయు భగవదధీనమై యున్నది. ఆయన ఆజ్ఞ లేక గడ్డిపోచయైనఁ గదలదు. ఆయన లేనిచోటు లేదు. ఆయన సంకల్పమమోఘమైనది. ఆయన సర్వశక్తి యుతుఁడు. సర్వమునకుఁగర్త. సర్వమునకాధారభూతుఁడు. జగదేక ప్రభువని.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్,
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ. 9

తా. నాయందే మనస్సుంచి నాయందే ప్రాణముంచి, నా చరిత్రలే చెప్పకొనుచు, తెలిసినవారు నాయందే ఆనందించి, నాయందే క్రీడ సల్పు చున్నారు.

☞నిష్కామ్యముగ నా సేవ చేయువారికి యాత్మజ్ఞానము గలుగు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే. 10

తా. కోరికలు లేక భక్తిచే నెల్లప్పుఁడు నా సేవచేయువారులకు, నేనేఁ దగిన పరికరములిచ్చి నాయొద్ద చేర్చుకొందును. నేనే ఆత్మజ్ఞానముఁ గలుగఁజేసెదను. (గావున జ్ఞానసహితమగు భక్తిమాత్రము) శ్రేయోదాయక మగును గాని కేవల మూఢభక్తి సంపూర్ణ ఫలమియ్యనోపదు.)

తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః,
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11



తా. నా ప్రేమనిమిత్తమే నన్ను సేవించుచున్నారు గాన నేను వారి బుద్ధియందుఁ బ్రవేశించి జ్ఞానదీపముచే అజ్ఞానమనుచీకటిని నశింపఁ జేతును.

☞అర్జునుఁడు కృష్ణుని స్తుతించుట.

అర్జున ఉవాచ :

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవమజం విభుమ్. 12
ఆహుస్త్వాం ఋషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. 13

తా. అర్జునుండిట్లనెను-భృగ్వాది ఋషులందరు, దేవర్షి యగునార దుఁడు, అసితుఁడు, దేవలుఁడు, వ్యాసుఁడు మొదలగువారు నిన్నే పరబ్రహ్మ మనియు, మిక్కిలి యాశ్రమనియు, నీవే పరమపవిత్రమగువాఁడ వనియు, ఆదిదేవుఁడవనియు, జన్మలేనివాఁడవనియు, సర్వవ్యాపకుఁడవని దెల్పు దురు. నీవును అట్లే నిన్నుఁగూర్చి నాకుఁ జెప్పుచున్నావు.

☞కృష్ణా ! నీ మహిమ నెవ్వరూఁ దెలియ జాలరు.

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ,
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః. 14

తా. కృష్ణా ! నీవు చెప్పినదంతయు నిజమని తలఁచుచున్నాను. నీ మహిమను దేవతలుఁగాని, రాక్షసులుఁగాని చక్కగ దెలియఁజాలరు.

☞నీ స్వరూపము నీకేఁ దెలుసును.

స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. 15

తా. నీవు ప్రాణులను వృద్ధిచేయువాఁడవు. ప్రాణులకు నియామకుఁ డవు. దేవదేవుఁడవు. లోకనాయకుఁడగునో పురుషోత్తమా! నీ స్వరూప మును నీవే ఎఱుఁగుదువుగాని మఱియొకఱు తెలిసికోఁజాలరు.

☞నీ విభూతిని నీవే దెల్పుము.

వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః,
యాభిర్విభూతిభిర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

తా. నీవు ఏయే (1) విభూతులచే నీలోకములను వ్యాపించి యున్నావో యట్టి నీ విభూతులు దివ్యములగుటవలన నితరులకుఁ దెలియ శక్యముఁగాదు. (గాన) నీవేఁ జెప్పుము.

☞యోగ, విభూతులను వినుటకు అర్జునుని ప్రశ్న.

కథం విద్యామహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్,
కేషు కేషు చ భావేషు చిన్త్యో௨సి భగవన్మయా. 17

తా. యోగీ! నేను నిన్నెట్లు ధ్యానముఁజేసినఁ దెలిసి కొందును? భగవంతుఁడా! ఏయే వస్తువులయందు నిన్ను నేను ధ్యానింపవలె?

(1) విభూతి = యనగ భగవచ్ఛక్తి.

☞నీ విభూతిని చక్కగ వివరించుము.

విస్త రేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మే௨మృతమ్. 18

తా. జనార్దనా ! నీ యోగమునుగూర్చి విభూతులను గుఱించి నింకను వివరముగఁ దెలుపుము. అమృతతుల్యమగు నీ పలుకు వినుచున్న నాకు తృప్తిలేదు సుమా !

శ్రీ భగవానువాచ :

☞నా విభూతులలో ప్రధానములు దెల్పెద.

హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్యమే. 19

తా. భగవతుఁడిట్లనెను-అర్జునా ! నా మాహాత్మ్యములు అనేకములుగా నున్నయవి. అయినను, వానిలో ముఖ్యములయిన గొన్నిటిని నీకుఁ గాను దెల్పెదను. ఆలకించుము.

☞కృష్ణుని సర్వాత్మభావన.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ. 20



తా. అర్జునా ! సకల భూతముల అంతఃకరణముల యందున్న పరమాత్మ నేను. సమస్త భూతముల యుత్పత్తి, స్థితి, నాశములకుఁ గారణము నేనే.

ఆదిత్యానామహం విష్ణు ర్జ్యోతిషాం రవిరంశుమాన్,
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ. 21

తా. ద్వాదశాదిత్యులలో విష్ణువు నేను, ప్రకాశించు వానిలో కిరణములుఁగల సూర్యుఁడు నేను. మరుత్తులను దేవతలలో మరీచి నేను. నక్షత్రములలో జంద్రుఁడు నేను.

వేదానాం సామవేదో௨స్మి దేవానామస్మివాసవః,
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా. 22

తా. వేదములలో సామవేదమగుచున్నాను. దేవతలలో నింద్రుడగుచున్నాను. ఇంద్రియములలో మనస్సగుచున్నాను. ప్రాణులలో బుద్ధివృత్తి యగుచున్నాను.



రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్. 23

తా. రుద్రులలోశంకరుఁడునేను. యక్ష రాక్షసులలోఁ గుబేరుఁడగు చున్నాను.వసువులలోనగ్నియగుచున్నాను. పర్వతములలోమేరువునేను.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనామహం స్కన్ద స్సరసామస్మి సాగరః. 24

తా. అర్జునా ! పురోహితులలో ముఖ్యుఁడైన దేవ పురోహితుఁడగు బృహస్పతియని నన్ను దెలియుము. సేనా నాయకులలో కుమారస్వామి నేను. సరస్సులలో సముద్రడగుచున్నాను.

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞో௨స్మి స్థావరాణాం హిమాలయః. 25

తా. ఋషులలో భృగుమహర్షి నేను. వాక్కులలో ఓంకారమగుచున్నాను. యజ్ఞములలో జపయజ్ఞమగుచున్నాను. కొండలలో హిమవత్పర్వతము నేనే.

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః. 26

తా. వృక్షములలో రావిచెట్టు, దేవర్షులలో నారదుఁడు గంధర్వులలో చిత్రరథుఁడు సిద్ధులలోఁ గపిలమునిని నేనే.

ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్,
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్. 27

తా. గుఱ్ఱములలో సముద్రమున బుట్టిన ఉచ్చైశ్రవను గుఱ్ఱమునూ, ఏనుగులలో ఐరావతము అను ఏనుగునూ, ప్రజలలో రాజునూ నన్నుఁగా దెలియుము.

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మికామధుక్,
ప్రజనశ్చాస్మికందర్పః సర్పాణామస్మివాసుకిః. 28

తా. ఆయుధములలో వజ్రమూ, ధేనువులలో కామధేనువగు చున్నాను. సంతతిఁగలుగఁజేయు మన్మథుడు నేను పాములో వాసుకి యగు చున్నాను.

అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్,
పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతా మహమ్. 29

తా. నాగులలో ననంతుఁడగుచున్నాను. జలదేవతలలో వరుణుఁడు నేను. పితృవులలో అర్యమయను పేరుగల పితృరాజు నేనగుచున్నాను. శిక్షించువారిలో యముఁడునేను.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్,
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్. 30

తా. రాక్షసులలో ప్రహ్లాదుఁడగుచున్నాను. గణిత శాస్త్రజ్ఞులలో కాలము నేను. మృగములలో సింహము నేను. పక్షులలో గర్మంతుఁడు నేను.

పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్,
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ. 31



తా. వేగముగలవానిలో వాయువగుచున్నాను. శస్త్రధారులలో రాముఁడు నేను. మత్స్యములలో మకరమగు చున్నాను. నదులలో గంగానది యగు చున్నాను.

సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్. 32

తా. సృష్టులయొక్క యుత్పత్తి, స్థితి, లయములు నేను, విద్యలలో నధ్యాత్మవిద్య, వాదించువారిలో వాదమునేను.

అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ,
అహ మేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. 33

తా. అక్షరములలో 'అ'కారము నేను. సమాసములలో ద్వంద్వసమాసము నేను. నాశములేని కాలము నేను. ఎల్లెడల ముఖములుగల ధాతను నేను.

మృత్యుస్సర్వ హరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. 34

తా. సర్వము నశింపఁజేయు మృత్యువు. ముందు కలుగఁ రాబోవు వానికి ఉద్భవము, స్త్రీలలో కీర్తి, లక్ష్మియు, సరస్వతియు, స్మృతియు, మేధయు, క్షమము, ధృతియు, యివన్నియూ నా స్వరూపములే.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్,
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః

తా. సామములలో బృహత్సామము నేను, ఛన్దస్సులలో గాయత్రి నేను. మాసములలో మార్గశీర్ష మాసమును, ఋతువులలో వసంత ఋతువు నేను.

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్.

తా. వంచకుల సంబంధమగు జూదము నేనగుచున్నాను. తేజశ్శాలు రలో తేజస్సు నేను, జయము నేను. ప్రయత్నము నేను. సాత్వికుల యందలి సత్వగుణము నేను.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః,
మునీనామప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః. 37

**తా. యాదవులలో వసుదేవనందనుఁడగుదును. పాండవులలో అర్జునుఁడనగుదును. మరియు మునులలో వ్యాసుఁడు నేను. కవులలో శుక్రా చార్యుఁడు నేను.**

దణ్డో దమయతామస్మి నీతిరస్మిజిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్. 38

**తా. దండనాధికారులలో దండనీతియగుచున్నాను. జయింపఁ గోరు వారిలో నీతియగుచున్నాను. రహస్యములలోమౌనమగుచున్నాను. తత్వజ్ఞా నుల జ్ఞానము నేను.**

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. 39

**తా. అర్జునా ! సర్వభూతములకు నేదిబీజమో అదినేను. చరాచర ప్రపంచంబున నేనుగాని పదార్థమేలేదు.**

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా. 40

**తా. అర్జునా ! దివ్యములగు నా విభూతులకు అంతము లేదు. (అయినను) ఈ విభూతియొక్క విస్తారము నాచేత సంక్షేపముగా దెల్పఁ బడెను.**

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సమ్భవమ్. 41

**తా. ఏయే(పదార్థమునందు) విశేషధర్మములగు ఐశ్వర్యము, శాంతము, ఉత్సాహము, కాంతియునుఁగలవో అవన్నియు నా తేజస్సు యొక్క అంశముచేఁ గలిగెనని దెలియుము.**

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42



**తా. అర్జునా ! ఇట్లు వేఱువేఱుగా దెలియుటచే నీకేమి లాభమున్నది? నాలో నొక్క యంశముచే నీ ప్రపంచ మంతయు వ్యాపించి యున్నాను.**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విభూతియోగో నామదశమోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు విభూతియోగమను పదియవ యధ్యాయము.**

# విశ్వరూప సందర్శన యోగము

## 11. ఏకాదశోఽధ్యాయః

(ఇయ్యది గీతాశాస్త్రమున సర్వోత్కృష్టమగు నధ్యాయము. ఇందుప దేశింపఁబడిన విషయమే గీతాసారము. ఈ గ్రంథమనకంతయు ఇది మూల స్థానమనందగు. ఎట్లన:- ప్రపంచమునగల జీవరాసులన్నియు నీశ్వరాంశములనియు, అయ్యవి నానావిధములుగ నానారూపములై, భిన్నములై కన్పట్టుచున్నను వాస్తవముగ నవియన్నియు నొకే పదార్థమనియు, పృథగ్భావము, బాహ్యదృష్టికి గోచరించునుగాని, యథార్థమునఁ బ్రపంచమంతయు నొకటియై యఖండమై సర్వము జగదీశ్వరుని యుదరమందణగి యున్నదనియు, అద్దానిని బ్రత్యక్షముగఁ జూచుట యెద్దిగలదో దానినే ఈ యధ్యాయమున వివరింపఁబడి యున్నది.)

అర్జున ఉవాచ :

☞ నీ హితవాక్యములచే నా యజ్ఞానము వదలెను.

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. 1

తా. అర్జునుఁడిట్లనెను : కృష్ణా ! నన్ననుగ్రహించుట కొరకు నీవు ఉపదేశించిన సర్వోత్తమమును, రహస్యమును, ఆత్మానాత్మ వస్తువివేక జ్ఞాపక మును నగు నుపదేశవాక్యము వలన నా యజ్ఞానము వదలెను.



☞ నీ సర్వ ప్రభావము వింటిని.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్. 2

☞ నీ నిజమగు స్వరూపముఁ జూపుము.

తా. కృష్ణా ! నీచే భూతసముదాయముల యుత్పత్తి నాశములు విస్తారముగ విన్నదేకాక అక్షయమగు నీ ప్రభావమునుఁగూడ వింటిని.

ఏవమేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. 3

తా. పరమేశ్వర! నీవు చెప్పినది యథార్థమే. నీ యాత్మ స్వరూపమెట్టి దని నీవు తెలియఁజేసితివో యట్టి ప్రభావముఁగల నీ స్వరూపమునుఁ జూచుటకొఱకు కోరుచున్నాను.

మన్యసే యదితచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. 4



తా. యోగమునకధిపతియగు ప్రభువా ! ఆ రూపమునుఁ జూచు టకు నాకు సాధ్యమగునని నీవుఁ దలంతువేని నాకు నీ శాశ్వతమగు స్వరూపమునుఁ జూపుము.

☞ కృష్ణుఁడు దన విశ్వరూపమును జూపుట.

శ్రీ భగవానువాచ :

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. 5

తా. భగవంతుఁడిట్లనెను : అర్జునా ! అనేకవిధములై, దివ్యములై, పెక్కురంగులు రూపములుఁగలిగి, వందలకొలది వేలకొలది గానిపించు నా రూపములనుఁ జూడుము.

☞ సంక్షిప్త విశ్వరూప వివరము.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుతస్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. 6

తా. అర్జునా ! (12) సూర్యులను, (8) వసువులను, (11) రుద్రులను, (2) అశ్వినీ దేవతలను, (49) వాయువులను, అట్లనే ఎన్నఁడుఁ జూఁడబడని అనేకములగు అద్భుతములనుఁ జూఁడుము.

☞సమస్త జగత్తును నాయందేకరాశిగ జూడుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. 7

తా. అర్జునా ! ఇప్పుడు చరాచరములగు సమస్త భూతజాలముతోఁ గూడిన సమస్త జగత్తును, ఇచ్చట నా శరీరమందేకరాశిగఁ జూడుము. ఇంకను నీవుఁ జూడదలచిన ఇతరములూ జూడుము.

☞అర్జునునకు దివ్యదృష్టి యిచ్చుట.

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్. 8

తా. అర్జునా; నీ చర్మచక్షుస్సుచేత నా విశ్వరూపము నీవు చూడఁజాలవు.గాన నీకు దివ్యదృష్టి నిచ్చెద. నా ఈశ్వర సంబంధమగు యోగశక్తినిఁ జూడుము.

☞సంజయుడు ధృతరాష్ట్రునకు విశ్వరూప వృత్తాంతముఁ దెల్పుట.

సంజయ ఉవాచ :

ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్. 9

తా. సంజయుఁడిట్లనెను - ఓ ధృతరాష్ట్రరాజా ! గొప్ప యోగములకు ప్రభువగు శ్రీకృష్ణుఁడిట్లు పలికి, యర్జునునకీశ్వర సంబంధమగు విశ్వరూపమును జూపెను.

☞విశ్వరూప విశేష వర్ణన.

అనేక వక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. 10



తా. పెక్కు మొగములు కన్నులు గలిగినట్టియు, పెక్కు వింతలు గనుపరచునదియు, అనేక దివ్యములగు నలంకారములు గలదియు, ఎత్తబడిన అనేకాయుధములు గల్గినట్టియు,

దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్. 11

తా. దివ్యములగు పుష్పములు, వస్త్రములు ధరించి, దివ్యమైన గంధపూతలుగలిగి, అన్ని ఆశ్చర్యములతో గూడియు, అంతములేనట్టియు, అంతట ముఖములుగల శ్రీకృష్ణభగవానులను (చూచెను)

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సా స్యా ద్భాసస్తస్య మహాత్మనః. 12

తా. ఆ దివ్యరూపముయొక్క కాంతి ఏకకాలమున వేయి సూర్యులాకాశమందుఁ బ్రకాశించిన నెంతకాంతిగ నుండునో దానికి సమానమైనయది.



తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా. 13

తా. నానా రూపములుగా విభజింపఁబడిన జగత్తంతయు అర్జునుఁడు భగవానుల దేహమునందొకచోటనే గాంచెను.

☞అర్జునుఁడు విశ్వరూపునిఁగాంచి ప్రార్థించుట

తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత. 14

తా. తరువాత ఆ యర్జునుఁడాశ్చర్యముతోఁ గూడిన వాఁడగుచు, బులకించిన శరీరముఁ గలవాఁడగుచు, విశ్వరూపము ధరించిన దేవునకు శిరస్సుచే నమస్కరించి, చేతులు జోడించి ఇట్లనియె-

అర్జున ఉవాచ :

పశ్యామి దేవాంస్తవ దేవదేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణమీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్

తా. అర్జునుండిట్లనెను - దేవా ! నీ దివ్యశరీరమునందు సమస్త దేవతలను, ప్రాణికోట్లను, కమలాసనుఁడైయున్న ప్రభువగు బ్రహ్మను, సమస్త ఋషులను, దివ్యములగు సర్పములను చూచుచున్నాను.

అనేక బాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్
నాన్తం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప.

తా. ప్రపంచనియామకా ! విశ్వరూపా ! అనేకబాహువులు, ఉదరములు, ముఖములు, కన్నులుగలిగి, అంతటను వ్యాపించియున్న నీయనంతమగు రూపముఁ జూచుచున్నాను. నీ రూపమున కాదిమధ్యాంతములు నాకుఁ గనుపించుటలేదు.

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్.

తా. కిరీటమును గదాచక్రములను, దాల్చిన నీ విశ్వరూపముఁ గాంతిచే నిండినదై యగ్నిసూర్యులకు సాటిగ నంతటను రగులుచున్నది. ఇట్టి వాఁడని నిశ్చయించుటకు వీలుకానివానిగను జూచుచున్నాను.

☞విశ్వరూపుని సగుణ-నిర్గుణ స్వరూపము.

త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతోమే. 18

తా. నీవు పరమోత్కృష్టమయిన పరబ్రహ్మమనియు, ఎల్ల జగములకు నుత్కృష్టమయిన యాశ్రయమనియు, నశింపనివాఁడవనియు, నేను భావించు చున్నాను.

అనాది మధ్యాన్త మనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్,
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్.

తా. ఆదిమధ్యాంతములు లేనివాఁడవును, అపరిమితబలశాలివియు, లెక్కలేని బాహువులు గలవాఁడవును, సూర్యచంద్రులే గన్నులుగా గలిగి, అగ్నివలె ప్రజ్వలించుచున్న ముఖముఁగలవాఁడవును, నీ తేజస్సు చేతనే ఈ ప్రపంచమంతయుఁ దపించుచున్నవానిగ చూచుచున్నాను.

☞విశ్వరూపుని సర్వాత్మభావన.



ద్యావాపృథివ్యోరిదమన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చసర్వాః
దృష్ట్వాద్భుతంరూపముగ్రంతవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.

తా. మహాత్మా! ఈ భూమ్యంతరిక్షముల మధ్యభాగమంతయు దిక్కులంతయు నీ చేతనే నిండియున్నవిగదా ! ఆశ్చర్యముగ అతి భయంకరముగ నుండు నీ రూపముఁచూచి, (స్వర్గ,మర్త్య,పాతాళ) లోకములు మూఁడును వణకుచున్నవి.

☞విశ్వరూపమునందర్జునుఁడు గాంచిన విశేషములు.

అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః

తా. ఈ దేవతలందఱు భయపడినవారగుచు గుంపులుగా నిన్ను శరణుజొచ్చుచున్నారు. అందును మఱికొందరు దూరముగనుండియే చేతులుఁ జోడించుకొని జయజయ ధ్వనులతో "రక్షించుము, రక్షించుము" అని ప్రార్థన సల్పుచున్నారు. మహర్షి సమూహములు, సిద్ధ సమూహములు, జగత్కల్యాణమగుగాక! అని పలికి నిన్ను సంపూర్ణముగ స్తోత్రములు జేయు చున్నారు.

రుద్రాదిత్యావసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా వీక్షన్తేత్వాం విస్మితాశ్చైవ సర్వే. 22

తా. ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్ట వసువులు, సాధ్యులు, విశ్వేదేవులు, అశ్వినీదేవతలు, మరుద్గణములు, పితృదేవతలు, గన్ధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు వీరందఱు ఆశ్చర్యముతో నిన్నే చూచుచున్నారు.

☞విశ్వరూప దర్శనముచే భయముఁజెంది స్తుతించుట.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరు పాదమ్,
బహూదరం బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్.

తా. కృష్ణా ! అనేకములగు ముఖములు, కన్నులు, బాహువులు, తొడలు, పాదములు, ఉదరములు గలిగి భయంకరమైన కోఱలుగల నీ గొప్ప రూపమునుఁ జూచి ప్రాణికోటి భయపడెను. అట్లే నేను (భయపడు చున్నాను.)

☞విశ్వరూపకాంతి వర్ణనము.

నభః స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో.

**తా. విష్ణుమూర్తీ ! అంతరిక్ష వ్యాపివి, తేజోయుక్తుఁడవు, అనేక వర్ణములుఁ గలవాఁడవు, తెఱవఁబడిన ముఖములుగల వాఁడవును, ప్రకాశించుచున్న విశాలమగు కన్నులు గలిగినట్టి నీ రూపమునుఁజూచి మిక్కిలి భయపడుచున్నాను. ధైర్యమును శాంతినిఁ బొందజాలకున్నాను.**

☞విశ్వరూపధారియగు భగవన్తుని స్తుతి.

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస. **25**

**తా. భయంకరములగు కోఱలుఁగలిగి, ప్రళయాగ్నివలె ప్రజ్వరిల్లుచున్న నీ ముఖములను జూచుటచే నాకు దిగ్భ్రమ కలుగుచున్నది. జగన్నివాసుండవగు నో కృష్ణా ! ప్రసన్నుండవు గమ్ము.**

☞స్వజయ పరాజయ వివరము.

అమీచ త్వాం ధృతరాష్ట్రస్యపుత్రాః సర్వే సహైవావనిపాలసఙ్ఘైః,
భీష్మోద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః

వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాలాని భయానకాని,
కేచిద్విలగ్నాదశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః. **27**

**తా. ఈ ధృతరాష్ట్ర కుమారులగు దుర్యోధనాదులు, భూపాలక రాజ సమూహములు, భీష్మద్రోణులు, కర్ణుఁడు, నా సేనానాయకులు గుమిగూడి యతివేగము గలవారలై కోఱలుగలిగి భయంకరములగు నీ ముఖములందుఁ బ్రవేశించుచున్నారు. వారిలోఁ గొందఱు నీ పండ్లసందుల యందుఁ జిక్కి శిరస్సులు పొడిగాఁ జేయఁబడినవారై కనఁపడుచున్నారు.**

☞సమస్తము భగవన్తునియందు జేరును.

యథా నదీనాం బహవోఽమ్బువేగా స్సముద్ర మేవాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా విశన్తివక్త్రాణ్యభివిజ్వలన్తి. **28**



**తా. అనేకములైన నదీతీర్థములెట్లు వేగముగా సముద్రమునందు బ్రవేశించునో అట్లే ఈ శూరులు మండుచున్న నీ ముఖమునందుఁ ప్రవేశించుచున్నారు.**

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశన్తిలోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. **29**

**తా. మిడుతలు మొదలగు ఱెక్కల పురుగులెఱుగక ఎట్లు మండుచున్న యగ్నియందు తమనాశనము కొఱకు అధికవేగముగలవై బ్రవేశించుచున్నవో అట్లే ప్రాణికోటి మహావేగముతో మరణము కొరకు నీ ముఖములలోఁ బ్రవేశించుచున్నారు.**

☞విశ్వరూపుఁడగు భగవన్తుని బ్రవృత్తి.

లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తివిష్ణో. **30**

**తా. మండుచున్న నీ ముఖములచే నెల్ల ప్రాణులను మ్రింగుచున్న వాఁడవై యన్ని దిక్కులయందు నీ నాలుకతోఁ బ్రాణుల నీడ్చుకొనుచున్నావు. కృష్ణా ! నీ భయంకరమగు కాంతులెల్ల జగత్తులునిండి వానినిఁ దపింపఁ జేయుచున్నవి.**

☞విశ్వరూపుని విశేషస్వరూపముఁ దెలియుటకు యర్జునుని ప్రశ్న.

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద,

విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.

**తా. దేవశ్రేష్ఠా ! నీకు నమస్కారములు చేసెదను. నాకు ప్రసన్నుఁడవగుము. నీవే నిమిత్తముగా నిట్టి భయంకరమగు యాకారము ధరించితివో నాకు తెలియలేదు. నీవు ఎవరో నాకు దెల్పుము.**

☞అర్జునుని ప్రశ్నకుత్తరము.

శ్రీ భగవానువాచ :

కాలోఽస్మిలోకక్షయ కృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషుయోధాః

తా. భగవంతుఁడిట్లనెను-(నేను) లోకనాశముఁ జేయుకొఱకు వ్యాపించియున్న మృత్యుస్వరూపుఁడను. లోకనాశనముఁ జేయుటకొఱకై యిచట ప్రవర్తించుచున్నవాఁడను. నీ శత్రుసేనలందున్న వీరందఱిని నీవు చంపకున్నను నెవఱును బ్రదుకజాలరు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

తా. కావున, నీవు యుద్ధమునకు లెమ్ము, కీర్తిని బొందుము. శత్రువులను జయించి సమృద్ధమగు రాజ్యము ననుభవింపుము. వీరిదివఱకే నాచే చంపఁబడిరి. నీవు (1) కారణమాత్రముగా నుండుము.

(1) ఇట్లే వారు వారు చేయు కార్యములయందన్నియు భగవంతుఁడే జరుపుచున్నాఁడనియు, తాము నిమిత్తమాత్రులమనియు దలచుట భక్తిమార్గమున నడచువారికి సుఖసాధనము. యుద్ధముఁ జేయుము. యుద్ధములో శత్రువులనునీవు జయింపఁగలవు.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్.

తా. నాచేత చంపబడిన భీష్మ, ద్రోణ, కర్ణ, జయద్రథులను, ఇతర యోధవీరులను చంపుము. భయపడకుము. యుద్ధముఁ జేయుము. యుద్ధములో శత్రువులను నీవు జయింపఁగలవు.

సంజయ ఉవాచ :

☞సంయుఁడు ధృతరాష్ట్రునకు ముందు సంగతిని దెల్పుట.

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏవాహకృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య

తా. ఇట్లు చెప్పిన కృష్ణభగవానుని మాటవిని కంపమొందుచు, నర్జునుఁడు చేతులు జోడించుకొని మాటిమాటికి భయపడుచు గద్గదస్వరముతో మరల నమ్రుఁడై ఇట్లనియె.

అర్జున ఉవాచ :

☞భగవంతుని మహిమాతిశయ వర్ణన.

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః. 36



తా. అర్జునుఁడిట్లనెను - కృష్ణా ! నీ గొప్ప కీర్తిచేత లోకము సంతసించుటయు, నీయందధిక శ్రద్ధాభక్తులుఁ జూపుటయు, రాక్షసులు భయపడి దిక్కులకు పరుగులెత్తుటయు, సమస్త సిద్ధసమూహములు నీకు నమస్కరించుటయుఁ గూడ నీ మహిమకుఁ దగియే యున్నయది.

కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనన్త దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్.37

తా. మహాత్మా! అనంతా ! దేవేశా ! జగన్నివాసా ! బ్రహ్మకంటె గొప్పవాఁడవై, యాదికర్తవైయుండు నీకెందులకు నమస్కరించరు? సద సత్తులకంటెను నేది మూలకారణమగు బ్రహ్మముఁగలదో అయ్యది. నీవే కదా !

☞జగత్తునకుపాదాన నిమిత్తకారణములు నీవే.

త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరంనిధానమ్
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామత్వయా తతం విశ్వ మనన్తరూపమ్

తా. నీవు ఆదిదేవుఁడవు, పురాణ పురుషుఁడవు, ఈ చరాచరమునకాధారభూతుఁడవు, తెలసినవాఁడవు, తెలియదగిన వాఁడవు, ఉత్కృష్టమైన మోక్షస్థానుఁడవు! నీ చేతనే యీ జగత్తంతయు వ్యాపింపఁబడియున్నది.

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చభూయోఽపి నమోనమస్తే.

తా. వాయువును, యముడు, అగ్నియు, వరుణుఁడు, చంద్రుఁడును, బ్రహ్మయు, పితామహుఁడగు బ్రహ్మకుఁ దండ్రియును నీవే! నీకు వేయిమార్లు వందనములు! పెక్కుమార్లు నమస్కారములు! మఱలను నమస్కారములు!

నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.40

తా. ఓ కృష్ణా ! నీకు, ముందు వెనుక నెల్లదిక్కుల నమస్కారములు, అమితమగు శక్తి పరాక్రమములు గలిగిన నీవు సర్వవ్యాపకుఁడవైయున్నావు, గాన సర్వస్వరూపుఁడవైతివి.

☞ అర్జునుఁడు దన యపరాధములను క్షమింపవేఁడుట.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేనవాపి. 41

యచ్చాపహాసార్థమసత్కృతోఽసి విహారశయ్యాసన భోజనేషు,
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయేత్వామహ మప్రమేయమ్.

**తా. అచ్యుతా! నీ మహిమ యిట్టిదని యెఱుగక అజ్ఞానముననో, ప్రేమచేతనో, స్నేహితుఁడవనిఁ దలచి, నిన్ను కృష్ణా, యాదవ, సఖా, యని గర్వముచేత పలికినదియు, నిన్ను పరిహసించుకొఱకు ఆటలయందు, శయనించువేళ, కూర్చుండువేళ, భుజియించువేళ, నీవు యెదుట లేనప్పుడును, ఎదుటనున్నప్పుడును, నేను చేసిన అపరాధములన్నియు క్షమింపవలయునని అప్రమేయుఁడవగు నిన్ను ప్రార్థించుచున్నాను.**

☞ కృష్ణా! నీకు సాటియెవ్వరూలేరు.

పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ

**తా. నిరుపమాన ప్రభావముగల కృష్ణా ! ఈ చరాచర, ప్రపంచమునకు నీవే తండ్రివి, పూజింపఁదగినవాఁడవు, గొప్ప గురుఁడవు. మూఁడు లోకములలో నీతో సమానుఁడే లేనప్పుడిఁక నధికుఁడెట్లుండును!**

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశమీడ్యం
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియఃప్రియాయార్హసి దేవసోఢుమ్. 44

**తా. అందువలన సాష్టాంగముగ నమస్కరించి లోకనియామకుఁడును స్తుతింపఁదగినవాడును, అగు నిన్ను ననుగ్రహింప వేడుచున్నాను. దేవా! బుత్రుని యపరాధమునుఁ దండ్రి, మిత్రుని యపరాధమును మిత్రుఁడు, ప్రియురాలి యపరాధమును బ్రియుడు సహించునట్లు నా యపరాధమును క్షమింపఁ దగినవాఁడవు.**

☞ కృష్ణా! నీ సౌమ్యరూపమును జూపుము.

అదృష్ట పూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస. 45



**తా. దేవా ! ఇదివరకు నెన్నఁడును జూడని నీ విశ్వరూపమును దర్శించి సంతోషించుచున్నాను. భయముచేత మిక్కిలి బాధ నొందితిని. కృష్ణరూపమునే నాకు జూపి యనుగ్రహింపుము.**

కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామిత్వాంద్రష్టుమహంతథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవవిశ్వమూర్తే. 46

**తా. సహస్రబాహో, విశ్వరూపా, నిన్ను కిరీటగదా చక్రములను ధరించిన రూపముతోఁ జూడ గోరుచున్నాను. ఈ విశ్వరూపముప సంహరించి చతుర్భుజములుగల యా రూపమునే ధరింపుము.**

శ్రీ భగవానువాచ :

☞ భగవంతునిచే చూపబడిన స్వరూప మాహాత్మ్యము.

మయా ప్రసన్నేన తవార్జునేదం రూపంపరందర్శితమాత్మయోగాత్
తేజోమయం విశ్వమనన్తమాద్యం యన్మేత్వదన్యేనదృష్టపూర్వమ్.

**తా. భగవంతుడిట్లనెను-అర్జునా ! నాకు నీయందుగల యనుగ్రహముచేత తేజోమయము, విశ్వాత్మకము, అనంతము, ఆద్యమగు నా శ్రేష్ఠ రూపమును నా యోగబలముచే నీకు చూపితిని. ఈ రూపమును నీవు దక్క దక్కినవారు చూచియుండలేదు.**

☞ నా యనుగ్రహము లేనివానికి విశ్వరూప దర్శనముఁ గాజాలదు.

న వేద యజ్ఞాధ్యయనైర్న దానైర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః
ఏవం రూపశ్శక్య అహంనృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర.

**తా. అర్జునా ! వేద యజ్ఞాధ్యయనములచేఁగాని, దానములచేఁగాని, కర్మములచేఁగాని, ఉగ్రతపస్సులచేగాని, భూలోకములోనిట్టి రూపము గల నన్ను నీవు తప్ప ఇతరులు జూడ సాధ్యముఁగాదు.**

☞ అర్జునుని కోరికమేఱకుఁ దన సహజరూపముధరించుట.

మాతే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య 49

**తా. ఇట్టి భయంకరమగు నా విశ్వరూపమునుఁజూచి భయపడకుము. నీవు నిర్భయముగను సంతోషచిత్తముతోను నీ యిష్టప్రకారము నా సహజరూపమును జూఁడుము.**

సంజయ ఉవాచ :

☞కృష్ణుండర్జునుని నోదార్చుట.

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకంరూపందర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా. 50

**తా. ఇట్లు వాసుదేవుఁడర్జునునితో చెప్పి, తన సహజ రూపమును జూపించెను. అట్లు శాంతస్వరూపమును ధరించిన మహాత్ముడు భయపడి యున్న యర్జునుని నోదార్చెను.**

అర్జున ఉవాచ :

☞అర్జునుఁడు కృష్ణుని సౌమ్యరూపముఁజూచి సంతసించుట.

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః. 51

**తా. అర్జునుండిట్లనెను - జనార్ధనా ! ఇప్పుడు సౌమ్యమగు నీ మానుష రూపమునుజూచి నాకు బుద్ధి స్థిరమైనది, నేను జనులలోఁ జేరినవాడ నైతిని.**

శ్రీ భగవానువాచ :

☞నా విశ్వరూపదర్శనము దేవతలుఁగోఱుదురు.

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః. 52

**తా. నీకు దర్శనంబిచ్చిన నా స్వరూపమెవరికి చూడదొఱకనిది. ఇట్టి విశ్వరూపము చూచుటకు దేవతలందఱూ సదా కోరెదరు.**

☞నా విశ్వరూపమును వేదాధ్యయనములచేఁ జూడజాలరు.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

**తా. నీకుఁ జూపిన విశ్వరూపమును వేదముఁ జదివిన వారలకుఁ గాని, తపస్సు చేసిన వారలకుఁగాని, యజ్ఞములు చేసినవారలకుఁగాని దొఱకదు.**

☞విశ్వరూప దర్శనమునకు సాధనము.



భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప. 54

**తా. అర్జునా ! ఇట్టి రూపముగల నన్ను జూచుటకుగాని, నిజముగాఁ దెలిసికొనుటకుఁగాని, నాయందుఁ బ్రవేశించుటకుఁగాని, నిశ్చలభక్తి తప్ప వేఱు సాధనములు లేవు.**

☞స్వరూపప్రాప్తికిఁ దెల్పు సాధన పంచకము.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ. 55

**తా. అర్జునా ! ఎవఁడు నా కొఱకు సత్కర్మములుఁజేసి, నేనే పరమ శరణ్యమని నమ్మి నాయందు భక్తిగలవాఁడై దేనియందును సంగము లేక యుండి, ఏ ప్రాణియందును వైరి బుద్ధిలేక ఎవఁడుండునో నతఁడే నన్నుఁ బొందును. గాని యన్యులుఁ బొందజాలరు.**



ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూప సందర్శనయోగోనామ
ఏకాదశోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణా ర్జున సంవాదమును నగు భగవద్గీతలందు విశ్వరూప సందర్శనయోగమను పదునొకండవ యధ్యాయము ముగిసెను.**

# భక్తియోగము

## 12. ద్వాదశోఽధ్యాయః

(కేవలము భక్తిని గురించి చెప్పనది గాన భక్తియోగ మనదగు ఇయ్యది మిగుల శ్రేష్ఠమైనది. ఈ యధ్యాయమునఁ (1) సగుణోపాసనము నకును నిర్గుణోపాసనకుగల తారతమ్యము (2) భక్తియందుఁ బ్రవేశించు టకు సోపానములు(3) భక్తుని కుండవలసిన గుణములు, పై మూఁడు విషయములను దెల్పబడియున్నవి.)

అర్జున ఉవాచ :

☞సగుణ-నిర్గుణ భక్తులలో శ్రేష్ఠులెవరని ప్రశ్న.

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. 1

తా. అర్జునుఁడిట్లనెను త్రికరణశుద్ధిగా నిన్ను ధ్యానించువారిలోను, ఆత్మధ్యానమొనర్చువారిలోను,ఎవరధికులు? ఎవరికేమి ఫలప్రాప్తి యగు.

శ్రీ భగవానువాచ :

☞అత్యధిక శ్రద్ధచే నన్నుపాసించువారు శ్రేష్ఠులు.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః. 2



తా. భగవంతుఁడిట్లనెను-నాయందు మనస్సు నిలిపి నిత్యయుక్తులై యధిక శ్రద్ధతో, నన్నుపాసించువారు శ్రేష్ఠులని నాయభిప్రాయము.

☞నిర్గుణ బ్రహ్మానుపాసించువారు నన్నే బొందుదురు.

యే త్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్. 3
సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః. 4

తా. ఎవరింద్రియములను జయించి సర్వప్రాణులయందు సమభావముఁగల్గి, ఎవరు శబ్దముచే తెలుపరానిదియు, (1) ఇంద్రియ గోచరముఁ గానిదియు, సర్వవ్యాపకమును చింతించుటకు వీలుగా నిదియు, మాయా ప్రపంచమునఁ దధిష్ఠాన రూపముగనుండి, చలనము లేనిదియు, శాశ్వతమునగు నక్షర పరబ్రహ్మము నుపాసించుచున్నారో వారు గూడ నన్నే బొందు చున్నారు.

(1) వి.- ఇంద్రియములకు మనస్సుకు గోచరించని నిర్గుణ పరబ్రహ్మాను ధ్యానించు వారు గూఁడ, నన్నే బొందుదురు. గాని, నిర్గుణోపాసన కష్టతరము.

☞సగుణ నిర్గుణోపాసకుల స్థితి.

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే. 5

తా. నిర్గుణోపాసకులకు సగుణోపాసకులకంటెఁ గష్టమధికము. దేహాభిమానముఁ గలవారలకు హెచ్చు కష్టములుఁ గలుగకయే పరబ్రహ్మ నిష్ఠ సిద్ధింపదు.

☞సగుణ బ్రహ్మోపాసకులకు ముక్తినిత్తును.

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే. 6
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్. 7

తా. సమస్త కర్మలను నాయందు సమర్పించి నన్నే సర్వోత్తమమగు పదార్థముగ నెంచి, నన్నే బుద్ధియందు నిల్పి ధ్యానముఁ జేయుచున్నారో,

యట్టి చిత్తవృత్తిగల్గిన వారిని శీఘ్రకాలములో మృత్యురూపమగు సంసార సముద్రమునుండి తరింపఁజేయుదును.

☞సగుణ బ్రహ్మోపాసనా రీతి.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8

**తా. గాన, నీవు నాయందే మనస్సు స్థిరముగా నిలుపుము. నాయందు బుద్ధి నుంచుము. అట్లు చేసితివేని ఈ దేహము నశించిన పిదప నిస్సంశయ ముగ నన్నే బొందుచున్నావు.**

☞స్థిరచిత్తములేనివారి కభ్యాసయోగము.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. 9

**తా. అర్జునా! అటుల నాయందు నీ మనస్సును స్థిరముగా నిలుపుటకు నసమర్థుఁడగుదువేని యోగాభ్యాసముచే నన్నుఁ బొందుటకుఁ బ్రయత్నించుము.**

వివరణ : యోగాభ్యాసమనగ=ప్రతిదినము నియతకాలమున ప్రయత్నపూర్వకముగ నేకాంతస్థలమున కొంతసేపు కూర్చుండి చంచలమగు మనస్సును ఒక్క విషయముపై నిలిపి యభ్యాసముఁ జేయుట.

☞అభ్యాసయోగమునకు స్థిరచిత్తతలేని యెడల శ్రవణ కీర్తనాది భాగవత ధర్మం బనుష్ఠింపుము.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. 10

**తా. అభ్యాసము చేయుటకుఁ గూడ నీకుశక్తిలేక పోయెనేని నాకుఁ బ్రీతికరమగు పుణ్యకార్యములఁ చేయుటయే జన్మసాఫల్యమని యెంచి జేయుము. నాకుఁ బ్రీతికరములగు కార్యములఁ జేసితివేని (మోక్షరూప మగు) సిద్ధిని బొందగలవు.**

వి : భగవత్ప్రీతిగఁ జేయు కార్యములు రెండు విధములు. మొదటిది :- భగవదారాధన మొనర్చుట, తీర్థయాత్రలుఁ జేయుట, దేవాలయములుఁ బ్రతిష్ఠజేయుట. రెండవది : భగవంతుని బిడ్డలగు ప్రాణికోట్లను ఆదరించుట, విద్యాశాలలు, వైద్యశాలలును స్థాపించుట, అశక్తులగు వారికి అన్నపానాదులకు వసతులేర్పఱచుట.



☞భాగవత ధర్మమునకూ నసమర్థుఁడైన యెడల సర్వకర్మలఫలత్యాగము చేయుము.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

**తా. దీనికి గూడ నీవసమర్థుఁడగుదువేని నీవు సహజముగ చేయు సర్వ కర్మఫలమును నాకర్పించుము.**

☞సమస్త సాధనములలో కర్మఫలత్యాగము శ్రేష్ఠము.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మ ఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్. 12

**తా. అభ్యాసముకన్న జ్ఞానము శ్రేష్ఠము, జ్ఞానముకన్న ధ్యానమధికము, ధ్యానముకన్నఁ గర్మఫలత్యాగము శ్రేష్ఠము. త్యాగమువలన శాంతి (మోక్షము) గలుగును.**



☞నిర్గుణోపాసకుని స్తుతి.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. 13
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్తస్స మే ప్రియః. 14

**తా. (1) ఏ ప్రాణియందుగాని ద్వేషబుద్ధిలేక (2) మైత్రి, కరుణ గలిగియుండి (3) అహంకార మమకారముల విడిచి (4) సుఖదుఃఖముల యందు సమత్వముఁజూపి (5) క్షమాగుణము (అనగా) దుఃఖమొదగినపుఁడు మనోవికారము నొందకుండుటయు(6) యోగము అనగా సర్వము భగవన్మయమని దెలిసి (7) మనస్సును దన వశమందుంచుకొని, (8) దృఢనిశ్చయముగలిగి (9) మనస్సును, బుద్ధిని నా యందుంచి ఎవఁడు నాకు భక్తుఁడగునో, నతఁడు నాకుఁబ్రియమైనవాఁడగును.**

☞మఱిల బ్రహ్మవేత్తయగు భక్తుని వర్ణన.

యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చ యః,
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః. 15

**తా. ఎవనివలన నితరులకు భయములేదో, ఎవఁడితరులచే భయము నొందడో, సంతసము, కోపము, భయము లేనివాఁడెవఁడో అట్టి (1) భక్తుఁడు నాకుప్రియుఁడు.**

(1) భక్తుఁడు సర్వభూతహితుఁడగుటచే వానివలన నెవతికి నెట్టి భయమును లేదు. ఎవఁడు ఏ ప్రాణికిని కీడుచేయడో, వానికెవరివలన భయములేదు.

**1అనపేక్ష 2శ్శుచి3ర్దక్ష 4ఉదాసీనో 5గతవ్యథః,**
**6సర్వారమ్భ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. 16**

(1) అనపేక్షః= దేహేంద్రియ విషయ సంబంధాదులయందు ప్రీతిలేనివాఁడు.
(2) శుచిః-బాహ్యాభ్యంతర పరిశుభ్రతగలవాఁడు.
(3) దక్షః=సమయోచిత కార్యములను చక్కగాఁ దెలియసమర్థుఁడు.
(4) ఉదాసీనః=శతృత్వ మిత్రత్వములు లేనివాఁడు.
(5) గతవ్యథః= దుఃఖము లేనివాఁడు.
(6) సర్వారమ్భ పరిత్యాగీ=శాస్త్రనిషిద్ధ కర్మలను పరిత్యజించువాఁడు.



**తా. ఏదియు కోరనివాఁడును, త్రికరణశుద్ధిగలవాడును, శాస్త్రజన్య జ్ఞానము, అనుభవజ్ఞానముఁగలవాఁడును, సమర్థుండును, సర్వకర్మఫల త్యాగియగు భక్తుఁడు నాకుప్రియుఁడు.**

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి,**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. 17**

**తా. ఎవడు ఇష్టవస్తువు ప్రాప్తించునపుడు సంతసింపక అప్రియము గలిగినపుఁడు ద్వేషింపక ప్రియవస్తు వియోగముకు శోకింపక దేనినిం గోఱక శుభాశుభముల పరిత్యాగము చేసిన భక్తుడు నాకు ప్రియుఁడు.**

**సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః. 18**

**తుల్యనిర్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,**
**అనికేతః (1) స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః. 19**

(1) స్థిరమితిః= పరమార్థ విషయమగు బుద్ధి గలవాఁడు గావున భక్తుని మనోభీష్ట మెపుడును భగవంతుని ప్రీతికి పాత్రుండు కావలయుననేకదా! అట్టి ప్రీతిని సంపాదించుటకు పై వివరించిన గుణముల నభ్యసించవలయు. ఆ గుణములేక వట్టిపూజలు యెన్ని జేసినను భగవంతుని యనుగ్రహము లభింపదు.



**తా. శత్రు మిత్రులయందు, మానావమానములందు, శీతోష్ణముల యందు, సుఖదుఃఖములందు, నిందాస్తోత్రములయందు, సమానుండై విషయా విషయ సంగరహితుండై లభించిన దానితోఁ దృప్తుడై, అభిమానము విడిచి నిశ్చలబుద్ధిగల భక్తుఁడు నాకు ప్రియుఁడు.**

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,**
**శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. 20**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగోనామ ద్వాదశోఽధ్యాయః

**తా. ఎవరు నేనే పరమగతియని నమ్మి, మోక్షప్రదమగు ఈ యమృత వాక్యములను నేను చెప్పిన విధమున శ్రద్ధతో నడచుకొనుచున్నారో అట్టి భక్తిగలవారు నాకు మిక్కిలి ప్రియులు.**

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు విభూతి యోగమను పండ్రెండవ యధ్యాయము ముగిసెను.**

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

## 13. త్రయోదశోఽ ధ్యాయః

**(ఈ యధ్యాయమునకు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమని పేరు. క్షేత్ర క్షేత్రజ్ఞులకు ప్రకృతి పురుషులని నామాంతరము గలదు. వీనినే క్షరాక్షరము లనియు, ఆత్మానాత్మలనియు, నిత్యానిత్యములనియు, సత్యాసత్యము లనియుఁ జెప్పదురు. ఈ రెంటిని గురించిన యథార్థజ్ఞానమే సకల వేదాంత విచారమునకు తొలిమెట్టుగాన ఏతద్విషయములంతయు నిందు వివరింపఁ బడినది.)**

అర్జున ఉవాచ :

☞క్షేత్రక్షేత్రజ్ఞుల విషయమున అర్జునుని ప్రశ్న.

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ,
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ. 1

**తా. అర్జునుఁడిట్లనెను - కృష్ణా ! ప్రకృతియననెద్ది? పురుషుఁడనగా నెవఁడు? క్షేత్రమనగా నేది ? క్షేత్రజ్ఞుఁడనఁగా నెవఁడు? జ్ఞానమనఁగా నెట్టిది? తెలియదగిన దెటువంటిది? ఇదంతయు నెఱుంగఁ గోఱుచున్నాఁ డను.**

శ్రీ భగవానువాచ :

☞క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూప నిరూపణము.

ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతేః,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 2



**తా. భగవంతుఁడిట్లనెను - అర్జునా ! ఈ శరీరము క్షేత్రమనియు, దీని నెఱుఁగువాఁడు క్షేత్రజ్ఞుఁడని (1) క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము దెలిసినవారు చెప్పదురు.**

(1) వి:- క్షేత్రమెంత మంచిదైనను దానిలో బీజము నాటని యెడల అంకురింపదు. కనుక క్షేత్రబీజముల సంయోగముచేతనే వృక్షము గలుగవలయుగదా? తద్రీతిగా భగవంతుని బీజమనెడు జీవకళను శరీరమనెడు క్షేత్రము నందుంచిన యెడల నది యంకురించి పురోవృద్ధి గాంచు. కావున బీజమునకు క్షేత్రమునకుఁగల సంబంధమట్టిదని దెలియవలె.

☞క్షేత్ర క్షేత్రజ్ఞులఁ దెలియుటయే జ్ఞానమనదగు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞా నం యత్తజ్జ్ఞా నం మతం మమ. 3

**తా. అర్జునా ! సమస్త శరీరములయందుండెడి నన్ను క్షేత్రజ్ఞునిగా దెలియుము. క్షేత్రమును క్షేత్రజ్ఞుని తెలిసికొనుటయే జ్ఞానమని నా మతము.**

**(వివరణము) ఇయ్యది జీవాత్మకును పరమాత్మకును "వస్తుతః" ఐక్య మును బోధించుచున్నది. అనగ పరమాత్మయొక్క యంశమే జీవాత్మయని యర్థము. "ఈశ్వరునకు జీవునకు ఐక్యభావము చెప్పినంతమాత్రముననే ప్రకృత దశయందు జీవుఁడన్ని విధముల నీశ్వరునితో సమానుఁడని యర్థము గాదు." ఈశ్వరుఁడు సర్వశక్తి సమన్వితుఁడు జీవుఁడు అల్పశక్తి గలవాఁడు. ఐనను గాలక్రమమున వానిశక్తి యభివృద్ధికాఁగా వాఁడును ప్రకృతిని జయించి సుగుణముల క్రమక్రమగ వృద్ధిజేసికొని తుదకు వాఁడ అనంత కల్యాణగుణ పరిపూర్ణుఁడగును.**

☞ క్షేత్రజ్ఞుని ప్రభావము.

తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 4

**తా. ఆ క్షేత్రమెద్దియో, దానిస్వభావ మెట్టిదో, దాని వికారము లేవియో, ఏకారణముచే నది పుట్టినదో, క్షేత్రజ్ఞుఁడెట్టి ప్రభావముగలవాఁ డో దానిని సంగ్రహముగాఁ జెప్పెదను.**

☞క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపము అనేక విధములుగ స్తుతింపఁ బడినది.

ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః. 5

**తా. ఆ క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపము ఋషులచేత అనేక విధములుగా చెప్పఁబడినది. వేదములచేత నానా ప్రకారముగాను, విశదముగాను చెప్పఁ బడినది.(ఇంతియకాక) యుక్తియుక్తమై సంశయ రహితముగా బ్రహ్మనుఁ దెలియఁ జేయునట్టి బ్రహ్మ సూత్రములచేతను జెప్పఁబడినది.**

☞సాఙ్ఖ్యవేదాంత మతముల రీతిగ క్షేత్రముయొక్క విశేష స్వరూపము.

**మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవ చ**
**ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః. 6**

**ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా(1)ధృతిః,**
**ఏతత్క్షే త్రం సమాసేన సవికారముదాహృతమ్. 7**

(1) ధృతియనగ ఆత్మజ్ఞానమువలన గలిగెడు ధైర్యము.

**తా. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశములను పంచభూతములు, అహంకారతత్త్వము, బుద్ధితత్త్వము, వీనికన్నిటికి మూలమగు నవ్యక్తము నివి యన్నియును, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, మనస్సు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, ఇచ్ఛ, ద్వేషములు, సుఖదుఃఖములు, దేహేంద్రియ సముదాయము, తెలివి, ధైర్యము, ఇవియన్నియు క్షేత్రమగును.**

☞జ్ఞాన సాధన నిరూపణము

**అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తిరార్జవమ్,**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః. 8**

**తా. తన్నుఁదాను పొగడుకొనక యుండుట, తన ధర్మము తాను ప్రకాశముచేసికొనక యుండుట, హింసచేయక యుండుట, క్షమ, కృత్రిమము లేకపోవుట, గురుసేవ, బాహ్యాభ్యంతర శుచి, ఎన్ని విఘ్నములు వచ్చినను మోక్షమార్గించుటయందే స్థిరచిత్తతయు, మనోనిగ్రహము గలిగి యుండుట.**

**ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ**
**జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్. 9**



**తా. విషయములందు వైరాగ్యము, అహంకారము లేక యుండుట, జన్మము, మరణము, ముసలితనము, రోగము, దుఃఖము, వీటియందుండు దోషముల నఱయుట.**

**అసక్తిరనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు,**
**నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 10**

**తా. పుత్రులు, భార్య, గృహాదులయందాసక్తి లేక యుండుట, ఇష్టానిష్ట ప్రాప్తులయందెల్లపుడు సమబుద్ధిగలిగి యుండుట.**

**మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ,**
**వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది. 11**

**తా. భగవదేతరచింతలేక నేనేగతియని నమ్మి నాయందు స్థిరమైన భక్తిగలిగియుండుట విజనస్థలవాసియగుట, జనసమూహమునందు ప్రీతి లేక యుండుట.**



**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్,**
**ఏతజ్జ్ఞా నమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా. 12**

**తా. ఆత్మజ్ఞానమందు నిత్యభావము గలుగుట, మోక్షప్రాప్తియందే ప్రయోజన దృష్టియుండుట, ఇదియంతయు జ్ఞానమని చెప్పఁబడినది. దీని కన్న వేఱైనదంతయు అజ్ఞానమని దెల్పినది.**

☞జ్ఞేయ బ్రహ్మోపదేశము.

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,**
**అనాదిమత్పరంబ్రహ్మ న సత్తన్నా సదుచ్యతే. 13**

**తా. దేనిని తెలిసికొనినవానికి ముక్తికలుగునో, యేది యనాదియైనదో, యేది పరబ్రహ్మమో, సత్తనిగాని యసత్తనిగాని దేనిని చెప్పవీలు లేదో అట్టి జ్ఞేయమును దెల్పుచున్నాను.**

☞బ్రహ్మముయొక్క అస్తిత్వము

**సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్,**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. 14**

తా. ఆ బ్రహ్మ అన్ని దిక్కులయందు చేతులు, కాళ్లు, కన్నులు, శిరస్సులు, ముఖములు, చెవులు గలిగినదియై లోకమంతయు నావరించి యున్నది.

☞సగుణ నిర్గుణ బ్రహ్మ స్వరూపము.

**సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్,**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. 15**

తా. ఇంద్రియవ్యాపారములచేతఁ బ్రకాశించుచున్న దానివలె నుండి నను, మోక్షదశయందు సకలేంద్రియ రహితమైనది. దేనిని అంటకయున్నను సర్వమును ధరించియున్నది. గుణము లేనిదైనను గుణముల ననుభవించు నట్టిది.

☞జ్ఞేయ బ్రహ్మముయొక్క స్వరూప లక్షణము

**బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ,**
**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్. 16**

తా. ఆ బ్రహ్మము చరాచరంబులయందు లోపల బైట నుండునది. చాలా సూక్ష్మమైన రూపము గలిగినది; గావున తెలిసికొన నశక్యమైనయది (తెలియనివారికి) దూరముగా నుండునది. (తెలిసినవారికి) దగ్గరగా నుండునది.

☞ఆత్మభేద ఖండనపూర్వకముగ ఏకాత్మ ప్రతిపాదన.

**అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్,**
**భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 17**

తా. ఆ బ్రహ్మము సకల ప్రాణులయందభేదముగ నున్నను ఉపాధి భేదముచేత అజ్ఞానులకు వేఱువేఱుగా విభజింపఁబడిన దానివలె నుండును. సృష్టి స్థితి లయములకుఁ గారణమైనదని ఎఱుఁగుము.

☞జ్ఞేయ బ్రహ్మస్వరూప నిరూపణము.

**జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే,**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 18**



తా. ఆ బ్రహ్మము జ్యోతిస్స్వరూపులగు చంద్రసూర్యాదులను గూడఁ బ్రకాశింపఁజేయునది. అజ్ఞానముకంటె వేఱైనది. జ్ఞానముచేతనే తెలియదగినది. జ్ఞానస్వరూపమైన యది. తెలిసికొనియే తీరవలసినది. సర్వభూత హృదయముల యందున్నదని చెప్పఁబడును.

☞క్షేత్రజ్ఞునకు బ్రహ్మబావన ప్రాప్తి.

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. 19**

తా. ఇట్లు క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును సంక్షేపముగ జెప్పితిని. నా భక్తుఁడగువాఁడు దీనిని బాగుగాఁ దెలిసికొని బ్రహ్మత్వముఁ బొందుటకుఁ దగియుండును.

☞జీవునకు ప్రకృతియొక్క గుణముల సంగముచే బంధము.

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. 20**

తా. ప్రకృతి పురుషలిద్దఱును అనాదియని యెఱుగుము. దేహేంద్రియాది వికారములు, సత్వరజస్తమోగుణ రూపములగు సుఖదుఃఖములు మాయవలన గలిగినదని దెలియుము.

**కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,**
**పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. 21**

తా. శరీరము ప్రకృతి వలన కలిగినది. పురుషుఁడం (జీవుఁడం) దుసుఖదుఃఖముల ననుభవించుచుండును. ప్రకృతి క్షేత్రమునకుఁ గారణము. క్షేత్రమునందు సుఖదుఃఖములనుభవించుటకు జీవాత్మ (క్షేత్రజ్ఞుఁడు) కారణము.

☞గుణసంగమముచే సదసద్యోని జన్మము

**పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్**
**(1)కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు. 22**

(1) మనుజునకుత్తమ జన్మముగాని నికృష్ట జన్మముగాని కలుగుటకు గుణసంగమమేఁ గారణము. సత్వగుణప్రధానులు లోకోపకారములగు పుణ్యకార్యములఁ చేయుదురు. రజోగుణప్రధానులు

కామక్రోధాది పూరితులై స్వార్థపఱులగుచువర్తింతురు. తమోగుణ ప్రధానులు అవివేకులై హింసారూపమగు ఘోరకృత్యములఁ జేయుదురు. ఇవ్విధమున గుణమునకుఁ దగినకర్మయు, కర్మమునకుఁదగిన జన్మముఁగలుగునుగాన సదసద్యోనులఁ బుట్టుటకు గుణసంగమమేఁ గారణము.

**తా. (జీవరూపుఁడగు) పరమ పురుషుఁడు ప్రకృతియందుండి ప్రకృతి వలనఁ బుట్టిన గుణముల ననుభవించును, మంచిచెడ్డ జన్మము లెత్తుటకు గుణ సంగమమే కారణము.**

**(వివరము) లోకములో నెల్లవారు సుఖదుఃఖములనుభవించు చున్నారుగదా? అట్లనుభవించునది యెవరు? ఆత్మయా లేక దేహమా? ఆత్మ ఆనంద స్వరూపము. సుఖదుఃఖములు దానినంటవు. శరీరము జడము. స్పర్శాది జ్ఞానము దానికిలేదు. గాన సుఖదుఃఖము లెవరికి? సుఖ దుఃఖములు మొద లగు ద్వంద్వములన్నియు ప్రకృతిచేఁ బుట్టునని, ప్రకృతి సంబంధము లేనిదే సుఖముగాని దుఃఖముగాన యేదియు నంటదు. అవి ప్రకృతివలన బుట్టు నవియైననూ ననుభవించువాఁడు జీవుఁడే. గావున జీవుడు ప్రకృతితోఁ గలసియున్నంతవఱకు సుఖదుఃఖముల ననుభ వించునేగాని బ్రకృతినుండి విడువబడిన జీవునియవి నంటవు.**

☞క్షేత్రజ్ఞుని ప్రభావ నిరూపణము.

**ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః,**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః. 23**

**తా. సమీపమందుండి చూచువాఁడు అనుమోదించువాఁడు, భరించు వాఁడు, అనుభవించువాఁడు, మహేశ్వరుఁడు, పరమాత్మయని చెప్పఁబడు పురుషుఁడు (1) శరీరమందున్నను దానికంటె భిన్నుఁడే.**

(1) ఈ దేహమందు నెలకొనియున్న ఈ యుత్కృష్ట పురుషుఁడు తన సంకల్ప ప్రేరణచే ఈ దేహమునకు ప్రవృత్తి గలిగించుచు దీనిని నియమించుచున్నాఁడు.

☞ప్రకృతి-పురుషులయొక్క జ్ఞానముచే బంధ నివృత్తి.

**య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. 24**



**తా. ఎవఁడిట్లు ప్రకృతిని, పురుషుని గుణములతోఁ గూడ దెలిసికొను చున్నాఁడో యట్టివాడు శాస్త్రోక్త ప్రకారము నడచుకొన్నను నడచుకొనక బోయిననూ మఱల జన్మముఁబొందఁడు.**

☞పరమాత్మను మూఁడు మార్గములఁ దెలియుదురు.

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా,**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 25**

**తా. కొందఱు ధ్యాననిష్ఠులై మనస్సుచేఁ దమలో నంతర్గతమగు పరమాత్మను జూచుచున్నారు. కొందఱు జ్ఞానయోగముచేతను, మఱి కొందరు నిష్కామకర్మ యోగముచేతను బరమాత్మనుఁ జూచుచున్నారు.**

☞స్వతః ఆత్మను దెలియనివారికి గురూపదేశముచే సంసార తరణము.

**అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 26**

**తా. మఱికొందఱు పరమాత్మను పై జెప్పిన త్రోవలచేఁ దెలియని వారగుచు, గురువులవలన నుపదేశముఁ బొంది ఉపాసన చేయుదురు. వారును భక్తిశ్రద్ధలతో వేదాంతము వినువారుగనుక సంసార రూపమగు మృత్యువును మెల్లగా నతిక్రమింతురు.**



☞సమస్తము పరాపరప్రకృతులచే నుద్భవించు.

**యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావర జఙ్గమమ్,**
**క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ. 27**

**తా. భరతవర్షభ ! స్థావర జంగమములలో నేవస్తువైననూ క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగముచే పుట్టుచున్నదనిఁ దెలియుము.**

☞జీవన్ముక్తుఁ డెవడనగ ?

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి. 28**

**తా. ఎవఁడు సమస్త ప్రాణులయందు సమానముగ నుండునో, అవి నశించుచున్ననూ నాశమునొందని వాఁడెవఁడో యట్టి పరమేశ్వరునిఁ జూచువాఁడే బాగుగా జూచువాఁడు.**

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

☞సర్వాత్మభావముఁ బొందినవాని స్థితి.

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్.

**తా. అట్టివారెల్ల ప్రాణులయందు నంతర్గతమయిన పరమాత్మ యొకటియే యని తెలిసి తనచేతఁ దన్ను హింసించి కొననివాఁడు. (అనగ సర్వముఁ దానేగాన) సర్వమును హింసింపనివాఁడు ముక్తినిఁ బొందును.**

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి. 30

**తా. ఎల్లకర్మలు ప్రకృతి (భగవన్మాయ) సంబంధమగు గుణములచేఁ జేయబడునట్లు ఎవఁడెఱుగునో, వాఁడు తనలో నంతర్గతమగు ఆత్మను కర్మలు చేయనివానిగ చూచు చున్నాఁడు.**

యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవం చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 31

**తా. వేఱువేఱుగ నున్న భూతములు ఆత్మయందున్నట్లుగా, ఆ యాత్మ వలననే యీ యెల్ల ప్రపంచములుద్భవించునవిగా నెవఁడు తెలిసికొనునో నతఁడు పరబ్రహ్మను బొందును.**

**వివరము :- అనుభవముచే సమస్తము బ్రహ్మమయమని జూచుటయే బ్రహ్మనుఁ బొందుట. అపుఁడు జీవుఁడీశ్వరుని నుండి భిన్నుఁడుగా నేఱడు.**

☞ఆత్మకు కర్తృత్వము లేదు.

అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే. 32

**తా. అర్జునా ! ఆత్మ దేహమునందున్నను శాశ్వతుఁడు, ప్రకృతి నంటక యుండువాఁడు, ఏమియు చేయడు, చేయని వానికింక ఫలమంటు టెక్కడ? అదియును లేదు.**

☞ప్రథమ దృష్టాంతము.



యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మానోపలిప్యతే. 33

**తా. ఎట్లు ఆకాశమంతటను వ్యాపించియుండి దేనినీ నంటక యెట్లు న్నదో అట్లే ఆత్మ అన్ని దేహములయందున్నను నంటుటలేదు.**

☞ద్వితీయ దృష్టాంతము.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 34

**తా. భారత! సూర్యుఁడొక్కడేయైననూ లోకమునకంతయు నెట్లు ప్రకాశము కల్గించునో, అటులనే పరమాత్మ యొక్కడయ్యు సర్వ క్షేత్రములకుఁ బ్రకాశ మిచ్చుచున్నాఁడు. (భూతకోట్లనేకములుగ నుండినను అంతర్యామియగు పరమాత్మ యొక్కఁడే).**

క్షేత్ర క్షేత్రజ్ఞ యోరేవ మన్తరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్. 35

**తా. ఎవరు జ్ఞానదృష్టిచే నీ విధముగ క్షేత్రమునకు మఱియు క్షేత్రజ్ఞునకు మధ్యమునఁగల భేదమును, బ్రకృతి బంధమునుండి ప్రాణులకు ముక్తి యెట్లు కలుగుననిఁ దెలియుదురో వారు బ్రహ్మమును బొందుచున్నారు.**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగోనామ
త్రయోదశోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మను పదిమూఁడవ యధ్యాయము ముగిసెను.**

# గుణత్రయ విభాగ యోగము

## 14. చతుర్ధశోఽధ్యాయః



(ఈ పదునాల్గవ యధ్యాయమున ప్రకృతి పురుషులకుఁ గల పరస్పర సంబంధము, ప్రకృతియొక్క గుణములును, విశదీకరింపఁబడియున్నవి.)

శ్రీ భగవానువాచ :

☞భగవానుని జ్ఞానసాధన నిరూపణ ప్రతిజ్ఞ.

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్,
యజ్జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః. 1

**తా. దేనినిఁదెలిసి మునీశ్వరులందరు ఈ దేహమునుండి ముక్తిని బొందిరో అట్టి జ్ఞానములలో నుత్తమ జ్ఞానము మఱలఁ జెప్పెద నాలకింపుము.**

☞నన్నుఁ దెలిసినవారు సృష్టియందు పుట్టరు, లయమునందు నశించరు.

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ. 2

**తా. భగవంతుడిట్లనెను - ఈ జ్ఞానము నాశ్రయించి నాతో నైక్యము నొందినవారు సృష్టికాలంబున జన్మింపరు ప్రళయకాలమున నశింపరు.**

☞సమస్త భూతములకు బీజము నేను.



మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్,
సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత. 3

**తా. భారత! భూతముల సృష్టిస్థానము నాయొక్క గొప్ప ప్రకృతి. ఆ ప్రకృతియందు నేను గర్భకారణము బీజమును ఉంచుచున్నాను. అందుచే సమస్త భూతములయొక్క యుత్పత్తి యగుచున్నయది.**

సర్వయోనిషు కౌన్తేయ మూర్తయస్సమ్భవన్తి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా. 4

**తా. కౌన్తేయ! సమస్త యోనులందు ఏయే మూర్తులు పెట్టుచున్నవో వాటికన్నింటికిని బ్రకృతి తల్లివంటిది. నేను గజప్రదుడు గాన దండ్రిని.**

**(వివరము) సూర్యునిచే ననేకకోట్ల కిరణములు బహిర్గత మొదలగు నట్లు ఆదియందీశ్వరుఁడుఁ దనలో నుండి యనేకకోట్ల గుణములను వెలువ డించి వాటిని మూలప్రకృతియందు స్థాపించును. ఆ ఒక్కొక్క కణమునకు బ్రకృతినుండి ఒక్కొక్క యుపాధియేర్పడును. అట్టి యుపాధి చేత నావరింపఁ బడిన ఒక్కొక్క కణము ఒక్కొక్క జీవుడగును. గాన భగవదంశభూతుఁడగు జీవుడివ్విధంబున బ్రకృతి బద్ధుడయ్యె.**

☞జీవుఁడు బ్రకృతితో నెట్లు బద్ధుడగును.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః,
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. 5

**తా. మహాబాహు! ప్రకృతినుండి బుట్టు సత్వ రజస్తవములను మూఁడు గుణములు నాశరహితుఁడగు(1) జీవుని బంధించుచ్చున్నయవి.**

(1) ఇదియే సంసారబంధమనఁబరగు. ఈ బంధమునుండి విడుదలయగుటయే మోక్షమనఁబడును.

☞సత్త్వగుణ బంధ నిరూపణము.

తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రాకాశక మనామయమ్,
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ. 6

**తా. అర్జునా ! సత్త్వగుణము నిర్మలమైనది, ప్రకాశమిచ్చునది, ఉప ద్రవములేనిది, దీనివలన సుఖమునందును జ్ఞానమందు ఆశగల్గును, అందుచే జీవుఁడు బద్ధుఁడగును.**

☞రజోగుణ బంధ నిరూపణము.

**రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్,**
**తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్. 7**

**తా. కౌన్తేయ! రజోగుణము ప్రపాంచిక విషయములందాసక్తిఁ బుట్టించును. చూచిన వస్తువులన్నియుఁ దనకు గానవలెనను కోతికయు, తనకు లభించినదానిని విడువగూడదను అభిమానముఁ గల్పించి దానిచేత జీవుని బంధించును.**

☞తమోగుణ బంధ నిరూపణము.

**తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,**
**ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. 8**

**తా. భారత! తమోగుణము అజ్ఞానముచేఁ బుట్టినది. అయ్యది సమస్త జీవులను వివేకహీనులుగఁ జేయుచున్నదని దెలియుము. దీని వలన ప్రమా దము, ఆలస్యము (సోమరితనము), నిద్రయుఁగలిగి వాని మూలమున జీవుని బంధించును.**

**(వివరము) అయితే జీవుఁడు మొట్టమొదలు మానవజన్మములో బ్రవేశించిన తదుపరి అనేక జన్మములవఱకు తమోగుణ ప్రధానుండై యుం డును. అపుడతడు కేవలమజ్ఞానదశయందుండును. మిక్కిలి సోమ రియై యుండును. వానికేకార్యములందునూ బ్రవేశింపవలయునను కోరిక యుం డదు. తనజీవితమునకుఁ గావలసిన అన్నవస్త్రాదులకైనను, కష్టించి సంపాదించుకొనఁ బ్రయత్నించడు. చురుకుదనము, జాగ్రత్తయు నుండవు. ఒక వేళ నేదైన పనిజేసిన అన్నియు తప్పులుగా నుండును. వృథా కాలహరణ జేయును. అతినిద్ర గలిగియుండు. వాడు నిద్రకు మించిన సుఖమెఱుగడు అట్టివాని కాశలు హెచ్చుగ నుండవు. పిమ్మటఁ బెక్కు జన్మములు రజోగుణ ప్రేరితుఁడై విషయసుఖముల నన్వేషించుచు కామక్రోధాదులకు లోలుడై మెలఁగు. తదనంతరము సత్వగుణము వృద్ధి యగును. ఈ సత్వగుణమున కొన్ని జన్మములుఁ గడచిన తరువాత జ్ఞానియై లోకోపకారియై ఈశ్వరాజ్ఞా ధురంధరుఁడై ప్రకాశించు.**

☞గుణత్రయముల కార్యము.



**సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత,**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత. 9**

**తా. భారత! సత్వగుణము సుఖమందును, రజోగుణము కార్యము లందును, తమోగుణ మజ్ఞానమందును సంగమముఁ గలుగఁ జేయు చున్నది.**

☞గుణత్రయముల కార్యము.

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత,**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. 10**

**తా. భారత ! ఒకప్పుడు సత్వ రజస్సుల నణచి తమోగుణమభివృద్ధి జెందు. ఒకప్పుడు తమస్సత్వముల నణచి రజోగుణము విజృంభించు. ఒకవేళ రజస్తమంబులఁ దిరస్కరించి సత్వగుణము ప్రకాశించును.**

**(వివరము) గుణముల ప్రేరణచే పురుషుఁడు కర్మములఁ బ్రవేశించు. కావున నతఁడు చేయు కర్మంబులన్నియుఁ దాత్కాలిక గుణోద్రేకంబు ననుసరించి యుండు. మనుష్యులయందు గుణభేదములచేతనే కర్మభేదము కలుగును.**

☞సత్వగుణోద్భవ చిన్హ నిరూపణము.

**సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే,**
**జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత. 11**

**తా. ఈ దేహమందెపుడు అన్ని ఇంద్రియముల ద్వారా జ్ఞానస్వరూప మగు తెలివి పుట్టునో అపుడు రజోగుణమును తమోగుణమును గప్పపడి సత్వగుణము వృద్ధిబొందినదని తెలియును.**

☞రజోగుణోద్భవ చిన్హ నిరూపణము.

**లోభఃప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా,**
**రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ. 12**

**తా. భరతశ్రేష్ఠుడా! రజోగుణము అభివృద్ధి నొందియుండగా, తన సొమ్ము విడువలేక ఇతరులసొమ్ము వాంఛించుటయు, ఏదో పని చేయు చుండు టయు, ఫలాపేక్షతో కర్మలు ఆరంభించుటయు, శాంతిలేక**

ఇంద్రియములు స్వేచ్ఛావిహారము చేయుచుండుటయు, విషయము లందాశయు, ఈ చిన్నములుముట్టుచున్నవి.

☞తమోగుణోద్భవ చిన్న నిరూపణము.

అప్రకాశోఽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన. 13

తా. కురునందన ! అజ్ఞానము, సోమరియై పని చేయకుండుట, దీన స్థితిలో నుండుట, కామవృత్తియందే మగ్నుడగుట, ఈ చిన్హములు తమోగుణము వృద్ధినొందగా కలుగు చున్నవి.

☞దేహాన్త్య కాలమున వృద్ధిబొందు గుణత్రయముల ఫలము.

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 14

తా. సత్వగుణము వృద్ధియందుండగా దేహి దేహమును వదలిన యెడల నతఁడుత్తమ విదులు బొందు స్వచ్ఛమైన బ్రహ్మాది లోకములుఁ బొందును.

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

తా. రజోగుణము వృద్ధిబొందినపుడు మృతిజెందిన పురుషుఁడు కర్మాసక్తులగువారి కుటుంబములందు జన్మించును. (స్వర్గాదులకొఱకు కర్మల నాచరించు.) తమోగుణము వృద్ధిబొందినపుడు మరణము నొందినవాఁడు కుక్క, పంది మొదలగు మూఢయోనులయందు జన్మించును. (ఏ పురుషార్థమైనను సాధించుకొనుటకు అనర్హుఁడగును.)

☞ఆయా గుణములకుఁ దగిన ఫలము.

కర్మణస్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 16

తా. పుణ్యకర్మములకు సత్వప్రధానమగు నిర్మలమయిన (1) సుఖమే ఫలము. రజోగుణమునకు దుఃఖము, తమోగుణమునకు నజ్ఞానము ఫలము.



(1) సుఖమనగ=ఆత్మానందము, దీనికి విరుద్ధగునది దుఃఖము.

☞సత్త్వాది గుణత్రయములకు వృత్తిరూపమగు ఉపగుణములు.

సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽ జ్ఞానమేవ చ. 17

తా. సత్వగుణమువలన జ్ఞానము, రజోగుణమువలన మోహము, తమోగుణమువలనఁ బ్రమాదము, మోహము, అజ్ఞానము గలుగును.

☞గుణత్రయ వృత్తులందుండువారికిఉత్కృష్ట నికృష్ట ఫలము.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః. 18

తా. సాత్వికులు దేవాది లోకములను బొందుచున్నారు. రజోగుణము గలవారు మధ్యమలోకమగు మనుష్యలోకమున ఉందురు. తమోగుణము గలవారలు పశ్వాది జన్మములఁ బొందుదురు.

☞ఈ యధ్యాయ ప్రారంభముననుండు మూఁడవ ఆక్షేపణకు సమాధానము.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽ నుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽ ధిగచ్ఛతి. 19

తా. ఎవఁడు గుణములే కర్తలనియు, తాను సాక్షి కారణమనియు నెఱుఁగునో నతఁడు నా స్వరూపమును జెందును.

☞గుణాతీతుఁడగుటకు నుపాయము.

గుణానేతానతీత్యత్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽ మృతమశ్నుతే. 20

తా. దేహమునకుఁ గారణభూతమైన సత్వ, రజ, స్తమోగుణములను దేహి యెపుడుతిక్రమించునో, అప్పుడతఁడు జన్మమృత్యు జరాదుఃఖములచే విడువఁబడి మోక్షమునుఁ బొందుచున్నాఁడు.

అర్జున ఉవాచ :

☞గుణాతీతుని విషయమున అర్జునుని మూఁడు ప్రశ్నలు.

కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతా నతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణానతివర్తతే. 21

తా. అర్జునుఁడిట్లనెను ప్రభువా ! ఈ త్రిగుణముల నతిక్రమించిన వాడెట్టి లక్షణములు గలిగియుండును ? వాని యాచారమెట్టిది ? ఈ త్రిగుణముల నతిక్రమించుట కెట్లు శక్యము?

శ్రీ భగవానువాచ :

☞ప్రథమ ప్రశ్నకుత్తరము.

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని,న నివృత్తాని కాఙ్క్షతి. 22

తా. భగవంతుఁడిట్లనెను పాణ్డవ ! త్రిగుణాతీతుఁడు, (సత్వగుణ సంబంధమగు) ప్రకాశముగాని, (రజోగుణసంబంధమగు) ప్రవృత్తినిగాని, (తమోగుణసంబంధమగు) మోహమును గానితనకుఁ బ్రాప్తములైనపుడు ద్వేషింపఁడు. అట్లే యవితన్ను వీడినను వానినిఁ గోఁడు.

☞రెండవ ప్రశ్నకుత్తరము.

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే. 23

తా. త్రిగుణాతీతుఁడు గుణములయందును గుణకార్యములయం దును లక్ష్యము లేనివాఁడగుచు యుదాసీనుఁడై యుండును.జరిగెడి ఎల్ల పనులు గుణవ్యాపారములని యెఱిగి చలింపక యుండును.

☞మఱియు

సమదుఃఖసుఖః స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః,
తుల్యప్రియాప్రియోధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః. 24

తా. అతఁడు సుఖదుఃఖములను సమానముగాఁజూచును. స్వరూప మందే యుండును. మట్టిని రాతిని బంగారును సమముగాఁ జూచును. ప్రియా ప్రియములందు సమదృష్టి యుంచును.ధైర్యముఁ గలవాఁడగును. నిందాస్తుతుల యందు సమానుఁడు.

☞మఱియు

మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే. 25



తా. మానావమానములయందు సమదృష్టి గలవాఁడు, శత్రుమిత్రుల యందు సమమైన మనస్సు గలవాఁడు. (దేహధారణకవసర మగు కర్మలుఁ దక్క) తక్కిన సర్వ కర్మలు త్యజించినవాఁడు. గుణాతీతుఁ డని జెప్పఁబడును.

☞మూఁడవ ప్రశ్నకుత్తరము.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

తా. ఎవఁడితర దేవతాచింతనముతో లేక భక్తియోగము నన్ను సేవిం చునో, యట్టివాడీ గుణములనతిక్రమించి ముక్తి బొందుటకు సమర్థుఁడగును.

☞శ్రీకృష్ణ భగవంతుని వాస్తవ స్వరూప నిరూపణము.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ. 27

తా. నేను నాశరహితమును, నిర్వికారమును బ్రహ్మమునకును, శాశ్వత ధర్మమునకును, అచంచల మోక్షసుఖమునకును ఆశ్రయమగు వాఁడను గదా !

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయవిభాగ యోగోనామ
చతుర్దశోఽధ్యాయః

ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణా ర్జున సంవాదమును నగు భగవద్గీతలందు గుణత్రయ విభాగ యోగమను పదునాల్గవ యధ్యాయము ముగిసెను.

# పురుషోత్తమ యోగము

## 15. పఞ్చదశోఽధ్యాయః

(ఇది పురుషోత్తమ యోగము. పురుషోత్తముఁడన భగవంతుఁడు. ఆయన పాదారవిందములఁ జేరుట సాక్షాత్సాధన మిచట నుపదేశింపఁబడినది.

శ్రీ భగవానువాచ :

☞సంసార వృక్ష వర్ణనము.

ఊర్ధ్వమూలమధఃశాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. 1

తా. భగవంతుఁడిట్లనెను మీద వ్రేళ్లును, క్రింద కొమ్మలను గలిగి యున్న యవ్యయమగు వృక్షము నశ్వత్థమని నిష్టులు చెప్పచున్నారు. దానికి వేదములే ఆకులు. దాని నెఱిగినవాఁడు వేదవిదుడు.

(వివరము) శ్వక్షఃరేపటివఱకు, ర్థక్షఃఉండునది, అక్షఃకాదు. శ్వర్థ మనగక్షఃఉత్తర క్షణమువఱకుండునది కాదని యర్థము. శ్వర్థమను సంసార వృక్షమునకు వ్రేళ్లు మీదుగ (ఊర్ధ్వకాలం), కొమ్మలు క్రిందుగ (అధశ్శాఖం) వేదములే ఆకులు ఛన్దాంసి పర్ణాని) అని నుడివియున్నారు. ఇందు సంసార వృక్షము తలక్రిందుగనున్నట్లు భావమున్నయది. దీనిని విశదీకరించి చదు వరులు దెలియవలెను. ఎట్లన ?



(1) జీవునకు పూర్వజన్మ కర్మఫలరూపమగు విషయాసక్తి వాసనా రూపముగ వానియందిమిడియున్నది. ఇదియే సంసార వృక్షమునకు వేఱు. మరుజన్మమునకుఁ గారణము-విషయాసక్తిలేనివారు దేహపత నానంతరము ఊర్ధ్వలోకములఁజేరి క్రమక్రమముగ నెక్కిసత్యలోకముదాటి పునరా వృత్త రహిత మోక్షస్థానముఁ జెందుదురు. గాన సంసార వృక్షమునకు వేఱు ఊర్ధ్వస్థానమందున్నదనిఁదెలియవలె.

(2) కొమ్మలు క్రిందనున్నవి. ఎట్లన - ఒక్కొక్క లోకమందు జీవున కొక్కొక శరీరమున్నయది. ఈ శరీరములన్నియు సంసార వృక్షమునకు కొమ్మలు.

(3) ఈ సంసార వృక్షమునకు వేదశాస్త్రములే యాకులు. ఎట్లన ఆకులు చుట్టుకున్న గాలిలోనుండి యాహార పదార్థముల చీల్చుకొని చెట్టు నకు సత్తువనిచ్చి కాపాడునట్లు, వేదశాస్త్రములు ధర్మాధర్మ నిరూపణచేత సంసారములో నున్నంతవరకు జీవునిఁ గాపాడును గాన ఈ సంసార వృక్షముయొక్క రహస్యమును దెలిసినవాఁడే జ్ఞాని.

☞సంసారవృక్షముయొక్క విశేష శాఖానిరూపణము.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్యశాఖా గుణప్రవృద్ధా విషయ ప్రవాలాః
అధశ్చ మూలాన్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే. 2

తా. ఆ వృక్షముయొక్క కొమ్మలు గుణములచే వృద్ధిబొందింపఁబడి నవి. విషయములనెడు చిగుళ్లుగలవియునై క్రిందికిని మీదికిని గూడ వ్యాపించి యున్నవి. వేళ్లు మనుష్యలోకమునందు కర్మము అను బద్ధముగా గలవై క్రిందికి విస్తరించినవి.

☞సంసారవృక్షమును ఛేదించు నుపాయము.

న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థమేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా. 3

తా. ఈ సంసారవృక్షముయొక్క స్వరూపముఁ దెలియుటశక్యము. దాని యాద్యంతములుగాని స్థితినిగాని తెలియనశక్యము. బహుదృఢమైన మూలములుగల ఈ వృక్షమును వైరాగ్యమనెడి యాయుధముచే నఱక వలయును.

వివరము :- వైరాగ్య మనియెడు దృఢమైన కత్తిచేత కొమ్మలు మాత్రమునరికి బ్రయోజనములేదు. ఎందుకనగ, చెట్టుమఱల చిగురించును. వేఱు నఱికినయెడల చెట్టు నశించును. సంసార వృక్షమునకు ఆశయే వేఱుగాన ఆశ వదలుటయే సంసార వృక్షమును ఛేదించుట.

☞సంసార వృక్షమును ఛేదించిన తరువాత చేయు కర్తవ్యము.

తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తన్తిభూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ.

తా. అట్లు ఛేదించిన పిమ్మట ఎవ్వనినుండి ఈ పురాతన ప్రవృత్తి వ్యాపించెనో, యట్టి ఆదికారణుఁడగు పరమపురుషునిఁ బొందుచున్నానని నిశ్చియించి, పునరావృత్తి రహితమైన మోక్షపదముకొఱకుఁ బ్రయత్నించ వలెను.

☞నాశములేని పదప్రాప్తికి యోగ్యమగు సాధనములు.

నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్.

తా. అహంకారము, మోహము వదలినవారు, రాగద్వేషాదులను బీజముల నశింపఁ జేసినవారు, నిరంతరము ఆత్మ జ్ఞానమునందుండు వారు, వాంఛలు నశింపఁజేసికొనినవారు, సుఖదుఃఖ సంబంధములు గల ద్వంద్వములచేత విడువబడిన వారగు జ్ఞానులు, శాశ్వతమైన ఆ పదమును బొందుచున్నారు.

☞నా స్థానము స్వప్రకాశము.

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః,
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ. 6

తా. ఏ స్థానమును సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్నిప్రకాశింపఁజేయఁ జాలరో, ఏ మోక్షపదమునుఁ బొంది మఱల రారో అది నా ముఖ్య స్థానము.

☞త్వం పదముయొక్క వాచ్యార్థ నిరూపణము.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7



తా. అనాదియైన నాయంశమే ప్రపంచమునందు జీవరూపమై యున్నది. ప్రకృతిసంబంధమై మనస్సుతోఁజేరిన జ్ఞానేన్ద్రియములా జీవుని విషయములందు లాగుచున్నవి.

☞ఉత్తరము

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్. 8

తా. జీవుఁడు శరీరములయందుఁ బ్రవేశించునపుడు శరీరముల నుండి బోవునపుడు, వాయువు పరిమళ ద్రవ్యములనుండి వాసనలను గొనిపోవు విధమున నింద్రియములను వానితోఁ గూడిన మనస్సును దీసికొని పోవుచున్నాఁడు.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే. 9

తా. జీవుఁడు శ్రోత్రము, చక్షుస్సు, స్పర్శము, రసన, ఘ్రాణము, అను బాహ్యేన్ద్రియములను, మనస్సును, ఆశ్రయించి శబ్ద స్పర్శరూప, రస, గంధములను, విషయ భోగములనుభవించును.

(వివరము) మనస్సు సహకారికాకున్న నీ యింద్రియములేదియు స్వవ్యాపారముంజేయజాలవు ఎట్లన? మనస్సు వేఱొకచోటనున్నపుడు ఎదుట నున్న వస్తువు కంటికి కానరాదు. పక్కన నుండువాఁడు జెప్పెడి మాట చెవికి వినరాదు. ఇట్లనె నింద్రియవ్యాపారము లన్నింటికి మనంబు దోడ్పడ వలయు. మనస్సు ఇంద్రియములతోడ నేకీభవింపజేసి జీవుఁడు విషయ ముల ననుభవించును.

☞ఆత్మను జూచువారి లక్షణము.

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః. 10

తా. ఈ యాత్మ దేహమును విడుచునప్పుడు గాని యందుండు నపుడు గాని,గుణములతోఁగూడి విషయముల ననుభవించునపుడు గాని, దేహమే నాత్మయని భావించు నజ్ఞానులు జూఁడ జాలరు. జ్ఞానులు మాత్రమే చూడఁ గలరు.

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్,
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః. 11

తా. కొందరు యోగులు ధ్యానాదులచేఁ బ్రయత్నించు చున్నవారై ఆత్మను దేహమందు వేరుగా నున్నట్లు చూచుచున్నారు. చిత్త సంస్కారము లేని మందమతులు ప్రయత్నించువారైననూ జూడజాలరు.

☞భగవంతుఁడు తన సర్వాత్మకత్వమును బ్రకటించుట.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 12

తా. జగత్తున కంతయుఁ బ్రకాశము గలుగజేయునట్టి సూర్యుని యందలి తేజస్సెద్దియో ఆ సమస్తప్రకాశము నాదియని యెఱుంగుము.

మఱియు

గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః 13

తా. నేను భూమియందు బ్రవేశించి నా తేజస్సుచేత సర్వప్రాణులను భరించుచున్నాను. నేనే రసస్వరూపుఁడగు చంద్రుడనై ఎల్ల సస్యములను గాపాడుచున్నాను.

మఱియు

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. 14

తా. నేను జఠరాగ్ని స్వరూపుడనై ప్రాణుల దేహముల నాశ్రయించి ప్రాణాపానవాయువులతో గలసికొన్న వాఁడనై భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య ములనియెడు నాల్గు విధములగు నన్నమును పక్వముఁ జేయుదును.

☞తత్పదముయొక్క వాచ్యార్థమునందుండు లక్ష్యార్థము.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనంచ,
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవచాహమ్.

తా. నేను సమస్త భూతకోటియొక్క హృదయమందున్నవాడను, జ్ఞాపక శక్తి, జ్ఞానము, మఱపు, నావలన గలిగినవే. సమస్త వేదములచేతను



గూడ నేనే దెలియఁదగినవాఁడను. వేదాన్తమును నిర్మించినవాఁడను. వేదరహస్య మునుఁ దెలిసినవాడుగూడ నేనే.

వివరము:- భగవద్దర్శనముఁ జేయుగోఱువారు. దూరదేశములకుఁ బోనక్కరలేదు. నేత్రాదీన్ద్రియముల బహిర్గతములుగానియ్యక నిగ్రహించి యంతర్ముఖియై హృదయములోనికిఁ బ్రవేశింపఁ జేసిన సులభముగ నచట భగవంతునిఁ దెలియదగు. సర్వ వేదములఁ జదువుటయు భగవంతుని దెలిసికొనుటకేగదా? భగవంతునిఁ దెలియనియెడల నెంత పాండిత్యముండి నను నిరర్థకము.

☞క్షరాక్షరరూపమగు పురుషద్వయనిరూపణము.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

తా. పురుషుఁడీలోకమున (1) క్షరుఁడనియు, (2) అక్షరుఁడనియు రెండువిధములుగా నున్నాఁడు. సమస్త భూతజాలములు క్షరుడనియు, కూటస్థుఁడగు జీవుఁడక్షరుఁడనియు చెప్పబడుచున్నాఁడు.

(1) క్షరమనగ=నశించునది (2) అక్షరమనగ=నాశములేనిది

☞అఖండ వాక్యార్థమగు నుత్తమపురుషుని లక్షణము.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. 17

తా. క్షరాక్షరముల రెంటికంటె విలక్షణమగు నుత్తమ పురుషుఁడు మఱియొకఁడు గలఁడు. ఆయన మూఁడు లోకములు వ్యాపించి సమస్తమును భరించుచున్నవాఁడు నాశరహితుఁడు పరమాత్మయని చెప్పఁబడుచున్నాఁడు.

☞పురుషోత్తమ నామపూర్వక స్వస్వరూపోపదేశము.

యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

తా. నేనట్టి క్షరాక్షరములకంటె నతీతుఁడైనవాఁడను గాన లోకము నందును, వేదమునందును గూఁడ పురుషోత్తముఁడనని ప్రసిద్ధి బొంది యున్నాను.

☞ స్వస్వరూపుఁడగు పురుషోత్తమునిఁ దెలిసిన వానికగు ఫలము.

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత. 19

**తా. భారత! ఎవఁడు నన్నీ ప్రకారము పురుషోత్తమునిగా అజ్ఞాన రహితుఁడై దెలిసికొనునో వాఁడే సర్వము నెఱిఁగినవాఁడు. అట్టివవాఁడు సర్వ విధముల నన్ను భజించును.**

☞ ఈ పదునైదవ యధ్యాయమునుఁ దెలియువాఁడు జ్ఞానియగు.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయాఽనఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత. 20

**తా. భారత! ఇట్టి పరమ రహస్యమగు జ్ఞానమును నీకుఁజెప్పితిని. దీనిని చక్కగాఁ దెలిసినవాఁడు జ్ఞానవంతుఁడు కృతకృత్యుఁడు నగును.**



ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే పురుషోత్తమ యోగోనామ
పంచదశోఽధ్యాయః

**ఇదియుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణా ర్జున సంవాదమునునగు భగవద్గీతలందు పురుషోత్తమయోగ మను పదునైదవ యధ్యాయము ముగిసెను.**



# దైవాసుర సంపద్విభాగ యోగము

## 16. షోడశోఽధ్యాయః

**(ఆత్మగుణములు, దైవీసంపత్తనియు; ప్రకృతిగుణములు, అసుర సంపత్తనియు నీ యధ్యాయమున వ్యవహరింపఁబడి యున్నవి.)**

☞ దైవీ సంపత్స్వరూప నిరూపణము.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్. 1

అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాన్తిరపైశునమ్,
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్. 2

తేజః క్షమాధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత. 3

**తా. భారత !**

**1. భయములేకుండుట 2. చిత్తశుద్ధి 3. ఆత్మజ్ఞానవృద్ధి 4. దాన శీలము 5. ఇంద్రియ నిగ్రహము 6. యజ్ఞములు జేయుట 7. వేదాధ్యయ నము 8. తపస్సు 9. సత్త్వవర్తనము 10. ప్రాణిహింసచేయకుండుట 11. నిజము పలుకుట 12. కోపము లేకుండుట 13. త్యాగము 14. చిత్తశాన్తి 15. ఇతరుల దోషములు నెంచకుండుట 16. భూతదయ 17. ఇంద్రియ లోలుఁడు కాకుండుట 18. మృదుభాషణము 19. లజ్జ 20. చపలము**

లేక యుండుట 21. తేజస్సు 22. ఓర్పు 23. ధైర్యము 24. బాహ్యాభ్యంతర శుద్ధి 25. ద్రోహముఁజేయకుండుట 26. గర్వము లేకుండుట.

ఈ యిరువది యాఱు సుగుణలక్షణములు దేవతా సంపత్తివలనఁ బుట్టినవారికిఁ గలుగుచున్నవి.

వివరము- ఇవి ఈశ్వరునియొక్క కల్యాణగుణములు. ఇవి సచ్చిదానందములను స్వరూపత్రయముయొక్క వివిధ పరిణామములు. గనుకనే ఇవి ముక్తిహేతువులనబడినవి. ఈ గుణములన్నియు నెవ్వనియందీషత్తైన కొఱవడక పరిపూర్ణములైయుండునో నతఁడే మోక్షార్హుఁడగును. కావున ముముక్షువు దీనినొక్కొక్కటిగ దీసికొని మననముచేసి యనుష్ఠానమునకుఁ దెచ్చికొని యార్జింపవలయు.

దమ్భోదర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్. 4

తా. పార్థ! డంబము, గర్వము, అభిమానము, క్రోధము, కఠినపు మాటలు, అవివేకము, ఈ గుణములన్నియు రాక్షసాంశమునఁ బుట్టినవారలకుండును.

వివరము - కావున అసురగుణములు మననము చేయఁదగినవి కావు. తెలిసికొని వర్జింపఁదగినవి. దైవీగుణములు సదా స్మరించి, నాచరింపఁదగినవి, ఆసురగుణములు గలవారు, స్వలాభమునకే ప్రయత్న పడుదురు. దైవీగుణములు గలవారు, అందరి శ్రేయస్సునకై పాటుపడుదురు.

☞ అర్జున ! నీవు దైవసంపద యందుద్భవించిన వాఁడవు.

దైవీసంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా,
మాశుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ. 5

తా. (1) దైవసంపద ముక్తికొఱకును, ఆసురసంపద బంధము కొఱకును అగును. పాణ్డవ! నీవు దైవసంపదను గుఱించి పుట్టినవాఁడవు గావున శోకింపకుము.

(1) వి. - దైవసంపదగలవారు ఈశ్వర సంకల్పముంగుర్తెఱిఁగి దాని కనుసారమున వర్తింతురు. అసుర స్వభావముగలవారు. ఈశ్వరాజ్ఞోల్లంఘులై లోకకంటకులగుచు ప్రవర్తింతురు.

☞ అసుర స్వభావ నిరూపణము.



ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. 6

తా.పార్థ ! ఈ లోకములో భూతసృష్టి దేవతా సంబంధమగునదిగాఁ గొంతయును, అసురసంబంధమైనదిగాఁ గొంతయును రెండు విధములుగాఁ గలవు. అందు దేవతా సంబంధము విస్తరించి చెప్పఁబడినది. ఇఁక నాసురసంబంధము చెప్పెదను వినుము.

☞ అసుర ప్రకృతిగల వారి వ్యవహార నిరూపణము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

తా. అసుర స్వభావముగల జనులు ఏ కార్యములఁ జేయవలయునో, ఏ కార్యముల విడువవలయునో యెఱుఁగరు. కావున శౌచము, ఆచారము, సత్యము ఇవి వారియందుండవు.

☞ అసుర ప్రకృతిగల వారుచ్చరించు పల్కు.

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్,
అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్. 8

తా. రాక్షసాంశ సంభూతులు దైవము లేదనియు, ప్రపంచము దైవస్వరూపముఁ గాదనియు, అంతయు స్త్రీ పురుష సంయోగమువల్లనే కలుగు చున్నదనియు, అంతకును కామమేఁ గారణమని చెప్పదురు.

☞ అసుర ప్రకృతి గలవారు చేయు కర్మ.

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

తా. ఈ నాస్తికబుద్ధినవలంబించి, (1) నష్టాత్ములై, యల్ప బుద్ధిగలవారై, హింసాది క్రూరకర్మలు చేయుచు, లోకక్షయము చేయుటకు బుట్టుచున్నారు.

(1) నష్టాత్ములు అనగ = ఆత్మస్వభావమగు మోక్షమునకుఁ దూరులు.

☞ అసుర పురుషుల వ్యవహార నిరూపణము.

కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచి వ్రతాః. **10**

తా. తనివిదీరని కామమును ఆశ్రయించి, డంబము, అభిమానము, మదము, అనువానితోఁ గూడినవారలై అయోగ్య గుణములు అవివేకము వలన స్వీకరించుచు అపవిత్ర వ్రతాచరణముఁ గలవారలై సంచరించుచున్నారు.

చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః. **11**

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్. **12**

తా. వారు చచ్చువరకు విడునని, ఎడతెగని చింతలో మునిగి, కామ భోగములే పరమార్థములనియు, నంతకంటె చేయవలసిన నుత్తమ కార్యము లేదనియు, లెక్కలేని యాశలకులోనై కామక్రోధములే పరమగతి యని నమ్ము కొని విషయసుఖములకొరకు అన్యాయమార్గముల ధనసంపాదనమును జేయ గోరుచున్నారు.

☞ అసుర ప్రకృతి గలవారి తృష్ణారూపమగు లోభముయొక్క వర్ణన.

ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్. **13**

తా. ఈ కోర్కెను నేఁడు పొందితిని. దీనిని నేను పొందఁగలను. ఇంత ధనమును నేను సంపాదించితిని. మఱల ముందు ఇంత ధనమును సంపాదింపఁగలను.

☞ అసుర పురుషుని యభిప్రాయమునందు శంకా సమాధాన నిరూపణము.

అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.

తా. ఈ శత్రువునడంచితిని. ఇతర శత్రువులను గూడం జంపి వేయుదును. నేనే ఈశ్వరుఁడను, నేనే భోగిని, నేనే కృతకృత్యుఁడను. నేనే బలవంతుఁడను. నేనే సుఖిని.



ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. **15**

తా. నేను ధనవంతుఁడను, నేను మంచికులమునఁ బుట్టినవాఁడను, నాతో సమానులెవరు? నేను యజ్ఞములఁ జేసెదను. నేను దానములఁ జేయఁగలను, నేను నిత్యసంతోషిని, అని యిట్లు నజ్ఞానముచే మోహితులగుదురు.

☞ అసుర పురుషుల స్థితి వర్ణన.

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ. **16**

తా. అట్టి దురాచారపు మానవులనేక విషయములందాసక్తి యుంచుట వలన చిత్తభ్రాంతిఁ బొంది మోహపాశములచేతఁ జుట్టుకోఁ బడిన వారలై కామానుభవములయందు మునింగిన వారలగుచు యశుచియగు నరకములో గూలుచుందురు.

ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్. **17**

తా. తమ్ముఁదాము గొప్పగాఁ దలచువారును, వినయ హీనులును, ధనమువలన మదగర్వములు గలవారును నగు నసురులుఁ (సోమయాజి బిరుదులుకొఱకు) నామ మాత్ర యజ్ఞములను డంబముతో, శాస్త్రవిరుద్ధ మార్గమునఁ జేయుచున్నారు.

☞ అన్త్యమునకాసురప్రకృతి గలవారికి నరకప్రాప్తి.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః. **18**

తా. అహంకార, బల, దర్ప, కామ, క్రోధములనాశ్రయించిన యా యసురులు తమ దేహములందును ఇతర దేహములయందును. (సాక్షిగ నున్న) నన్ననూయాపరులై ద్వేషించుచున్నారు.

☞ అసుర స్వభావము గలవారి ఫలనిరూపణము

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు. 19

తా. అట్లు నన్ను ద్వేషించుచుండు కఠినచిత్తులెవ్వరుందురో, యట్టి యశుభ ప్రవర్తనముఁ గల నపరాధములను సంసారమందు మాటి మాటికిని నాసుర గర్భములందు వారిని పుట్టించుచున్నాను.

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాంగతిమ్. 20

తా. కౌన్తేయ ! అట్లు అసురయోనులందుఁ బుట్టిన మూఢులు ప్రతి జన్మమందును నన్నుఁ బొందలేకయే అందుండి యధమగతిని బొందు చుందురు.

☞నరక ద్వారములు మూఁడు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామఃక్రోధస్తథాలోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్. 21

తా. కామము, క్రోధము, లోభము, అను మూఁడు నరకద్వారములు, వీనివలన యాత్మవినాశము గలుగును. గావున (బ్రతిమానవుఁడు ప్రయత్న పూర్వకముగ) ఈ మూటిని విడువ వలెను.

వివరము - కామ, క్రోధ, లోభములలో నొక్కొక్కటియే పురుషుని నరకములోనికిం జేర్చుటకు సమర్థములన్నచో నిమ్మూడుం జేరెనేని అవి చేయగల యనర్థము చెప్పవలయునా? వాటికి లోబడియున్నంతవరకు పురుషుని కధోగతిగాని వేరులేదు.

☞కామాది అసురప్రకృతుల విడిచిన వానికిగల్గు ఫలము.

ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. 22

తా. కౌన్తేయ! నరకద్వారములగు నిమ్మూటినుండి తప్పించుకొన్న వాఁడు. తన శ్రేయస్సునకు సాధనములగు తపస్సు యోగము మొదలగు కర్మల నాచరించి వెనుక ముక్తినిఁ బొందును.

☞శాస్త్రవిధి విడిచి కామాదుల జయించుటకు చేయు తపస్సు వ్యర్థము.



యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. 23

తా. ఎవఁడు శాస్త్రవిధినుల్లంఘించి తన ఇష్టానుసారమే ప్రవర్తిం చునో, అట్టివాఁడు (కార్య) సిద్ధినిఁ బొందడు. (ఇహలోకమున) సుఖ మునుఁ బొందడు. (మరణానంతరమున) మోక్షమునకుం బోవడు.

☞శాస్త్రోక్తముగానే కర్మమును జేయవలెను.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి. 24

తా. ఆకారణమువలన చేయఁదగినదియు చేయరానిదియు నిర్ణ యించు నప్పుడు నీకు శాస్త్రము ప్రమాణమైనది. శాస్త్రవిధానముచే నిశ్చ యింపఁబడిన కర్మమును తెలిసికొని ఆచరించుట ఈ లోకమున నీవు దగియున్నావు.



ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర సంపద్విభాగయోగోనామ షోడశోఽధ్యాయః

ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు దైవాసుర సంపద్వి భాగ యోగమను పదునారవ యధ్యాయము ముగిసెను.

# శ్రద్ధాత్రయ విభాగ యోగము

## 17. సప్తదశోऽధ్యాయః



(శ్రద్ధాత్రయ విభాగయోగమనగ సత్వ రజస్తమోగుణములు మూఁడును మానవులందెట్లు అభివ్యక్తమగుచున్నవో ఆ వివరము ఈయధ్యాయమున విశదీకరింపఁబడియున్నది. ఈ గుణములయొక్క అభివ్యక్తమే "శ్రద్ధ" యని ఈ యధ్యాయమునఁ జెప్పఁబడినది.)

అర్జున ఉవాచ :

☞శ్రద్ధ విషయమున అర్జునుని ప్రశ్న.

యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః. 1

తా. అర్జునుఁడిట్లనెను - కృష్ణా! ఎవరు శాస్త్రవిధినివిడిచి (దేవాదులను) శ్రద్ధావంతులరై పూజింతురో, అట్టి నియమము సాత్వికమా ? రాజసమా? తామసమా ?

శ్రీ భగవానువాచ :

☞శ్రద్ధ మూఁడు విధములు.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2



తా. ఆ శ్రద్ధ సత్వగుణసంబంధమైనదియు, రజోగుణ సంబంధమైనదియు, తమోగుణ సంబంధమైనదియు, అని ప్రాణులకు స్వభావము వలనఁ గలుగుచున్నదై మూఁడు విధములగుచున్నవి. దానిని వినుము.

☞వాని వాని యంతఃకరణము ననుసరించి శ్రద్ధయుండును.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోऽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః

తా. భారత! సమస్త ప్రాణులకును వానివాని పూర్వ జన్మ సంస్కారముతోఁ గూడిన యంతఃకరణమునకుఁదగిన శ్రద్ధ కలుగుచున్నయది. ఎవఁ డెట్టి శ్రద్ధగలవాఁడో వాఁడట్టి శ్రద్ధతోఁ గూడినవాఁడగును.

(వివరము) 'శ్రద్ధామయోऽయంపురుషోయోయచ్ఛ్రద్ధస్సఏవసః' అను వాక్యము జ్ఞప్తియందుంచుకొనదగినది. ఎందుకన ప్రతిమనుజుని గుణములు ఆచారములు, కార్యములును వాని శ్రద్ధననుసరించి యుండును. అనేక జన్మముల నుండి మనోవాక్కాయములచే వాఁడు చేసిన కర్మములన్నియు వాసనారూపముగ వానియంతః కరణము నందంటియుండు అతని చర్య యంతయు దానిననుసరించి యుం డును.

☞సాత్వికాది శ్రద్ధ నిరూపణము.

యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః. 4

తా. సాత్వికులు, దేవతలును; రాజసులు, యక్షరాక్షసులును; తామసులు, ప్రేతములును, భూతములను బూజించుచున్నారు.

☞అసురప్రకృతిగ నుండువారి లక్షణములు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
దమ్భాహంకారసంయుక్తాః కామరాగ బలాన్వితాః. 5

కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామమచేతసః,
మాం చైవాన్త శ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్. 6

తా. శాస్త్రవిరుద్ధమును, బాధకమగు తపస్సును ఏ మనుజులు డంబము, అహంకారము ననెడు గుణములతోగూడిన వారలగుచు అవివే

కము గలవారలై దేహమందలి పృథివ్యాది భూతములను అంతర్యామినై యున్న నన్నును ఉపవాసాదులచే గృశింపఁజేయుచు శాస్త్రవిహితము కాని ఘోరమగు తపస్సును జేయుదురో అట్టివారిని అసురప్రకృతి సంభూతులుగాఁ దెలియుము.

☞ఆహారపదార్థములు మూఁడు విధములు.

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞస్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు. 7

తా. ఎల్లప్రాణులకు, ఆహారపదార్థములు మూఁడు విధములుగ ప్రీతిగ నున్నవి. అట్లే యజ్ఞము, తపస్సు, దానము, మూఁడు విధములు, వాని భేదమును వివరించెద వినుము.

☞సాత్త్విక పురుషుల కిష్టమగు ఆహారము.

ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్విక ప్రియాః. 8

తా. ఆయువు, సత్త్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతిని వృద్ధిఁ బొందించునవియు, రసవంతములును, చమురు గలవియు, స్థిరమైనవియు, హృదయమున కింపైనవియునగు నాహారములు సాత్త్వికుల కిష్టము.

☞రాజస పురుషుల ఆహారము.

కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

తా. కారము, పులుపు, ఉప్పు, మిక్కిలి వేడి, ఘాటుగల పదార్థములు, చమురులేనివి, మిక్కిలి దాహముఁగలిగించునవి (1) దుఃఖము (2) శోకముఁ గలిగించునవి, నగు నాహారములును రజోగుణముఁ గలవారికి ప్రియములైయుండును.

(1) దుఃఖము–వెంటనేగలుగు బాధ, (2) శోకము=తినినపిమ్మట మనస్సునకుఁ గలుగు విచారము.

(వివరము) పై యాహారములవల్ల గలుగు ఫలమేమన, నానావిధ రోగములు దుఃఖములు.



☞తామస పురుషుల ఆహారము.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

తా. (వంటచేసిన పిదప) జాముకాలముపై చల్లారినదియు, సారము లేనిదియు, దుర్గంధమైనదియు, వండిపిమ్మట నొక రాత్రి గడచినదియు, ఒకరు తినగా మిగిలినవి, అపవిత్రమైనదియు నగు పదార్థములను తమో గుణముఁ గలవానికిష్టమైనవి.

☞శ్రద్ధాభేదమువలన యజ్ఞము మూఁడు విధములు.

అఫలాకాఙ్క్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11

తా. (1) యజ్ఞము చేయుటచే విధియని మనస్సును సమాధాన పరచుకొని ఫలాపేక్షలేక చేయునట్టి శాస్త్రసమ్మతమైన యజ్ఞము సాత్త్విక యజ్ఞమనఁబడును.

(1) యజ్ఞము చేయుట స్వధర్మముగనుక చేయవలయు. దానివలన ప్రతిఫలము గోరరాదు.

☞రాజస శ్రద్ధావంతుల యజ్ఞనిరూపణము.

అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

తా. భరతశ్రేష్ఠ ! ఫలము గోరికాని డాంభికమునకుఁ గాని చేయునట్టి యజ్ఞము రాజసయజ్ఞమని దెలియుము.

వివరము: అట్టి యజ్ఞము వలనఁ గలుగు ఫలము కర్తను బొందును. కొంతకాలమునకాఫలము నశించును. లోకమునకు దానివలన నించుకేని లాభముండదు. అందుచే భగవంతుఁడు సంతసించఁడు. అయ్యది కేవలము స్వార్థత్వమైనయది. భేదబుద్ధిని బలపరచునది. పరమాత్మయందైక్య భావము నకు ప్రత్యక్షవిరుద్ధమైనది.

☞తామస శ్రద్ధావంతుల యజ్ఞనిరూపణము.

విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

తా. అన్నదానము లేక, తగిన దక్షిణలియ్యక, అశాస్త్రీయముగను, మంత్రలోపముతోను, శ్రద్ధలేకను చేయునది తమోగుణ ప్రధానమగు యజ్ఞమని చెప్పదురు. అయ్యది కేవలము నిరర్థకమైనయది.

☞శారీరక తపోవర్ణనము.

దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

తా. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులును పూజించుటయు, శరీర పరిశుద్ధత్వముఁ గలిగియుండుటయు, సత్త్వవర్తనయు, స్త్రీ వాంఛను నియమించుటయు, ప్రాణిహింస చేయకుండుటయు ఇయ్యవి శరీర తపస్సని చెప్పఁబడుచున్నవి.

☞వాచిక తపోవర్ణనము.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.15

తా. ఇతరుల మనస్సును నొప్పింపనిదియు, ప్రియమైనదియు, మేలొనగూర్చునదియు, సత్యమైనదియు నగు సంభాషణమును, వేదముల నభ్యసించుటయు ఇయ్యవి వాక్కుతో జేయదగిన తపస్సు.

(వివరము) తపస్సు అన్నిటికంటె ముఖ్యమైనయది. వాఙ్నియమము గొప్ప సంపద, అయ్యది లభించినవానికి ముక్తిమార్గము సులభముగా నలవడును. మేలుగాని కీడుగాని శరీరముతో చేయుదానికంటె వాక్కుతో చేయునది బలిష్ఠమైనయది. వాగీంద్రియము జయించుట గష్టతరమైన యది. గావున శ్రద్ధచే సాధించవలెను.

☞మానసిక తపో వర్ణనము.

మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

తా. మనస్సును స్వచ్ఛముగ నుంచుకొనుట, క్రూరభావము లేకుండుట, వాఙ్నియమము, మనోనిగ్రహము, నిష్కపట స్వభావము, ఇవి మానసిక తపస్సని చెప్పఁబడుచున్నవి.



వివరము : (1) చిత్తశుద్ధివలన కలుగు ఫలము కామ క్రోధాదుల వలన చిత్తమునకుఁ గలిగిన మాలిన్యముఁ బోగొట్టుట.

(2) చిత్తైకాగ్రతవలన గలుగు ఫలము మనస్సుయొక్క చంచలత్వముఁబోగొట్టి ఏ వస్తువుపై నుంచినను అచట నుండి కదలక స్థిరముగ నిలచునట్లు నియమించుట.

(3) చిత్తశాన్తివలన గలుగు ఫలము సుఖదుఃఖాది ద్వంద్వముల వలన మనస్సుకు క్షోభగలుగనియ్యక సమత్వములోనుంచుట.

☞పై మూటలో నిష్కామ్యముగ జేయు తపస్సు సాత్త్వికము.

శ్రద్ధయా పరయా తప్తం తపస్త త్త్రివిధం నరైః,
అఫలాకాఙ్క్షి భిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

తా. ఇట్లు మూఁడు విధములైన తపస్సులో మిక్కిలి పరిశుద్ధమగు శ్రద్ధతోగూడి ఫలమును గోరక యేకాగ్రచిత్తముగలవారై చేసిన తపస్సు సాత్త్వికమందురు.

☞రాజస తపో నిరూపణము.

సత్కారమాన పూజార్థం తపో దమ్భేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్. 18

తా. సత్కారము, గౌరవము, పూజవీనికొఱకు డంభముచేఁజేయఁబడిన తపస్సు రాజసము, నాశమొందదగినది.చంచలమైనదని చెప్పఁబడు చున్నయది.

☞తామస తపో నిరూపణము.

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్.19

తా. తనకు దుఃఖముఁగలుగజేయునదియై ఇతర ప్రాణుల నొప్పించు నదియై దురాగ్రహముచేఁ జేయబడిన తపస్సు తమోగుణ సంబంధమైన యది.

☞దానత్రయ నిరూపణమున సాత్త్వికదానము.



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

**తా. (మనుష్యజన్మమెత్తినందులకు) దానముఁ జేయుటయే సార్థక మను బుద్ధితో ప్రత్యుపకారముఁ గోరక (దేశ-కాల-పాత్రములఁ గనిపెట్టి చేసెడు దానము సాత్త్వికదానమనఁబడును.)**

(1) దేశ-కాల-పాత్ర వివరము- 1. దేశమనగ=కురుక్షేత్రాది పుణ్యక్షేత్రములు 2. కాలమనగ=సంక్రాన్తి మొదలగు పుణ్యకాలములు 3. పాత్రమనగ=వేదవిదులు, పేదలులోనగు పుణ్యపురుషులు.

**వివరము: దానముతో సమానమగు సత్కార్యము వేఱొండు లేదు. "దానం యజ్ఞానాం వరూథం" అని శ్రుతి నుడువుచున్నది. ఒకరికిచ్చుటయే బంధవిమోచనమునకు మార్గము. ఒకరివలన నొక వస్తువును దీసికొనుటయే బంధహేతువు.**

☞ రాజసదాన నిరూపణ.

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. 21

**తా. ఎవనికి దానము చేయుదుమో వానివలనఁ బ్రత్యుపకార మపేక్షించిగాని దానివలన నీలోకముననైన పరలోకముననైన తనకొక లాభము కలుగవలయునను కోరికతోగాని మనః ఖేదముతోడ చేయు దానము రాజసదానమనబడును.**

**వివరము:- ఒకవస్తువు నొకరికిచ్చునపుడు వస్తువు పోవుచున్న దనెడు దుఃఖముగాని దానికి బదులు వేఱొకవస్తువు కావలయునను కోరికగాని యున్నయెడల నది యుత్తమదానము కానేరదు, ఆ వస్తువు నందలి యభిమానము బొత్తిగా త్యజించి సంతోషముతో నియ్యవలయు.**

☞ తామసదాన నిరూపణ.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృతమపజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. 22

**తా. దేశ,కాల,పాత్రముల గమనించక మర్యాదలేక సన్మానములేక వెట్టికి చేయుదానము తామసదానమని చెప్పఁబడును.**



☞ ఓంకారమునందుద్భవించినదేమన.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

**తా. బ్రహ్మ ఓంతత్ సత్ అను మూఁడు శబ్దములచే నిర్దేశింపఁబడుచున్నాఁడు. ఆ మూఁడు శబ్దములనుండియే బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవి. కావున సృష్టికంతకును "ఓం తత్సత్" యను సంకల్పము మూలముగ నున్నయది.**

☞ ఓంకారార్థ నిరూపణము.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః స్సతతం బ్రహ్మవాదినామ్. 24

**తా. కావున వేదాధ్యయన సంపన్నులగు వారెల్లప్పుడు శాస్త్రోక్తములగు యజ్ఞదాన తపస్సులును దామొనర్చు నప్పుఁడు "ఓమ్" అను బ్రణవ నామము నుచ్చరించుచున్నారు.**

☞ తత్ శబ్దార్థమును నిరూపించుట.

తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దాన క్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః. 25

**తా. అదేరీతిగ ముక్తిని నపేక్షించువారు శాస్త్రీయ రూపమగు యజ్ఞ దాన తపః కర్మలఁ దామొనర్చునప్పుడు "తత్" అను బ్రహ్మనామము నుచ్చరించి ఫలముఁగోఱక చేయుచున్నారు.**

☞ సత్ శబ్దార్థమును నిరూపించుట.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

**తా. పార్థ! సద్భావమందును, సాధుభావమందును, "సత్" అను పదము ప్రయోగింపఁబడును. మంగళప్రదమగు కర్మమునందును సత్ అను పదముఁ బ్రయోగింపఁబడుచున్నది.**

☞ మఱియు

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే,
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. 27

**తా. యజ్ఞ దాన తపః కర్మలయందుండు స్థితిని "సత్" అందురు. అయ్యవి నెరవేర్చుటకుఁ జేయు కర్మముకూడ సత్తనియే చెప్పఁబడుచున్నది.**

☞ అశ్రద్ధచే జేయు కర్మ ఫలహీనము.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్యనో ఇహ. 28

**తా. పార్థ ! అశ్రద్ధచేఁ జేయఁబడిన హోమము, దానము, తపస్సు, కర్మము ఇదియంతయు 'అసత్' అని చెప్పఁబడును. అవి ఇహమందును పరమందును సుఖకరములుగావు (గనుక ఏ కార్యములైననూ శ్రద్ధతో జేయవలయునుగాని అశ్రద్ధతోఁ జేయరాదు.)**

**వివరము:- ఇవ్విధముగ శ్రద్ధ సాత్త్విక రాజస తామసములని మూఁడు విధములైయున్నది. ప్రతి మనుష్యునికిని వాని శ్రద్ధకుఁదగిన యాహార పదార్థములయందభిరుచి కలిగించు చుండుననియు అతఁడు జేయు సమస్త కార్యములు నతని శ్రద్ధకు అనుగుణ్యముగ నుండును.**

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగ యోగోనామ
సప్తదశోఽధ్యాయః

**ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు శ్రద్ధాత్రయ విభాగ యోగ మును పదునేఁడవ యధ్యాయము ముగిసెను.**



# మోక్ష సన్యాస యోగము

## 18. అష్టాదశోఽధ్యాయః

**(ఈ అధ్యాయమున సన్యాసము త్యాగము అను శబ్దముల యొక్క అర్థము విశదీకరించబడి యున్నది.)**

☞ సన్యాసమును త్యాగమును వివరించునట్టి అర్జునుని 2 ప్రశ్నలు.

అర్జున ఉవాచ :

సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కే శినిషూదన. 1

**తా. అర్జునుఁడిట్లనెను - గొప్ప బాహువులుగల కృష్ణా ! కేశినిషూదన! సన్యాసమననేమి ? త్యాగమననేమి ? నేను తెలియగోరుచున్నాను కావున నారెండింటిని వేఱువేఱుగా నాకుఁజెప్పుము.**

శ్రీ భగవానువాచ :

☞ 1,2 ప్రశ్నలకుత్తరము.

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః. 2

**తా. భగవంతుడిట్లనెను - ఫలాపేక్షతోఁ జేయు కర్మముల విడుచుట సన్యాసమనియు, సర్వకర్మఫలము త్యజించుట త్యాగమనియు, పండితులుఁ జెప్పచున్నారు.**

(వివరము)

(1) సన్న్యాసి యేకార్యముఁజేయక గృహస్థులు సమర్పించెడి భిక్షల వలన దేహపోషణముజేసికొనుచు సర్వదా భగవన్నామస్మరణఁ జేసికొనుచు ఊరక కూర్చుండ వలసిన వాఁడుకాదు.

(2) తక్కిన అన్ని యాశ్రమములవారు చేసెడి పనికంటె నధికముగ పనిచేయువలెనని దెలియవలె.

(3) ఎట్లన ? నావారు,పరులు అనెడు భేదదృష్టిని వదలి లోకములో నెల్లవారి మేలుకొఱకు సర్వదా పాటుపడవలెను.

(4) మఱియు సన్న్యాసికి సంసారచింతగాని ఉదరపోషణ విచారముఁ గాని లేదు. గాన తన యావజ్జీవితము యావచ్ఛక్తియు, పరోపకారమునకై వినియోగించి లోకసేవఁజేయవలయునేగాని, కర్మత్యాగముఁజేయు గూడదు. కర్మఫలత్యాగ మొనర్పవలయు, సర్వప్రయోజనత్వము వదలి లోకోపకారా ర్థమై పనిచేయుటయే సన్న్యాసి ధర్మము. సన్న్యాసి సర్వకర్మ పరిత్యాగము చేయవలయునని మాత్రము శాస్త్రములు బోధించుటలేదు. సర్వసంగ పరి త్యాగము చేయవలెనని మాత్రము బోధించుచున్నవి.

(5) సంగములు రెండు విధములు. కర్మసంగము, ఫలసంగమునని, సన్న్యాసి ఈ రెంటిని వదలి ఈశ్వరార్పణ బుద్ధితోఁ గర్మ చేయవలయు.

☞ కర్మ త్యాగమునందు వాదుల విషయము

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే. 3

తా. కొందఱు పండితులు (సాంఖ్యులు) కర్మలు దోషయుక్తములుఁ గావున వదలవలయునని చెప్పుదురు. కొందరు (మీమాంసకులు) యజ్ఞ దానాది కర్మలను వదలగూడదని పలుకుచున్నారు.

☞ కర్మత్యాగ విషయమున భగవన్ముని నిశ్చయము.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః. 4



తా. భరతసత్తమా ! పురుషవ్యాఘ్ర ఈ త్యాగము విషయమై నా నిశ్చయము వినుము. కర్మత్యాగము, కర్మ ఫలత్యాగము, కర్తృత్వ త్యాగ మని మూఁడు విధములుగాఁ చెప్పఁబడుచున్నయది.

☞ యజ్ఞదాన తపములచే చిత్తశుద్ధియగు.

యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5

తా. యజ్ఞదాన తపోరూపకమగు కర్మ అవశ్యముగాఁ జేయదగినవి. దానిని విడువరాదు. ఎందుకనగ? యజ్ఞ దాన తపఃకర్మలు పండితులకు చిత్త శుద్ధిని కలిగించును.

☞ పూర్వోక్త కర్మత్యాగమున భగవన్ముని స్వనిశ్చయము.

ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్. 6

తా. పార్థ ! ఈ యజ్ఞదాన తపఃకర్మనుగూడ మమత్వమును ఫల కాంక్షను విడిచి, తనకు విధియని తలచి చేయుట యుక్తమని నా నిశ్చయ మగు నుత్తమాభిప్రాయము.

(వివరము) యజ్ఞదాన తపములు పరమపావనములైన కర్మలు. యజ్ఞ మనఁగ నీశ్వరునారాధించుట. దానమనఁగ భూతకోట్ల నుపచరించుట. తపస్సనఁగ తన దేహేంద్రియ మనస్సుల మాలిన్యముఁ బోగొట్టి పరిశుద్ధములుగ జేసికొనుట. ఈ మూటికి మించిన ధర్మము వేరొకటి లేదు. అన్ని యాశ్రమములవారు నీ మూఁడు కర్మములు చేయవలయుననే గాని ఎవరును విడువరాదు.

☞ తామస త్యాగ నిరూపణము.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. 7

తా. వేదోక్త మగు నిత్యనైమిత్తిక కర్మలను వదలరాదు. అలాగు అజ్ఞానముచే వదలుట తామస త్యాగమని తెలియు.

☞ రాజస త్యాగ నిరూపణము.



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవత్యాగఫలం లభేత్. 8

**తా. ఎవఁడు దుఃఖమని దెలిసి శరీరము కష్టపడునను భయముచే నిత్యకర్మ (సంధ్యావందనాదు) లను విడుచునో అట్టివాఁడు రాజస త్యాగ మును గావించుచున్నవాడై త్యాగమునకుఁ జెప్పఁబడిన శాంతిరూపమగు గొప్ప ఫలితమును బొందజాలఁడు.**

☞ సాత్త్విక త్యాగ స్వరూపము.

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియఽతేర్జున,
సఙ్గం త్యక్త్వా ఫలంచైవ స త్యాగస్సాత్త్వికో మతః. 9

**తా. అర్జున! ఆసక్తిని ఫలమును వదలి (1) నిత్యకర్మ లావశ్యకంబని ఎవఁడు చేయుచున్నాఁడో, అట్టివాని త్యాగము సాత్త్విక త్యాగమని ఎఱుంగుము.**

(1) నిత్యకర్మయనగ = సంధ్యావందనాది క్రియలు.

☞ సాత్త్విక త్యాగఫలము.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్న సంశయః. 10

**తా. సాత్త్విక త్యాగము గల యాత్మజ్ఞాని సంశయము మాని సుఖ దుఃఖకరములైన నిత్యనైమిత్తిక కర్మలయందు సంగము గలిగియుండడు.**

☞ కర్మఫలత్యాగముఁ జేయువాఁడు త్యాగి.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్య శేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే. 11

**తా. దేహధారులన్నికర్మలను వదలలేరు. ఎవఁడు కర్మలనుచేసి ఫలములను త్యజించుచున్నాఁడో, వాడు త్యాగి యనబడును.**

**(వివరము) ఎందుకనగ ప్రతికార్యమునకుఁ దగిన ఫలముండును. ఆ ఫలము నాకే కావలయునని యపేక్షించక పరోపకారమునకై అర్పణము చేయుటయే త్యాగము.**



☞ కర్మఫలము మూఁడు విధములు.

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్య త్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. 12

**తా. లోకములోఁ గర్మఫల త్యాగము నొనర్పని వారి కెల్లదాము చేసిన కర్మల ఫలితము. మరణించిన తరువాత దుఃఖరూపముగా నరకము నందును, సుఖరూపముగా స్వర్గము నందును, సుఖదుఃఖ మిశ్రమముగా మఱల భూలోకమందును, నిట్లు మూడు విధములుగా ననుభవింపఁబడు చుండుట శాస్త్రసమ్మతమైయున్నయది. కర్మఫల త్యాగులను వారట్టిది నెన్నఁడును అనుభవింపఁబడుటలేదు.**

☞ కర్మసిద్ధికి నైదు కారణములు.

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

**తా. మహాబాహో ! వేదాన్తమునందెల్ల కర్మల సిద్ధికొఱకుఁ జెప్పి యుండు నయిదు హేతువులనునీకుఁ జెప్పెద వినుము.**



☞ అధిష్ఠానాది పంచకారణముల స్వరూపము.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్. 14

**తా. శరీరము, అహంకారము, నానావిధములగు చక్షురాదీ నింద్రియములు, వివిధములగు ప్రాణాపానాదుల వ్యాపారములు, దైవము అనునవి.**

☞ శుభాశుభ కర్మలకు యధిష్ఠానాదులే కారణము.

శరీరవాఙ్మనోభిర్య త్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః. 15

**తా. మనుష్యుఁడు శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను చేయునట్టి మంచి కర్మలకును చెడు కర్మలకును పైన చెప్పఁబడిన యధిష్ఠా నాదులైదును కారణములు.**

☞ ఆత్మను కర్తగాఁ దెలియువాఁడు యజ్ఞాని.

**తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,**
**పశ్యత్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. 16**

**తా. ప్రతికర్మకుఁ గారణములు పైఁజెప్పినట్లైదుండగా, నెవఁడు కర్మకుఁ దానే (1) కర్తనని తలఁచుచున్నాఁడో నతఁడు తెలివిగలవాఁడు కాఁజాలఁడు. అట్టి యజ్ఞానియాత్మ తత్త్వముఁ దెలియలేఁడు.**

(1) జీవుని కర్తృత్వము పరమాత్మయొక్క యనుమతినిబట్టి జఱుగుచుండ. ఆ కర్మయందొక్క యాత్మనే కర్తగ నెంచువాఁడు తత్వరహస్యముఁ దెలియనివాఁడు.

☞మమకార రహితునకు కర్మయంటదు.

**యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,**
**హత్వాఽపి స ఇమాన్ లోకాన్న హన్తి న నిబధ్యతే. 17**

**తా. ఎవనికి నేను చేయుచున్నానను భావములేదో, ఎవని బుద్ధి ఆ కర్మఫలముచే నంటపడదో అట్టివాఁడు లోకమందలి ప్రాణులను (లౌకిక దృష్టిచే) చంపినవాడయ్యును. పరమార్థ దృష్టిచే నాతఁడు చంపువాఁడు కాడు. కర్మలచే బంధింపఁబడువాఁడును కాడు.**

☞కర్మప్రేరకము మఱియు కర్మాశ్రయ స్వరూపము.

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18**

**తా. కర్మోపదేశము మూఁడు విధములు. కర్మమూఁడు విధములు.**

**అవి యేవియన వరుసగా :**

| | |
|---|---|
| **1. జ్ఞానము** | **1. కరణమని** |
| **2. జ్ఞానమువల్లఁ దెలియఁదగిన విషయము** | **2. కర్మయని** |
| **3. జ్ఞానము గలవాఁడు.** | **3. కర్తయని** |

(1) కరణమనగ=కర్మకు వలయుపదార్థములు (2) కర్మయనగ=చేయుట (3) కర్తయనగ =చేయువాడు.

☞సాత్వికాది గుణభేదములచే కర్మ మూఁడు విధములు.

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి. 19**



**తా.సాంఖ్యములోఁ జెప్పఁబడినట్లు (సత్వరజస్తమో) గుణభేదములచే జ్ఞానము, కర్మ, కర్తయనునవి యొకటొకటి మూఁడు మూఁడు విధములుగ దెల్పినవి.వాటిని నీకుఁ జెప్పెద సావధానముగ వినుము.**

☞సాత్వికజ్ఞాన నిరూపణము.

**సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,**
**అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20**

**తా. సమస్త భూతములును బాహ్యదృష్టికి వేఱ్వేఱుగ కనబడుచున్నను అందున్న నాశరహితమగు నైక్యభావమొక్కటే యని దెలియుజ్ఞానము సాత్వికమని యెఱుఁగుము.**

**(వివరము) ఇదియే యథార్థజ్ఞానము. ఈశ్వరుఁడొక్కడే స్థావర జంగమాత్మకమగు ప్రపంచరూపముగ ప్రకాశించుచున్నాఁడు. భగవన్మయముగాని వస్తు వణుమాత్రమైనను లేదు. సర్వభూతములయందుండు చైతన్యము భగవచ్చైతన్యమేగాని వేరుగాదు.**

☞రాజస జ్ఞాననిరూపణము.

**పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,**
**వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21**

**తా. సమస్త భూతములందును వేఱ్వేఱుగ దోచు భావములను బాహ్య దృష్టికి గోచరించునట్లే యాంతర్యము నందుఁగూడ వేఱ్వేఱుగానే యే జ్ఞానముచేఁ దెలిసికొనుచున్నాఁడో యట్టిది రాజసజ్ఞానమని దెలియును.**

☞తామస జ్ఞాన నిరూపణము

**యత్తు కృత్స్నవదేకస్మి న్కార్యే సక్తమహైతుకమ్,**
**అతత్త్వార్థవదల్పం చ తత్తామస ముదాహృతమ్. 22**

**తా. ఏ జ్ఞానము సమస్తమునందువలెనే (ఆత్మను విగ్రహాది పదార్థముగ భావించుటయందే యలవడినట్టిదై) యుక్తమునైయున్నదో అయ్యది తామసజ్ఞానమని చెప్పఁబడుచున్నది.**

☞సాత్విక కర్మ వర్ణన

నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునాకర్మ యత్తత్సాత్త్వికముచ్యతే. 23

తా. తనకు విధించఁబడియుండు కార్యమును తాను కర్తయను అభిమానములేకను, రాగద్వేషములు లేకను, ఫలాపేక్షలేకను, నియమము చేత స్వధర్మానుసారముగఁ చేయబడు కర్మ సాత్త్వికకర్మ యనబడును.

☞రాజస కర్మ నిరూపణము.

యత్తు కామేప్సునాకర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

తా. ఎవఁడు కోరికలు గలిగి యహంకారముతోఁ గూడుకొని మిగుల కష్టమునిచ్చుకర్మను చేయుచున్నాఁడో అట్టివాడు చేయుకర్మ రాజసమని చెప్పఁబడెను.

☞రాజస కర్మ నిరూపణము.

అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహాదారభ్యతేకర్మ యత్తత్తామస ముచ్యతే. 25

తా. ముందు రాబోవు మంచిచెడ్డలను (ధనాదులయొక్క) నాశమును, (ఇతరులకు గలిగెడి) హింసను, తనసామర్థ్యమును ఆలోచింపక మోహము వలన నారంభింపఁబడు కర్మకు తామసకర్మమని చెప్పఁబడుచున్నది.

☞సాత్త్విక కర్త స్వరూపము.

ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

తా. ఫలాపేక్ష లేక తాను గర్తయను అభిమానము లేక కార్యము సిద్ధించినను సిద్ధించక పోయిననూ మనస్సున వికారము జెందక సమబుద్ధి గలవాఁడై ధైర్యోత్సాహములు వదలక పనిచేయువాఁడు సాత్త్వికకర్త యన బడును.

(వివరము) కర్మయోగముయొక్క రహస్యమంతయు ఈ శ్లోకమందుపదేశింపఁ బడినది. దీనియొక్క సంపూర్ణ భావము అనుభవైకవేద్యము.



☞రాజస కర్త స్వరూపము.

రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

తా. పుత్రాది ప్రేమగలవాఁడు, కర్మఫలమును గోఱువాఁడు, పరధనాభిలాష, హింసించు స్వభావముగలవాఁడు, అంతర్బహిశ్శుచత్వము లేనివాఁడు, సంతోషము దుఃఖములను బొందువాఁడునునగుకర్త రాజసుఁడని చెప్ప బడుచున్నాఁడు.

☞తామస కర్త స్వరూపము.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

తా. మనస్థైర్యము లేక యవివేకుఁడై, నమ్రతలేనివాఁడై, మోసబుద్ధి గలవాఁడై, ఇతరుల జీవనమును చెడుపుటయందాసక్తుఁడై, సోమరియై, ఎల్లపుడును వ్యసనశీలుఁడై, చురుకుదనము లేనివాఁడైయుండు కర్త తామసుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

☞గుణభేదములచే బుద్ధి మూఁడు విధములు.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు,
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ. 29

తా. ధనంజయ! గుణములనుబట్టి బుద్ధి, ధైర్యము మూఁడేసి విధములు. వేర్వేరుగ జెప్పెద వినుము.

☞సాత్త్విక బుద్ధి స్వరూపము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ. 30

తా. మంచి చెడుగులను తెలిసికొని సంసార నివృత్తియు, మోక్ష ప్రవృత్తియు గల బుద్ధి సాత్త్వికబుద్ధి యనబడును.

☞రాజసబుద్ధి స్వరూపము.

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్య మేవ చ,
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ. 31

తా. పార్థ ! దేనిచే ధర్మముగాని, అధర్మముగాని తాను చేయఁదగు కార్యముగాని, అకార్యముగాని నిజముగాఁ దెలియడో అట్టిది రాజసబుద్ధి.

☞తామస బుద్ధి స్వరూపము.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా,
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ. 32

తా. పార్థ! ధర్మము నధర్మముగాను, అధర్మము ధర్మముగాను అన్ని విషయములలోను ప్రతికూలముగ గ్రహించు బుద్ధి తామసికము (అనగ దేహమే ఆత్మయనుకొనుట.)

☞సాత్విక ధైర్య స్వరూపము.

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ. 33

తా. పార్థ! ఎవఁడైతే మనస్సు ప్రాణములు, ఇంద్రియములు, వీటి యొక్క వ్యాపారములను (విషయములందు ప్రవర్తించినట్లు) నిశ్చలముగ యోగముచే నియమించునో వాని ధైర్యము సాత్త్వికము.

☞రాజస ధైర్య స్వరూపము.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతిస్సా పార్థ రాజసీ. 34

తా.అర్జున ! ఎవఁడు ఫలాపేక్షతో మోక్షము మాట దలపక ధర్మార్థ కామములనెడు త్రివిధ పురుషార్థములను సర్వదా కోఱుచున్నాఁడో, పార్థ! వాని ధైర్యము రాజసధైర్యము.

☞తామస ధైర్య స్వరూపము.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ. 35

తా. పార్థ! ఎవఁడు దుర్బుద్ధి గలవాఁడై నిద్ర, భయము,శోకము, విషాదము, మదము, దుఃఖములయందు విడనాడక యుండునో ఆ ధైర్యము తమోగుణప్రధానమైనయది.

☞సుఖము మూఁడు విధములు



సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి. 36
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్. 37

తా. భరతర్షభ! సుఖములు మూఁడు విధములు చెప్పెదవినుము. అభ్యాసము చేయుకొలది ఆనందమనుభవించుచు తుదకు దుఃఖనాశమేది జేయునో, ఏ సుఖము ప్రారంభమున విషముగ నుండి పరిణామమని అమృత తుల్యమై యుండునో దేనిచేత మనస్సుకు విశ్రాంతి గల్గునో అయ్యది సాత్వికసుఖమని చెప్పఁబడును.

(వివరము) మంచికార్యము చేయునపుడు ఆదియందు గష్టముగ దోచును. పట్టుదలతో చేయఁగ చేయఁగ మనస్సుకు సంతోషముగ నుం డును. కార్యాంతమున నపరిమితానందము గలుగును. ఇయ్యది అనుభవ సిద్ధాన్తము.

☞రాజస సుఖ స్వరూపము

విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్.38

తా. విషయములకును, ఇంద్రియములకును సంయోగము గలుగుటచే లభించు సుఖమెద్దియో అయ్యది ప్రారంభమున అమృతప్రాయముగ నుండి అంత్యమున విషతుల్యముగ పరిణమించి దుఃఖకారణమగును. ఇది రాజస సుఖలక్షణము.

(వివరము) ఇతర వస్తువుల వలనఁ గలిగెడు సుఖము గడపట దుఃఖమును గలుగజేయును. అన్యపదార్థాపేక్షలేక ఆత్మవలనఁ గలిగెడు సుఖము శాశ్వతమైయుండు. (ఏలయనగ) ఆత్మసుఖ స్వరూపమైనది. ఆ సుఖ స్వరూపము ఎప్పుడును ఆత్మను విడిచిపోదు.

☞తామస సుఖ స్వరూపము.

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్. 39



ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి.

**తా. ఏది ఆరంభమునందును, అంత్యమునందును ఆత్మను మోహ పెట్టుచుండునో ఆ సుఖము తామస సుఖము అయ్యెది. నిద్రవలన, ప్రమాదము వలనను బుట్టును.**

☞త్రిగుణములకు లోబడినవాఁడు మూఁడు లోకములలో లేఁడు.

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః. 40

**తా. ప్రకృతిచేఁ జనించిన ఈ సత్త్వాది గుణములకు లోఁబడని ప్రాణి మానుషలోకమందు గాని, దేవలోకమందు గాని, పాతాళలోకమందు గాని లేఁడు.**

☞బ్రాహ్మణాది నాలుగు వర్ణముల కర్మములు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః. 41

**తా. పరంతప! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు కర్మములు స్వభావమునుండి పుట్టిన గుణములచే విభజింపఁబడినవి.**

☞బ్రాహ్మణ కర్మ నిరూపణము.

శమోదమస్తపః శౌచం క్షాన్తిరార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజపమ్. 42

**తా. (1) శమము (2) దమము, తపస్సు, శౌచము, క్షమ, ఋజుత్వము, జ్ఞానము (3) విజ్ఞానము ఈశ్వరుఁడు గలడను నమ్మకము ఇవి బ్రాహ్మణులకు స్వభావములగు కర్మములు.**

(1) శమ=యనగ అంతరింద్రియ నిగ్రహము (2) దమ = యనగ బహిరింద్రియ నిగ్రహము (3) విజ్ఞానము = యనగ అనుభవ జ్ఞానము.

☞ క్షత్రియ కర్మ నిరూపణము

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనమ్,
దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మస్వభావజమ్. 43

**తా. శూరత్వము, పరాక్రమము, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమున వెనుదీయకుండుట, దాతృత్వము, పరిపాలనా శక్తియనునవి క్షత్రియునకు స్వభావమయిన కర్మములు.**



☞వైశ్య, శూద్ర కర్మ నిరూపణము.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

**తా. వ్యవసాయము, పశుసంరక్షణము, వ్యాపారము, ఇవి వైశ్యుల స్వభావ కర్మములు, పరిచర్యచేయుట శూద్రుల భావము.**

☞తమ తమ కర్మచేతనే సిద్ధియగు

స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మ నిరతస్సిద్ధిం యథా విన్దతి త చ్ఛృణు. 45

**తా. ప్రతివాఁడును కర్మములయందాసక్తి గలవాఁడయినచో జ్ఞానయోగ్యుఁ డగును. తన కర్మమును విడువకుండువాడు సిద్ధినెట్లు బొందుచున్నాడో వినుము.**

☞పరమాత్మను స్వకర్మచే బూజించువాఁడు సిద్ధిని బొందు.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః 46

**తా. సర్వభూతములకుఁ బుట్టుక మొదలగు వ్యాపార మెవ్వనివలనఁ గలుగుచున్నదో, ఏ పరమాత్మ ఈ ప్రపంచమంతటను నిండియున్నాఁడో అట్టి పరమాత్మను స్వకర్మచే బూజించు మానవుఁడు సిద్ధిబొందును.**

**(వివరము) అనగ మనుజుఁడు తనకు నియమించబడిన కార్యములను భక్తిశ్రద్ధలతో నెఱవేర్చి భగవంతున కర్పణచేయుటచే ఈశ్వరపూజ.**

☞ స్వధర్మానుష్ఠానమే శ్రేష్ఠము.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 47

**తా. తన ధర్మమును విడిచి పరధర్మమును దానెంత బాగుగ నాచరించి నను పాపము దప్పదు. స్వధర్మానుష్ఠాన పరునకు దోషము లంటవు.**

**(వివరము) (ఎట్లన విషములో పుట్టిన జంతువునకు విషబాధ లేనట్లు నీటిలోఁ బుట్టిన తామరకు నీరంటనట్లు.)**

☞దోషయుక్తమైననూ స్వధర్మము విడువరాదు.

సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్,
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః. 48

తా. కౌన్తేయ! దోషముతోఁ గూడినవైనను సహజమగు కర్మములను విడువరాదు. (ఎందుచేననగ) అగ్నిని పొగకప్పినరీతిని నెల్లకర్మములు దోష ములచే నావరింపఁబడియేయున్నవి.

☞నైష్కర్మ్య సిద్ధి బొందువాని లక్షణము.

అసక్త బుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి. 49

తా. సర్వ విషయములందును మమకారములేక అంతఃకరణమును జయించి దేనియందును కోర్కె లేనివాఁడు సన్న్యాసముచేత పవిత్రమగు నైష్కర్మ్యసిద్ధినిఁ బొందుచున్నాఁడు.

☞జ్ఞాన స్థానక్రమ నిరూపణము.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధమే,
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

తా. కౌన్తేయ ! (1) సిద్ధిని బొందినవాఁడు బ్రహ్మమును బొందు విధమును ఉత్కృష్టమగు జ్ఞాననిష్ఠాప్రకారమును సంక్షేపముగ జెప్పెద వినుము.

(1) సిద్ధియనగ=జ్ఞాననిష్ఠా ప్రాప్తికి సాధనమగు స్వకర్మ.

☞జ్ఞానమునకు సమీపవర్తియగు సాధనములు.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

వివిక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే. 53



తా. పరిశుద్ధమగు బుద్ధితోగూడినవాఁడై ధైర్యముతో మనస్సును నిగ్రహించి శబ్దాది విషయములందు విరక్తుఁడై రాగద్వేషములను విడిచి, ఏకాన్తస్థలవాసియై మితాహారుడగుచు శరీర వాఙ్మనంబుల స్వాధీన పరచుకొని, ఇహపరభోగములందాశలేనివాఁడై నిత్యమును ధ్యాన యోగాభ్యాస మొనర్చుచు, అహంకారము, బలము, డంబము, కామము, క్రోధము, ద్రవ్య సంపాదనము ననువానిని విడిచి మమకారము లేక శాన్తస్వభావము గల పురుషుఁడు బ్రహ్మభావమును పొందుటకు సమర్థుఁ డగుచున్నాడు.

☞బ్రహ్మనిష్ఠుని లక్షణము.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

తా. బ్రహ్మనిష్ఠుఁడైనవాఁడు నిర్మలమగు మనస్సుగల వాఁడైయుండు (ఏ వస్తువునుగూర్చి) దుఃఖించడు, (ఏ వస్తువులను) గోఱడు, సర్వభూతముల యందు సముఁడైయుండును. అట్టివానికి శ్రేష్ఠమైన భక్తి లభించును. అట్టి భక్తిచే ముక్తి లభించును.

భక్త్యా మామభిజానాతి యావన్యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్. 55

తా. భక్తిచేత నేనెంతటివాఁడనో, ఎట్టివాడనో యనుదాని యథార్థ ముగాఁ దెలిసికొనును. అట్లు నన్ను వాస్తవముగాఁ దెలిసికొని తరువా నాయందుఁ బ్రవేశించును.

☞నన్నాశ్రయించినవానికి ముక్తి.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్. 56

తా. నిరంతరము సర్వకర్మములను చేయుచున్నవాఁడైననూ, నన్నా శ్రయించినవాఁడు నా యనుగ్రహమువలన నాశరహితమగు మోక్షస్థాన మును బొందుచున్నాఁడు.

☞నాయందే చిత్తమునుంచుము.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. **57**

**తా.(కావున) సర్వకర్మములను మనస్సుచేత నాయందుంచి బుద్ధియోగము నవలంబించి ఎల్లపుడు నాయందే చిత్తము గలవాఁడగుము.**

మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. **58**

**తా. నాయందు చిత్తము గలవాఁడవై యుంటివేని నా యనుగ్రహము వలన సర్వ దుఃఖములను దాటగలవు. "నేనే తెలిసినవాడ"ననెడి అహం కారముచేత నేను జెప్పినమాటలనువినవేని చెడిపోదువు.**

☞దురహంకారపౌరుష నిరూపణము.

యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. **59**

**తా. అహంకారముచే నేను యుద్ధముఁ జేయునని నీవు నిశ్చయించి నను ఆ నిశ్చయము వ్యర్థమగును. నీ క్షత్రియ స్వభావమే నిన్ను యుద్ధము చేయునట్లు నియోగించును.**

☞నీ స్వభావమే కర్మను జేయించు.

స్వభావజేన కౌన్తేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్యవశోఽపి తత్. **60**

**తా. కౌన్తేయ! స్వభావజన్య గుణములకు లోఁబడిన నీవు ఎట్టి కర్మ చేయుఁగూడదని అవివేకముచేత నిశ్చయించెదవో, అట్టి కర్మ నీకు తెలియకయే నీ స్వభావగుణము నిన్నుమరపుఁ జేసి నీచేఁ జేయించును.**

☞పరమాత్మ అందరియందున్న వాఁడు.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా. **61**

**తా. సర్వభూతముల హృదయమందు నీశ్వరుఁడున్నవాఁడై యంత్రగాడు కీలుబొమ్మలఁ ద్రిప్పినట్లు తన మాయచేత సమస్త భూతముల నాడించు చున్నాఁడు.**



☞గాన ఈశ్వరుని శరణు బొందుము.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. **62**

**తా. భారత ! ఆ ఈశ్వరునే సర్వభావముచేతను శరణు బొందుము. ఈశ్వరానుగ్రహమువలననుత్తమమగు శాంతిని బొందగలవు. పునరావృత్తి రహితమైన ముక్తినిగూడఁ బొందగలవు.**

☞తాను జెప్పిన రహస్యజ్ఞాన సమాప్తి విషయము.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. **63**

**తా. ఇట్లు రహస్యములలో పరమ రహస్యమగు జ్ఞానము నీకుఁ దెలిపితిని. ఇదంతయు బాగుగ నాలోచించుకొని నీకుఁ దోఁచినట్లు జేయుము.**

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. **64**

**తా. నీవు నాకు మిక్కిలి ప్రియుఁడవు కావున నీ క్షేమము కొఱకు మఱియొక రహస్యమైన మాటఁ జెప్పెద వినుము.**

☞ప్రమాణపూర్వకముగ హితోపదేశము.

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. **65**

**తా. నాయందే చిత్తముంచుము, నన్నే సేవింపుము, నన్నే పూజింపుము, నాకే నమస్కరింపుము. అట్లు చేసితివేని నన్నే పొందెదవని ఇష్టుడవగు నీకు సత్యప్రతిజ్ఞను చేసి చెప్పుచున్నాను.**

☞గీతా శిఖారత్నము.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః. **66**

**తా. సర్వ ధర్మములను విడనాడి నన్నొక్కనినే శరణు పొందుము. నేను నిన్నన్ని పాపములనుండి విడిపించెదను. శోకింపుకుము.**

(వివరము) దీనిసారమే మన ఇతరచింతలు, ఇతర ఆశలు, ఇతర ఉద్దేశములు, ఇతరఉపాయములు నేమియులేక అన్నియువదలి ఈశ్వరుఁడే దిక్కని నిశ్చయముగ నమ్మి ఆయన సంకల్పము నెఱుగుట కును, దానిని నెఱవేర్చుటకును త్రికరణ శుద్ధిగఁ బ్రవర్తించువాని సర్వ పాపములను జగదీశ్వరుఁడు హరించి ముక్తిని ప్రసాదించునని దెలియఁదగినది.

☞ గీతోపదేశమునకు అనధికారి లక్షణము.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

తా. దీనిని ఆత్మ నిగ్రహములేనివానికిని, భక్తిలేనివానికిని, భగవత్సేవయు లోకసేవయు లేనివానికిని, విననభిలాషలేనివానికిని, నాయందసూయపడువానికిని చెప్పవలదు.

☞ గీతనుపదేశించువానికి ఫలము.

య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయ. 68

తా. అతి రహస్యమగు ఈ గీతశాస్త్రమును నా భక్తులకెవఁడు చెప్పునో నతఁడు నాయందు శ్రేష్ఠమైన భక్తిగలవాఁడై సమస్త సందేహములను నివర్తి చేసికొని నన్నేపొందగలఁడు.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి. 69

తా. మనుష్యులలో నా భక్తులకు గీతార్థమును జెప్పువానికంటె నితరుఁడు నాకు మిక్కిలి ప్రియము చేయువాఁడు లేఁడు. ఈ భూమియందు వానికంటె నన్యుఁడు అధికప్రియుఁడు కలుగఁబోఁడు.

☞ గీతను పఠించువాని ఫలము.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః. 70

తా. ధర్మసంబంధమగు మన ఇద్దరియొక్క సంవాద రూపమగు నీ గీతాశాస్త్రము నెవ్వడు చదువునో యట్టి పాఠకుఁడు జ్ఞానయజ్ఞముచే నన్ను పూజించువాడని నా నిశ్చయము.



☞ గీతను వినువానిఫలము.

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః,
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్.

తా. ఎవఁడు అసూయలేక భక్తిశ్రద్ధలతో నీ గీతాశాస్త్రమును (1) వినునో, యతఁడు పాపరహితుఁడై యజ్ఞయాగాది కర్మములుజేసిన పుణ్యాత్ములు బొందు స్వర్గాది పుణ్యలోకములు బొందును.

(1) వినుటయనగ=తెలిసికొని యా ప్రకారమనుష్ఠించవలెనని దెలియఁదగినది.

☞ అర్జునునితో కృష్ణుని ప్రశ్న.

కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రనష్టస్తే ధనంజయ. 72

తా. పార్థ ! నా యుపదేశమును నీ వేకాగ్ర బుద్ధితో వింటివా? ధనంజయ! అజ్ఞానమువలనఁ బుట్టిన నీ మోహమంతయుఁ బోయినదా?

అర్జున ఉవాచ :

☞ అజ్ఞానము నశించిన యర్జునుని విజ్ఞాపన.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. 73

తా. అర్జునుఁడిట్లనెను-అచ్యుత ! నీ యనుగ్రహముచేత నాయొక్క అజ్ఞానమంతయు నశించెను. జ్ఞానము గలిగెను, సందేహము నివర్తించెను. నీ యాజ్ఞనుశిరసా వహించుటకు సిద్ధముగనున్నాను.

సంజయ ఉవాచ :

☞ సంజయుఁడు కృష్ణార్జునుల సంవాదమును స్తుతించుట.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
సంవాదమిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. 74

తా. ఇట్లు నేను అద్భుతమై గగుర్పాటు గలుగఁజేయునదియు నగు మహాత్ములైన కృష్ణార్జునుల సంవాదమువింటిని.

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్. 75

తా. వ్యాసమహర్షి ఇచ్చిన దూరదృష్టి, దూరశ్రవణముచే నీ పరమ రహస్యమైన ఈ యోగశాస్త్రమును భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు స్వయముగ (నర్జునునకు) చెప్పచుండవింటిని.

☞సంజయుని సంతోష నిరూపణము.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః.

తా. ధృతరాష్ట్రరాజ ! ఈ పుణ్యకరమగు శ్రీకృష్ణార్జునుల అద్భుత సంవాదమును స్మరించి, స్మరించి మాటి మాటికిని సంతసించుచున్నాను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః.

తా. రాజా! ఇదియుగాక అత్యద్భుతమైన భగవంతుని యా విశ్వ రూపము మిక్కిలి యాశ్చర్యమైన నాకు మాటిమాటికి దలపునకు వచ్చు చుండును. అట్లు తలచినపుడెల్ల నాకు మిక్కిలి వింతలు గలుగుచుండుటే గాక మఱల మఱల సంతసించుచున్నాను.

☞సంజయుని నిశ్చయోక్తి.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ. 78

తా. యిచ్చట యోగీశ్వరుఁడగు శ్రీకృష్ణ భగవానుఁడును, యచ్చట గాండీవధారియగు నర్జునుఁడును నుందురో అచ్చట లక్ష్మీ, జయము, ఐశ్వర్యము స్థిరమగు నీతినుండునని నా నిశ్చయము.

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసన్యాస యోగోనామ అష్టాదశోఽధ్యాయః

ఇది యుపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదమును నగు భగవద్గీతలందు మోక్ష సన్యాస
యోగమును పదునెనిమిదవ యధ్యాయము ముగిసెను.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు శ్రీ వాసుదేవార్పణమస్తు



# శ్రీ పద్మ పురాణాంతర్గత
# శ్రీ భగవద్గీత పారాయణ ఫలితములు

## మొదటి అధ్యాయ పారాయణ ఫలం

శ్లో॥ తస్మాధధ్యాయమాద్యం యఃపఠేత్ శ్రుణుతేస్మరేత్
అభ్యసేత్తస్యనభవేత్ - భవాంభోధి ర్దురుత్తరః

పూర్వకాలంలో సుశర్మ అను అతడు అన్నివిధాలా పతితుడై చని పోయిన తరువాత నరక యాతనలనుభవించి తరువాత ఎద్దుగా పుట్టాడు. అది పర్వత ప్రాంతంలో యెక్కువ బరువు మోయలేక చనిపోయే స్థితిలో వుంది. ఆ సమయంలో ఆ మార్గాన పోతున్న ఒకవేశ్య జాలిపడి నేను పూర్వము చేసిన పుణ్యమేమున్నా యీ యెద్దుకది సంక్రమించుగాక! అని హృదయపూర్వకంగా స్మరించింది. ఆ యెద్దు చనిపోయి మరుజన్మలో గొప్ప జ్ఞానియై పూర్వజన్మ స్మృతిచేత ఆవేశ్యాంగన దగ్గరకేగి "నీవు నాకు దారపోసిన పుణ్యమేమని అడగ్గా తనకేమీ తెలీదనగా, ఆమె పెంచిన చిలుక ఓయీ ! నేనొక మహర్షి ఆశ్రమాన ఉండేదాన్ని, ఆ ముని ప్రతిదినం భగవద్గీత మొదటి అధ్యాయం పారాయణ గావించేవాడు. అదిరోజూ వినే దాన్నియింతలో ఈవేశ్యవశమయ్యాను. అలవాటు ప్రకారం గీతాపారా యణ గావించ యీామె జాగ్రత్తగా వినేది. అదే ఆమె పుణ్యం" అనగా ! ఆహా! గీత మొదటి అధ్యాయం యింత పుణ్యఫలముందా ? అని వేశ్యా మునీ ఆనాటి నుండి ఆ అధ్యాయాన్ని పారాయణ గావించి ముక్తినొందారు.

## 2వ అధ్యాయ పారాయణ ఫలం

శ్లో॥ శిక్షిత స్తేన పూతాత్మా పఠన్నధ్యాయ మాదరాత్
ద్వితీయ మాససాదోచ్చైః నిరవద్యం పరం పదమ్॥

పూర్వం దేవ శర్మ అనునాతడు ఆత్మజ్ఞానం కొరకు ఒకమునిని అర్థిం చాడు. ఆతడు మేకలుకాయువాని దగ్గరకు పంపాడు. అప్పడామేకల కాపరి దేవశర్మను జూచి అయ్యా ! నాకల మేకలమందదగ్గరకు పెద్దపులి వచ్చింది. అప్పడు మేకలూ, నేను తలొకదారి పట్టాం.1 కాని పులికి కొన్ని

మేకలు దొరికాయి. ఆ పులి వాటిని తినలేదు. అప్పటినుండీ పులీ-మేకలూ మిత్రులైనారు. నేనాశ్చర్యంతో యీవింత చూడగా ఒక ముదుసలి మర్కటం నాకిలా చెప్పింది. ఓయీ ! ఒకముని ఇచట రాతిపలకపై గీత ద్వితీయాధ్యాయం చెక్కించి సుకర్మ అని వానికిచ్చాడు. అతడిచ్చటనే దానిని పారాయణ గావించి ఆత్మజ్ఞానాన్ని ఆర్జించాడు. అది యిచ్చటనే జరిగింది. అందువలన మేకలూ పులీ కలిసి ఉన్నాయి. అందువలన నేను రెండవ అధ్యాయం పారాయణ గావిస్తున్నాను. అలా ఆతడు ఆత్మజ్ఞానాన్ని పొందాడు.

## 3వ అధ్యాయ పారాయణ ఫలం

శ్లో॥ తత్రాధ్యాయం సగీతాయస్తృతీయం సంజాపహ ।

పూర్వము బడుడను వాడు తనజాతి ఆచారాలన్నీ విడిచిపెట్టి దురాచారుడై యుండగా వానిని కొందరు చోరులు ఒక వృక్షము క్రింద చంపారు. ఆతడు ప్రేతమయ్యాడు. ఆ వృక్షాన్ని ఆశ్రయించాడు. కొంత కాలం తరువాత ఆతని కుమారుడు కాశీవెలుతూ ఆతడున్న చెట్టుక్రింద విశ్రాంతి తీసుకొని గీత మూడవ అధ్యాయం పఠించే సరికి ప్రేతరూపాన్ని జడుడు విడిచి దివ్యరూపంతో స్వర్గానికి పోతూ నాయనా ! నీవు పారాయణగావించిన గీత మూడవఅధ్యాయం వలన నేను ప్రేత రూపాన్ని విడిచాను. అందువలన నీవు నిత్యము మూడవ అధ్యాయం పారాయణ గావించు అని ఆశీస్సులిచ్చి పోయాడు.

## 4వ అధ్యాయ పారాయణ ఫలం (శాపముపోవుట)

శ్లో॥ నిత్యమాత్మరతస్తుర్యం జపత్యధ్యాయ మాదరాత్
తదభ్యాసా దదుష్టాత్మా నద్వంద్వైరభిభూయతే॥

పూర్వము సత్యతపుడనువాడు గావించు తపస్సు భగ్నం చేయడానికి మహేంద్రుడు అప్సరసలను పంపాడు. వారి హావభావా లకు ముని కోపించి వారిని రేగుచెట్లుగా శపించాడు. వారలాగే అచట ఉన్నారు. నిత్యం గీతను పారాయణ గావింప భరతుడనువాడా రెండు రేగుచెట్లు క్రింద గీత నాల్గవ అధ్యాయం పారాయణ గావించాడు. ఆ మహా మహిమచేత అప్సరసకాంతలు యధారూపం ధరించి గీతా మహిమ నెన్నుచూ స్వర్గపురి జేరారు.



## 5వ అధ్యాయ పారాయణ ఫలం

( పశు పక్ష్యాదులు గూడా తరించుట )

శ్లో॥ గీతానాం పంచమాధ్యాయమావర్తయతి సర్వదా
తేనపుణ్యేన పూతాత్మా యయౌబ్రహ్మ సనాతనమ్ ॥

పింగళుడు అరుణ అనే దంపతి ఎప్పుడూ కలహిస్తూ మరుజన్మలో గ్రద్ధ, చిలుక రూపాలతో పుట్టారు. పూర్వవిరోధంతో యీ జన్మలోనూ కలహిస్తూ ఉండేవారు. యిలా రెండూ ఒకనరకపాలములో పడి చనిపోయాయి. అప్పడు విష్ణుకింకరులు వారిని తీసుకొని వెళ్ళుచుండగా అయ్యా! మేము పాపాత్ములం. మీరు వైకుంఠానికెందుకు తీసుకు పోతున్నారనగా, వారు మీరు గీత పంచమాధ్యాయం నిత్యపారాయణ గావించు పుణ్యపురుషుని కపాలంలో పడుట వలననే మీకు యీ పుణ్యం లభించింది. అని తెల్పి వారిని వైకుంఠాన చేర్చారు.

## 6వ అధ్యాయ పారాయణ ఫలం

( మహాతేజము కలుగుట )

మునుపు జనశ్రుతుడనే పుణ్యాత్మరాజుండేవాడు. ఆతడు తన భవనమున నుండగా పైన హంసలపిండులో ఒకటి కొంటెగా సంచరించ అందు గల ముదుసలి హంస ఓసీ ! పరమధర్మమూర్తి యగురాజు ముందు నీదుడుకు చేష్టలేమే అనగా "ఓహో చెప్పేవు రైక్వునికన్నా వీడు గొప్పవాడా? అని నవ్వింది. రాజామాటలు విని ఆరైక్వుని కనుగొని రమ్మని భటులను పంపాడు. వారు తిరిగి తిరిగి వచ్చి "మహారాజా ! కాశ్మీరదేశాన మాణిక్యేశ్వర దేవాలయమందు బ్రహ్మతేజోమూర్తి ఉన్నాడు. ఆతడే రైక్వుడనివారు విన్నవించారు. తక్షణము మహారాజాతని దగ్గరకేగి అనేక కానుకలర్పించి మహాత్మా ! నీయీ తేజస్సుకు కారణమేమని అడగ్గా ఆరైక్వుడు స్వామీ ! నాకేమీ తెలీదు. కాని నేను గీత ఆరవ అధ్యాయం పారాయణ గావిస్తాను.

శ్లో॥ గీతానాం షష్ఠమాధ్యాయం జపామ్రత్యహం నృప
తేనైనతేజోరాశి ర్మేసురాణామపి దుస్సహం

## 7వ అధ్యాయ పారాయణ ఫలం

( జీవులందరూ తరించడం )

ఒకప్పుడు శంకుకర్ణుడనేవారు ఎచ్చటికోపోయి ఎప్పటికీరాక పోవుటచేత, ఆతని కుమారులు ఒక మహర్షినిజేరి తండ్రిని గూర్చి తెలుప మన్నారు. ఆతడు తపోదృష్టితో అంతాతెలిసి కొని "నాయనలారా ! మీ పితృదేవుడు చనిపోయాడు. కాని ఆతడు ఆర్జించిన ధనలోభం విడువలేక ఆ నిధిని సర్పరూపం దాల్చి దాన్ని కాస్తున్నాడు. అని చెప్పి ఆ నిధిని వారికా మహర్షి చూపించాడు. ఆతడిలా అన్నాడు.

శ్లో॥ గీతానాం సప్తమాధ్యాయ మంతరేణ సుధామయం
బన్తవజ్జరా మృత్యు దుఃఖ నిరాకరణ కారణమ్ ॥

అనుటవలన మీరు గీతసప్తమాధ్యాయం పారాయణ గావించి, ఆ ఫలం మీ తండ్రికి ధారబోయమనగా, వారట్లేగావించి తండ్రికి పుణ్య ఫలం లభింపచేశారు.

## 8వ అధ్యాయ పారాయణ ఫలం

( మంచి గతులు కలుగుట )

శ్లో॥ జపన్ గీతాష్టమాధ్యాయ శ్లోకార్థం నియతేంద్రియః
సంతుష్టవానహందేవి తదీయ తపసాభృశమ్॥

మునుపు భావశర్మ అనునాతడు పతితుడై రెండవజన్మలో తాడివృక్ష మయ్యాడు. కుశీవల కుమతుల దంపతి కూడా దుర్మార్గులై బ్రహ్మ రాక్షసు లయ్యారు. యీ బ్రహ్మ రాక్షసులు తాడినీడలో కూర్చొని భార్య మనకీ జన్మలెలా పోతాయో! అనగా భర్త మనమధ్యాత్మ బుద్ధితోనున్న పోవు నన్నాడు. కీమద్యాత్మం కిం కర్మపురుషోత్తమ ? అని అడిగింది. యీ వాక్కులు గీత ఎనిమిదవ అధ్యాయం మొదటి శ్లోకమగుట వారికీ, వారాశ్ర యించిన తాడికీ ఉత్తమగతులు వచ్చాయి.

## 9వ అధ్యాయ పారాయణ ఫలం

( గొప్పకున్న పాపం పోవుట )

మునుపు ఒకరాజు వలన ఒక బ్రాహ్మణుడు కాలపురుష దానం అందు కొన్నాడు. దానివలన ఆతనికి చండాల దంపతి జనించి ఘోరంగా హింసింప సాగారు. అప్పుడు విష్ణుదూతలువచ్చి ఆ చెండాల దంపతిని తరిమి బ్రాహ్మణుని కాపాడారు. అదేమని రాజు ఆశ్చర్యంగా ఆతనిని అడగ్గా.



శ్లో॥ గీతాయా నవమాధ్యాయం జపామి ప్రత్యహం నృప
విస్తీర్ణాశ్చాపదస్తేన కుప్రతిగ్రహ సంభవాః

శ్లో॥ గీతాయా నవమాధ్యాయ మంత్రమాలా మయాస్మృతా
తన్మాహాత్మ్యమిదం సర్వం త్వమవేహి మహీపతే

రాజా ! నిత్యం గీత తొమ్మిదవ అధ్యాయపారాయణ గావిస్తాను దాని మహాత్మ్య ఫలం వల్లనే యిలా జరిగిందన్నాడు.

## 10వ అధ్యాయ పారాయణ ఫలం

( ఎంతో దైవ సంపతి )

శ్లో॥ దశమాధ్యాయ మహాత్మ్యాత్తత్త్వజ్ఞానం సుదుర్లభమ్ ।
లబ్ధమేతేన మునినా జీవన్ముక్తి రియం తథా ॥

బ్రహ్మవాహన జాతిదైన ఒక హంస ఒకస్త్రీవలన గీత 10వ అధ్యా యాన్ని విని నందున మరుజన్మలో బ్రాహ్మణ జన్మగాంచి పూర్వస్మృతి వలన నిరంతరం 10వ అధ్యాయం ధారణచేయుటచేత పరమ శివుడే ఆతనికి రక్షకుడైనాడు. యీ విషయాన్ని మహాశివుడే భృంగికి తెలిపాడు.

## 11వ అధ్యాయ పారాయణ ఫలం

( రాక్షస పీడను వీడుట )

ఒకప్పుడొక రక్కసుబారిని తప్పించుకోడానికి ఆ గ్రామ పెద్దలు ఒక నిర్ణయం గావించుకున్నారు. దాని ప్రకారమారక్కసుడు వీధుల్లో పండు కున్న వారినే తినేవాడు. తక్కిన వారిని ముట్టుకొనేవాడుకాడు. తెలియని వారెందరో ఆతనికాహారమయ్యారు. సునందనుడనువాడు యాత్రికులతో వచ్చి పండుకొనగా, ఆతనిని తప్ప తక్కినవారందరినీ ఆ రాక్షసుడు తినే వేశాడు. తరువాత మరుసటి దినం రాక్షసుని యీ వింత గూర్చి అడగ్గా గీత 11వ అధ్యాయం నిత్యమీతడు పారాయణగావించుట చేతనే యీతని ముట్టనైనా ముట్టలేదని ఆ గ్రామ పెద్దలతో రక్కసుడు చెప్పగా,

వారందరూ సునందుముని చేత గీత 11వ అధ్యాయాన్ని పారాయణ గావింపగా ఆ రాక్షసుడాగ్రామాన్ని విడిచి పరుగెత్తాడు.

## 12వ అధ్యాయ పారాయణ ఫలం

( మహాశక్తులు )

ఒకప్పుడు ఒకరాజు సుతుడు ఒక సిద్ధుని చేరి ॥మహాత్మా !నా పిత్రు దేవుడు అశ్వమేధ యాగము గావింపగా గుఱ్ఱము పోయింది. నాతండ్రి మరణించాడు. గుర్రము లభించిన గాని యాగం పూర్తికాదు. నా తండ్రికి సద్గతి లభించాలి. అందువలన ఆ గుఱ్ఱముగూర్చి తమరు తెలియజేయండి అని ప్రార్థించాడు. అప్పడాతడు తన దివ్యశక్తితో మహేంద్రుడు దాచిన ఆ గుఱ్ఱాన్ని తెప్పించాడు. అప్పడు రాకుమారుడు యీ శక్తి ఎలా వచ్చిందని అడుగగా -

శ్లో॥ గీతానాం ద్వాదశాధ్యాయం జపామ్యహ మతన్ద్రితః
తేనశక్తిరియం రాజన్ మయాప్రాప్తో సిఉ జీవితం



రాజకుమారా ! గీత 12 వ అధ్యాయమును నిత్యం పారాయణం గావించుట చేతనే యీ శక్తి కలిగినదని చెప్పెను.

## 13వ అధ్యాయ పారాయణ ఫలం

( పుణ్యము లభించడం )

శ్లో॥ గీతాత్రయోదశాధ్యాయాముద్గిరంతమనారతమ్
తతచ్ఛ్రవణదేవ ముక్తా శ్వపచ విగ్రహాత్॥

మునుపాక ద్విజకాంత చెడిపెయ్యై యింకొక పుట్టువ్వస చండాలాంగనగా పుట్టింది. ఆ చండాలిక వాసుదేవుడు ఒక బ్రాహ్మణుడు జృంభక దేవాలయములో గీత 13 వ అధ్యాయం పారాయణగావిస్తుండగా నిత్యము విని మోక్షమందింది.

## 14వ అధ్యాయ పారాయణ ఫలం

( శత్రువులను జయించుట )

పూర్వమొకరాజు వేటకు వెళ్ళగా కుందేలునువేటకుక్క వెంటాడింది. అలా ఆ రెండు ఒక ఆశ్రమ ప్రాంతానికి వెళ్ళి పరస్పర శత్రుభావాలు విడిచి



అత్యంత మైత్రిని పొందాయి. ఆవింత చూచిన రాజు ఆ మహర్షిని గాంచి యీవింతకు కారణమడిగాడు.

శ్లో॥ చతుర్దశంతు అధ్యాయం జపామ్రప్రత్యహంన్నృప
మదీయ చరణాం భోజనప్రక్షాళన జవేలుఠన్
శశస్త్రి దివమాపన్న శ్శునక్యా సహభూపతే ।

ఆముని రాజా ! నిత్యమూ నేను గీత 14వ అధ్యాయం పారాయణ గావించుటచేత నేను కాళ్ళు కడుక్కొన్న స్థలంలో చేరా కుక్కాకుందేలూ జన్మ విరోధాన్ని వీడాయి. యిదంత గీతామహాత్మ్యమే అని చెప్పాడు.

## 15వ అధ్యాయ పారాయణ ఫలం

( సద్గతి కల్గుట )

శ్లో॥ అథపంచదశాధ్యాయ శ్లోకార్థం లిఖితం క్వచిత్
తతోవాచయతః శ్రుత్వానిరగా త్తురగోదివమ్॥

ఒకరాజు వేటకేగి విశ్రాంతితీసికొనుచుండగా ఎగిరివచ్చిన తాళపత్రం పడింది. దాన్ని రాజు చదువగా రాజుగారి అశ్వము దివ్యరూపుతో ఆకాశానికి పోయింది. ఆవింతను అచట ఆశ్రమ మహర్షుల కీవింత చెప్పగా రాజా ! గీత 15వ అధ్యాయంలోగల సగం శ్లోకం దానిలో ఉండుట అది వినిన గుఱ్ఱం సద్గతినందింది. అని తెల్పగా రాజు ఆనాటి నుండి గీత 15వ అధ్యాయం నిత్యం పారాయణ గావించి తరించాడు.

## 16వ అధ్యాయ పారాయణ ఫలం

( సకల జంతువుతూ వశమగుట )

ఒకరాజుగారి ఏనుగు కట్టువదిలించుకొని నగరంపై బడి విజృంభించింది. ఎవ్వరూ దానిని వారించలేకపోగా యింతలో సామాన్యమైన మనిషి దానికి యెదురుగా నిలబడగా ఆ యేనుగు శాంతించింది, రాజా, నగరవాసులూ యీశక్తి యేమని ? అడిగారు. అప్పడాతడు

శ్లో॥ గీతాయా షోడశాధ్యాయ శ్లోకాన్మతిపయానహమ్
జపామి ప్రత్యహం భూపతేనైతా స్సర్వసిద్ధయః

రాజా! ప్రతి నిత్యమూ గీత 15వ అధ్యాయం పారాయణ నాకీశక్తి నిచ్చింది అన్నాడు.

## 17వ అధ్యాయ పరాయణ ఫలం

( సర్వరోగ సంహారం )

శ్లో॥ గీతాసప్తదశాధ్యాయా జాపకం ద్విజమానయ
తేనాయం మామకోరోగ శ్శామ్యత్మ త్రనసంశయః

ఒక రాజుగారి ఏనుగుకు అనారోగ్యం చేసింది. మహావైద్యశేఖరులు కూడా యేమీ చేయలేక పోయారు. ఆదంతావళం చనిపోతుందని అందరూ నిర్ధారించారు. దానిని చూచుటకు వచ్చిన ఒకాయన "రాజా! యిప్పుడు యేనుగు ముందు గీత 17వ అధ్యాయం పారాయణ గావించండి. అనగా అలాగే చేయింప ఏనుగు ఆరోగ్యవంతురాలైంది.



## 18వ అధ్యాయ పారాయణ ఫలం

( మహాపుణ్యలబ్ధి )

ఒకప్పడు నారాయణ కింకరులొకనిని తీసికొని ఇంద్రుని దగ్గరకేగి మహేంద్రా ! యీతనిని యింద్రుడుగా కొన్నాళ్ళభిషేకించండి. అని శాసించారు. మహేంద్రుడాశ్చర్యముతో నారాయణుని దగ్గరకేగి "నారాయణా! యేమియీవింత? అని అడుగగా, శ్రీహరి చిరునగవుతో "మహేంద్రా! యీతడు గీత 18వ అధ్యాయంలో 5 శ్లోకాలు నిత్యం పారాయణ గావించాడు. అందుకే యింత అర్హత లభించింది అన్నాడు.

శ్లో॥ జపత్యష్టాదాశాధ్యాయే గీతానాం శ్లోకపంచకం
యత్పుణ్యేనచ సంప్రాప్తం తవసామ్రాజ్యముత్తమమ్

అది మొదలు అందరూ గీతను పారాయణ చేయసాగారు.

సర్వం శ్రీగీతార్పణమస్తు



## శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్రమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాన్తయే॥ 1

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥ 2

వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥ 3

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః॥ 4

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే।
సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే॥ 5

యస్య స్మరణమాత్రేణ జన్మ సంసార బంధనాత్।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే॥ 6

ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే

శ్రీవైశంపాయన ఉవాచ :-
శ్రుత్వా ధర్మా నశేషేణ పావనాని చ సర్వశః।
యుధిష్ఠిరః శాంతనవం పునరేవాభ్యభాషత. 7

యుధిష్ఠిర ఉవాచ :-
కి మేకం దైవతం లోకే కిం వాఽప్యేకం పరాయణమ్।
స్తువన్తః కం క మర్చన్తః ప్రాప్నుయుః మానవాశ్శుభమ్. 8
కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జపన్ ముచ్యతే జన్తుః జన్మ సంసారబంధనాత్. 9

శ్రీభీష్మ ఉవాచ :-
జగత్ప్రభుం దేవదేవం అనన్తం పురుషోత్తమమ్ ।
స్తువ న్నామసహస్రేణ పురుషః సతతోత్థితః. 10
తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుష మవ్యయమ్ ।
ధ్యాయన్ స్తువన్ నమస్యంశ్చ యజమానః తమేవ చ. 11

అనాది నిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరం ।
లోకాధ్యక్షం స్తువ న్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్. **12**

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనం ।
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్. **13**
ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః।
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చే న్నర స్సదా. **14**
పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః ।
పరమంయో మహద్బ్రహ్మ పరమం యఃపరాయణమ్. **15**
పవిత్రాణాం పవిత్రం యో మఙ్గళానాం చ మంగళమ్ ।
దైవతం దేవతానాం చ భూతానాం యోఽ వ్యయఃపితా॥ **16**
యత స్సర్వాణి భూతాని భవన్త్యాది యుగాగమే ।
యస్మింశ్చ ప్రళయం యాన్తి పునరేవ యుగక్షయే. **17**
తస్య లోక ప్రధానస్య జగన్నాథస్య భూపతే।
విష్ణో ర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్. **18**
యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే॥ **19**
విష్ణో ర్నామసహస్రస్య వేదవ్యాసో మహా నృషిః।
ఛన్దోఽనుష్టుప్ తథా దేవః భగవాన్ దేవకీసుతః. **20**
అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకి నందనః ।
త్రిసామా హృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే. **21**
విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరం ।
అనేకరూపదైత్యాన్తం నమామి పురుషోత్తమమ్. **22**

**పూర్వన్యాసః** అస్య శ్రీవిష్ణోః దివ్య సహస్రనామ స్తోత్ర మహామన్త్రస్య, శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః, అనుష్టు ప్ఛన్దః, శ్రీ మహా విష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా, అమృ తాం శూద్భవో భానురితి బీజమ్, దేవకీ నన్దన స్స్రష్టేతి శక్తిఃఉద్భవః క్షోభణోదేవ, ఇతి పరమో మన్త్రః, శఙ్ఖభృన్నన్దకీ చక్రీతి కీలకమ్,శార్ఙ్గ ధన్వా గదాధర ఇత్యస్త్రమ్, రథాఙ్గపాణి రక్షోభ్య ఇతినేత్రమ్, త్రిసామా సామగ స్సామేతి కవచం, ఆనన్దం పరబ్రహ్మేతి యోనిః, ఋతుస్సు దర్శనః కాల ఇతి దిగ్బన్ధః, శ్రీవిశ్వరూప ఇతిధ్యానమ్; శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థే(కైంకర్యరూపే) శ్రీ సహస్ర నామ (స్తోత్ర)జపే (పారాయణే) వినియోగః



**కరన్యాసః** విశ్వం విష్ణుర్వషట్కార ఇత్యం గుష్ఠాభ్యాం నమః అమృతాం శూద్భవో భానురితి తర్జనీభ్యాం నమః, బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మేతి మధ్యమాభ్యాం నమః, సువర్ణబిందు రక్షోభ్య ఇతి అనామికాభ్యాం నమః, నిమిషో ఽనిమిషః స్రగ్వీతి కనిష్ఠికా భ్యాం నమః, రథాంగపాణి రక్షోభ్య ఇతి కరతల కరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసః** సువ్రతస్సుముఖస్సూక్ష్మ మితి జ్ఞానాయ హృద యాయ నమః, సహస్రమూర్తిః విశ్వాత్మా ఇతి ఐశ్వర్యాయ శిరసేస్వాహా, సహస్రార్చిః సప్త జిహ్వ ఇతి శ్యక్త్యై శిఖాయై వషట్, త్రిసామాసామ గస్సామేతి బలాయ కవచాయహుం రథాంగపాణి రక్ష్యోభ్య ఇతి నేత్రాభ్యాం వౌషట్, శార్ఙ్గధన్వా గదాధర ఇతి వీర్యాయ అస్త్రాయఫట్ ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బంధః

### ధ్యానమ్

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణి విలసత్ సైకతే మౌక్తికానాం ।
మాలాక్లుప్తాసనస్థః స్ఫటికమణినిభైః మౌక్తికైః మణ్డితాఙ్గః ।
శుభ్రైరభ్రైరదభ్రైః ఉపరి విరచితైః -ముక్తపీయూషవర్షైః ।
ఆనన్దీ నః పునీయాత్అరినళిన గదాశంఖపాణిఃముకున్దః॥
భూఃపాదౌ యస్యనాభిః వియదసు రనిలః చన్ద్రసూర్యౌచనేత్రే।
కర్ణావాసాశ్శిరోద్యౌః ముఖమపి దహనో యస్యవాస్తేయమబ్ధిః
అన్తస్థం యస్యవిశ్వం సురనర ఖగ గో భోగి గన్ధర్వ దైత్యైః
చిత్రం రం రమ్యతే తం త్రిభువనవపుషంవిష్ణుమీశం నమామి॥
శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్।
లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్ ॥ **26**

మేఘశ్యామం పీతకౌసేయవాసం శ్రీవత్సాఙ్కం కౌస్తుభోద్భాసితాఙ్గమ్।
పుణ్యోపేతం పుణ్డరీకాయతాక్షం విష్ణుం వన్దే సర్వలోకైక నాథమ్॥
(నమః సమస్త భూతానాం ఆది భూతాయ భూభృతే ।
అనేక రూప రూపాయ విష్ణవే ప్రభవిష్ణవే ॥)
సశంఖ చక్రం సకిరీటకుణ్డలం స పీతవస్త్రం సరసీరుహేక్షణం ।
సహారవక్షస్థల శోభి కౌస్తుభం నమామివిష్ణుంశిరసా చతుర్భుజమ్॥
ఛాయాయాం పారిజాతస్య హేమ సింహాసనోపరి।
ఆసీనమంబుదశ్యామ మాయతాక్ష మలంకృతమ్। 29
చంద్రాననం చతుర్బాహుం శ్రీవత్సాంకిత వక్షసమ్
రుక్మిణీసత్యభామాభ్యాం సహితం కృష్ణమాశ్రయే. 30

పంచపూజలు

లం - పృధ్వీతత్త్వాత్మనే గంధం సమర్పయామి
హం - ఆకాశతత్త్వాత్మనే పుష్పైః పూజయామి
యం - వాయుతత్త్వాత్మనే ధూపమాఘ్రాపయామి
రం - అగ్నితత్త్వాత్మనే దీపం దర్శయామి
వం - అమృత తత్త్వాత్మనే నైవేద్యం నివేదయామి
సం - సర్వతత్త్వాత్మనే సర్వోపచార పూజాః సమర్పయామి

హరిః ఓమ్

విశ్వం విష్ణు ర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః।
భూతకృత్ భూతభృద్భావో భూతాత్మా భూతభావనః॥ 1

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమాగతిః।
అవ్యయః పురుష స్సాక్షీ క్షేత్రజ్ఞోऽక్షర ఏవ చ॥ 2

యోగో యోగవిదాం నేతా ప్రధాన పురుషేశ్వరః।
నారసింహవపు శ్శ్రీమాన్ కేశవః పురుషోత్తమః॥ 3

సర్వ శ్శర్వ శ్శివస్థాణుః భూతాది ర్నిధి రవ్యయః ।
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభు రీశ్వరః ॥ 4

స్వయమ్భూ శ్శమ్భు రాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాది నిధనో ధాతా విధాతా ధాతు రుత్తమః ॥ 5



అప్రమేయో హృషీకేశః పద్మనాభోऽమరప్రభుః ।
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥ 6

అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః।
ప్రభూత స్త్రికకుద్ధామ పవిత్రం మఙ్గళం పరమ్ ॥ 7

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః ।
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥ 8

ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః ।
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్ ॥ 9

సురేశ శ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః ।
అహ స్సంవత్సరో వ్యాళః ప్రత్యయ స్సర్వదర్శనః ॥ 10

అజ స్సర్వేశ్వర స్సిద్ధః సిద్ధి స్సర్వాది రచ్యుతః ।
వృషాకపి రమేయాత్మా సర్వయోగ వినిస్సృతః ॥ 11

వసు ర్వసుమనా స్సత్యః సమాత్మా సమ్మిత స్సమః ।
అమోఘః పుణ్డరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ 12

రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోని శ్శుచిశ్రవాః ।
అమృత శ్శాశ్వతః స్థాణుః వరారోహో మహాతపాః॥ 13

సర్వగ స్సర్వవిద్భానుః విష్వక్సేనో జనార్దనః।
వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః॥ 14

లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రశ్చతుర్భుజః ॥ 15

భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః ।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ 16

ఉపేన్ద్రో వామనః ప్రాంశుః అమోఘ శ్శుచి రూర్జితః ।
అతీన్ద్ర స్సంగ్రహ స్సర్గో ధృతాత్మా నియమో యమః॥ 17

వేద్యో వైద్య స్సదా యోగీ వీరహా మాధవో మధుః।
అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః ॥ 18

మహాబుద్ధిర్మహావీర్యో మహాశక్తిర్మహాద్యుతిః।
అనిర్దేశ్యవపు శ్శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృత్ ॥ 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాంగతిః ।
అనిరుద్ధ స్సురానన్దో గోవిన్దో గోవిదాం పతిః ॥ 20
మరీచి ర్దమనో హంసః సువర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః॥ 21

అమృత్యు స్సర్వదృక్సింహః సన్ధాతా సన్ధిమాన్ స్థిరః।
అజో దుర్మర్షణ శ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా॥ 22
గురు ర్గురుతమో ధామ సత్య స్సత్య పరాక్రమః।
నిమిషోఽనిమిష స్స్రగ్వీ వాచస్పతి రుదారధీః॥ 23

అగ్రణీర్గ్రామణీ శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్॥ 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః ।
అహస్సంవర్తకో వహ్నిః అనిలో ధరణీధరః ॥ 25
సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వ ధృగ్విశ్వభుగ్విభుః ।
సత్కర్తా సత్కృతస్సాధుః జహ్నుర్నారాయణో నరః॥ 26

అసంఖ్యేయోఽ ప్రమేయాత్మా విశిష్ట శ్శిష్టకృచ్ఛుచిః ।
సిద్ధార్థః సిద్ధసఙ్కల్పః సిద్ధిద స్సిద్ధి సాధనః ॥ 27
వృషాహీ వృషభో విష్ణుః వృషపర్వా వృషోదరః ।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్త శ్రుతిసాగరః ॥ 28

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుదో వసుః ।
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః ॥
ఓజస్తేజో ద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
ఋద్ధః స్పష్టాక్షరో మన్త్రః చన్ద్రాంశుర్భాస్కరద్యుతిః ॥ 30

అమృతాంశూద్భవో భానుః శశిబిన్దుస్సురేశ్వరః।
ఔషధం జగత స్సేతుః సత్యధర్మ పరాక్రమః ॥ 31
భూతభవ్య భవన్నాథః పవనః పావనోఽనలః
కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః॥ 32

యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః।
అదృశ్యోఽవ్యక్తరూపశ్చ సహస్రజిదనన్తజిత్॥ 33



ఇష్టోవిశిష్ట శ్శిష్టేష్టః శిఖణ్డీ నహుషోవృషః।
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః ॥ 34
అచ్యుతఃప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాంనిధి రధిష్ఠానం అప్రమత్తః ప్రతిష్ఠితః॥ 35

స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయువాహనః।
వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురన్దరః ॥ 36
అశోక స్తారణ స్తారః శూరశ్శౌరి ర్జనేశ్వరః।
అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ 37

పద్మనాభోఽరవిన్దాక్షః పద్మగర్భశ్శరీరభృత్ ।
మహర్ధి ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ 38
అతులశ్శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః।
సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీవాన్ సమితిఞ్జయః ॥ 39
విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదర స్సహః।
మహీధరో మహాభాగో వేగవానమితాశనః ॥ 40
ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః।
కరణం కారణం కర్తా వికర్తా గహనోగుహః॥ 41

వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః।
పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టశ్శుభేక్షణః॥ 42
రామో విరామో విరజో మార్గో నేయో నయోనయః।
వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః॥ 43

వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః ॥ 44
ఋతుస్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్రస్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ 45
విస్తారః స్థావరః స్థాణుః ప్రమాణం బీజమవ్యయం।
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ 46

అనిర్విణ్ణః స్థవిష్ఠో భూః ధర్మయూపో మహామఖః।
నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామస్సమీహనః ॥ 47

యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుస్సత్రం సతాం గతిః।
సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞాన ముత్తమమ్ ॥ 48

సువ్రతస్సుముఖస్సూక్ష్మః సుఘోషస్సుఖదస్సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః ॥ 49

స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ 50

ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదసత్ క్షరమక్షరమ్ ।
అవిజ్ఞాతా సహస్రాంశుః విధాతా కృతలక్షణః॥ 51

గభస్తినేమిస్సత్వస్థః సింహో భూతమహేశ్వరః ।
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ 52

ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః
శరీరభూతభృద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః॥ 53

సోమపోఽమృతపస్సోమః పురుజిత్పురుసత్తమః।
వినయోజయస్సత్యసన్ధో దాశార్హ స్సాత్వతాంపతిః॥ 54

జీవో వినయితా సాక్షీ ముకున్దోఽమిత విక్రమః।
అమ్భోనిధి రనన్తాత్మా మహోదధిశయోఽన్తకః ॥ 55

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
ఆనన్దో నన్దనో నన్దః సత్యధర్మా త్రివిక్రమః॥ 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః।
త్రిపదస్త్రిదశాధ్యక్షః మహాశృఙ్గః కృతాన్తకృత్ ॥ 57

మహావరాహో గోవిన్దః సుషేణః కనకాఙ్గదీ ।
గుహ్యోగభీరో గహనో గుప్తశ్చక్ర గదాధరః ॥ 58

వేధాస్స్వాంగోఽ జితఃకృష్ణో దృఢస్సఙ్కర్షణోఽచ్యుతః।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః॥ 59

భగవాన్ భగహానన్దీ వనమాలీ హలాయుధః।
ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః ॥ 60

సుధన్వా ఖణ్ణపరశుః దారుణో ద్రవిణః ప్రదః ।
దివిస్పృక్సర్వ దృగ్వ్యాసో వాచస్పతి రయోనిజః ॥ 61



త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం భిషక్।
సన్యాసకృచ్ఛమశ్శాన్తో నిష్ఠాశాన్తిః పరాయణమ్॥ 62

శుభాంగశ్శాన్తిదస్స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ 63

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః ।
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః ॥ 64

శ్రీదశ్శ్రీశః శ్రీనివాసః శ్రీనిధి శ్శ్రీవిభావనః।
శ్రీధరశ్శ్రీకరశ్శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః॥ 65

స్వక్ష స్స్వఙ్గ శ్శతానన్దో నన్దిర్జ్యోతి ర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్న సంశయః ॥ 66

ఉదీర్ణస్సర్వతశ్చక్షుః అనీశ శ్శాశ్వతః స్థిరః।
భూశయో భూషణో భూతిః విశోక శ్శోకనాశనః ॥ 67

అర్చిష్మా నర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః॥ 68

కాలనేమినిహా శౌరిః శూర శ్శూరజనేశ్వరః।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః॥ 69

కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః।
అనిర్దేశ్యవపుః విష్ణుః వీరోఽనంతో ధనుంజయః ॥ 70

బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మ బ్రహ్మ బ్రహ్మ వివర్ధనః।
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః॥ 71

మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ 72

స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతః స్తోతా రణప్రియః।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః॥ 73

మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః।
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః॥ 74

సద్గతి స్సత్కృతిస్సత్తా సద్భూతి స్సత్పరాయణః।
శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాస స్సుయామునః ॥ 75

